## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100051731



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పలనాటి వీరభారతము

(దృశ్యకావ్యము)



: కృతికర్త :

'విద్వాన్', పింజల సోమశేఖరరావు

# పీఠిక

ఆంధ్ర పౌరుషము పెల్లుబికిన, వెయ్యేండ్ల కీవల జరిగిన, వీరగాథా పరంపరలో పలనాటి వీరచరిత్రకున్న ప్రాముఖ్యమూ ప్రాచుర్యమూ ఎనలేనిది. విశేషించి మహాభారతముతోడి తులనాత్మకతను బట్టి వీర భారతముగా ఇది తెలుగునాట విఖ్యాతమై విస్తృత వ్యాప్తి గాంచినది. వెయ్యేండ్లనాడే వర్ణ విభేదము వలన జాతికి కలుగు ముప్పును గుర్తించి, బ్రహ్మనాయుడు, సర్వవర్ణ సమైక్యతా భావముతోగూడిన, చాపకూటి సిద్ధాంతము మహామంత్రిగా అమలు పరచుటయేగాక, ఆయన అనుసరించిన ఆనాటి రాజనీతి, అన్ని కాలాలకూ, అన్ని దేశాలకూ ఆదర్శమైనది. ఏనాటికైనా విశ్వశాంతి కావలయునన్నప్పుడు దానిననుసరింపక తప్పదు.

ఉపదేశాత్మకమైన ఈ వీరగాథ నెన్నంతో ఉత్తేజపఱుచ నాలుగు దశాబ్దాలకు పూర్వము నా కవితాభినివేశపు తొలదశయందు నాటక రచనలో తొలిరచనగా "పలనాటి యుద్ధము" మలిరచనగా "శివలీల" రచించి ప్రదర్శనావకాశములు కలిగించితిని.

ఏమఱని నా కవితా వ్యవసాయముతోనే "విద్వాన్" పట్టపరీక్షకు చదివి, స్థానికోన్నత పాఠశాలయందు ఒజ్జన మొనర్చుచు 1959లో "గ్రంథాలయ మహాసారథి" కీ. శే. అడుసుమల్లి శ్రీనివాసరావుగారి ప్రేరణమున పలనాటి వీరచరిత్రలోని ఒక సన్నివేశమగు మగువ మాంచాల మగనికి రక్తతిలకముదిద్ది రణరంగమున కుఱికించు మహత్తర రసవత్తర విషయము కథా వస్తువుగా స్వీకరించి హృద్య పద్యములతో ఒక చిన్న కావ్యము రచించి, వేటపాలెము సారస్వత నికేతన ప్రతిష్ఠాపకులు కీ. శే. ఊటుకూరి వేంకట సుబ్బరాయ శ్రేష్ఠిగారి దివ్యస్మృతి చిహ్నముగా వెలువరించితిని. అది ఆంధ్రకావ్య కవితా సరస్వతికి చిన్నారి చేర్పుక్కగా నా సంతరింపు.

ఇంతియేకాక, ఎవరో యక్షగాన కథకులు వచ్చికోరగా అలుగురాజు వృత్తాంతముతో మొదలిడి చివరిదాకా రెండు మూడు రోజుల కథా కథనమున కుపయోగపడునట్లు సమగ్రముగ "పలనాటి వీర చరిత్రము" యక్షగానకృతి మఱొకటి రచించితిని. అది ఆంధ్ర యక్షగాన కవితా సరస్వతికి మంజుల శింజాన మణి మంజీరముగా వెలువరించు యోగమున్నదో లేదో!

కాని, ఏదో చేయుదుమని సన్నుతికించిన ప్రోత్సాహకుల ఉత్సాహమొక పాలపొంగు వంటిదై పొంగి చప్పబడినది. ఆ యక్షగాన కృతి నా అముద్రితాల ముసుగు దొంతరలలో చోటుచేసుకొని, చీకటి బ్రతుకు బ్రతుకు చున్నది.

దానితో ఆగక, సమగ్ర పలనాటి వీరచరిత్రకు నాటకీకరణము నేనే ఒనర్చినవాడను కావలయునను కోరిక నన్నూరుకోనీయనందున వెనుక నా రచించిన "పలనాటి యుద్ధము" నాటకమును పునఃపరిశీలనముతో సంస్కరించుటయేగాక ఎంతో విస్తరించి, 'నాయకురాలు నాగమ్మ", "అలరాజు రాయబారము", "పలనాటి వీరపతనము" అను మూడు నాటకములుగా విభజించితిని. ఈ మూడింటి సంపుటీకరణమే "పలనాటి వీర భారతము".

ఇది ప్రదర్శనానుకూలముగా రచించిన మహా దృశ్యకావ్యమగుట పాఠకులకూ, పాత్రధారులకూ, సుగమముగా ఉండవలయునని, ఇందు భాషా వ్యాకరణ నియమ నిబంధనల విషయమున కొంత స్వతంత్రించితిని. ద్రుత ప్రకృతికములపై వచ్చు అచ్చులకు పరుషములకు నుగాగమ సరళాగమాలను మానీ, అర్థ స్ఫురణకోసము కొంత విరామముంచి, అచ్చులను పరుషములనే ఉపయోగించితిని. సంధిలేనిచోట వచ్చు యడాగమాలకు బదులుగ అచ్చులనే ఉంచితిని. ఉచ్చారణలో లేని అరసున్న గొడవెందుకని, 'అఁ ఉఁ' అను అర్ధోచ్చారణలందు తప్ప తక్కినచోట్ల అరసున్నను పూర్తిగ మానివేసితిని.

పూర్వ నాటకములందలి అంక విభజనకు బదులు సమయావకాశములనుబట్టి ప్రదర్శనోపయుక్తముగ నుండునని, విషయ విభజన కావించితిని. ఉభయ లాక్షణికులు దీనికి సమ్మతింతురుగాక!

అముద్రితాల చీకటి ముసుగు వదలించుకొని ఈకృతి ఇప్పటికైన లోకావిష్కృతి కాగలుగుటకు తమ సహకారము సౌజన్యము అందించిన ఉదార స్వభావులు మాష్టరు వీవరు మహాశయుల నామ ధేయములు ప్రకటించుట నా విధిగా భావింతును.

| | |
|---|---|
| శ్రీ బుద్ధి దక్షిణామూర్తిగారు | అణుమల్లిపేట |
| ,, గుత్తి శరభయ్య సన్సువారు | ,, |
| ,, తేళ్ళ వెంకటేశ్వర్లుగారు | దేవాంగపురి |
| ,, గౌరాబత్తుని వీరనాగేశ్వరరావు & బ్రదర్ | ,, |
| ,, బట్ట శంకరరావుగారు | ,, |
| ,, బట్ట మోహనరావుగారు | ,, |
| ,, పేరిశెట్ల మోహనరావు బసవాచారిగార్లు | అణుమల్లిపేట |
| ,, గుత్తి భానుమతి వెంకటసుబ్బారావుగార్లు | ,, |
| ,, బొగ్గుల వెంకటసుబ్బారావుగారు | ,, |
| ,, బుద్ధి లంబోదరరావుగారు | ,, |
| ,, దేవన వెంకటేశ్వర్లుగారు | ,, |
| ,, చల్లా మోహనరావుగారు | హస్తినాపురం |
| ,, ఊమ్మిటి పకీరయ్యగారు | పేటపాలెం |
| ,, చేనేత పారిశ్రామిక సహకార సంఘము | ,, |
| ,, గీతా హ్యాండులూమ్ ఎక్స్‌పోర్టర్స్ బ్రాంచి | ,, |
| ,, చల్లా జనార్దనరావుగారు | దేశాయపేట |
| ,, పింజల కోటసుబ్బారావుగారు | ,, |
| ,, పింజల సోమశేఖరరావుగారు | ,, |
| ,, పింజల లోకనాథంగారు | రావూరిపేట |
| ,, పింజల షణ్ముఖరావుగారు | ,, |
| ,, పింజల వీరకోటయ్యగారు | ,, |
| ,, బొడ్డు శంకరరావు, గౌరాబత్తుని చినవేంకట సుబ్బారావు, వెంకటేశ్వర్లుగార్లు | ,, |
| ,, మేకల బాలసుబ్రహ్మణ్యంగారు | ,, |
| ,, పింజల సాంబశివరావు, ఒలుకుల యానాదిరావు, గౌరాబత్తుని రామారావుగార్లు | ,, |
| ,, గౌరాబత్తుని వెంకట సుబ్బారావుగారు | ,, |
| ,, గుత్తి వెంకటసుబ్బారావుగారు | ,, |
| ,, జాగాబత్తుని నాగేశ్వరరావుగారు | ,, |
| ,, తేళ్ళ మార్కండేయుగారు | ,, |

,, గుత్తి వీరభద్రయ్యగారు దేవాంగపుత్రి

నా సాహిత్య ప్రోత్సాహకులుగా తోడ్పడుచున్న

| | |
|---|---|
| శ్రీ పింజల సుబ్రహ్మణ్యం | వేటపాలెము |
| ,, బండారు సుబ్బారావు | ,, |
| ,, పింజల అహోబలేశ్వరరావుగారు | ,, |
| ,, జాగాబత్తుని నాగలింగేశ్వరరావుగారు | ,, |
| ,, పింజల వెంకటేశ్వర్లుగారు | దంతంపేట |
| ,, మాచర్ల కోటేశ్వరరావుగారు | ,, |
| ,, దంతం హనుమంతరావుగారు | ,, |

వీరందరిపట్ల జగదంబయగు చౌడాంబ కృపావలంబనగా, నా వేడికోలు!

ఈ కృతి సుందరాకృతిగా వెలువడుటకు ముద్రణ విషయమేగాక ముఖచిత్రము వ్రాయించుటలోగూడ శ్రద్ధతీసుకొని, నాకు సహకరించిన నవోదయ ఆర్టు ప్రింటర్స్ ప్రొప్రైటరు శ్రీ గుండపు పూర్ణచంద్రరావు (చీరాల) గారికిని, ముఖచిత్ర నిర్మాత కల్పనా ఆర్ట్సు శ్రీ వెంకట్రావు గారికిని, ముఖచిత్ర ముద్రాపకులు విజయలక్ష్మి గ్రాఫిక్స్ శ్రీ బి యల్. ప్రసాదుగారికిని నా హృదయ పూర్వక కృతజ్ఞతాభినందనలు.

పలనాటి వీర చరిత్రపై నాకున్న జాతీయాభిమానాన్ని పురస్కరించుకొని, "పలనాటి వీరభారతము" ఆంధ్ర నాటక కవితా సరస్వతికి, అపూర్వ సువర్ణ రత్నహారముగా అర్పించుకొన గలిగితిని తృప్తోఽస్మి!

వేటపాలెం రావూరిపేట, ఇట్లు

ది. 4-2-88 గ్రంథకర్త

# పలనాటి వీరభారతము

ఇందలి మూడు నాటకములందు వచ్చు పాత్రలను సంఖ్యా నిర్దేశమున గ్రహింపగలరు.

—: పురుషులు :—

| పాత్ర | | వివరము | నాటకములు |
|---|---|---|---|
| బ్రహ్మనాయుడు | : | మహామంత్రి | 1, 2, 3 |
| నలగామరాజు | : | పలనాటి ప్రభువు | 1, 2, 3 |
| నరసింగరాజు | : | యువరాజు | 1, 2, 3 |
| మలిదేవరాజు | : | మాచెర్ల ప్రభువు | 1, 2, 3 |
| కొమ్మరాజు | : | మలిదేవరాజు బావమరది | 1, 2, 3 |
| గండు కన్నమనీడు | : | మాంచాల తండ్రి | 1, 2, 3 |
| అలరాజు | : | నలగామరాజల్లుడు | 1, 2 |
| బాలచంద్రుడు | : | బ్రహ్మనాయుని కుమారుడు | 1, 2, 3 |
| కన్నమదాసు | : | మలిదేవరాజు సైన్యాధిపతి | 1, 2, 3 |
| వీరారెడ్డి | : | నలగామరాజు సైన్యాధిపతి | 3 |
| కేతరాజు | : | ధరణి కోటరాజు | 3 |
| పూజారి | : | అలరాజునకు విషపు పుష్పమిచ్చినవాడు | 2 |
| రంగిరెడ్డి | : | బ్రహ్మనాయుని పక్షమువాడు | 1, 2 |
| గంగిరెడ్డి | : | నాగమ్మ పక్షమువాడు | 1, 2 |
| గోపన్నమంత్రి | : | నాయకురాలి గురువు | 1 |
| అనపోతన్న | : | బాలచంద్రుని అనుచరులు | 3 |
| చాకలిచందు | : | ,, | 3 |
| మంగలి మల్లు | : | ,, | 3 |
| గోపీనాయుడు | : | యుద్ధ పర్యవేక్షకుడు | 3 |
| దామానాయుడు | : | ,, | 3 |

—: స్త్రీలు :—

| పాత్ర | | వివరము | నాటకములు |
|---|---|---|---|
| నాయకురాలు | : | మంత్రిణి | 1, 2, 3 |
| అయితమాంబ | : | బ్రహ్మనాయుని భార్య | 1, 3 |
| పేరిందేవి | : | నలగామరాజు ఏకైక పుత్రిక | 1 |
| మాంచాల | : | బాలచంద్రుని భార్య | 3 |

ఇంకా చెలికత్తెలు, సేవకులు వత్తురు.

# నాంది

(వీరగీతము)

వీరరక్తముచింది ఏఱులై వాగులై
కారెమాపురి ఘోరకదన రంగమునందు
వాగులేత్తై పాఱెరా! పలనాటి నాటి పౌరుషమెంచరా!

కోడిపందెమ్ములో కోరమీసలఁదువ్వి
కూడని స్వార్థాల కుమ్ములాటలలోన
వాడికత్తులు మెఱసెరా! పొంగులు వారి నెత్తురు కురిసెరా!

బ్రహ్మనాయుని నీతి బాలచంద్రుని హేతి
బ్రహ్మ కల్పాంతముల్ పరిధ విల్లిసగాని
చెఱిగిపోవని ముద్రరా! పలనాడు చిరకీర్తులకు పంటరా!

రమణీ నాయకురాలు, రాజనీతిజ్ఞతను
అమర మంత్రులగుండె — అదరి ఊటాడంగ
మేటియై రాణించెరా! ముంజేత మీసాలు చూపించెరా!

మగువ మాంచాలమ్మ మగని మోహముమాన్పి
తెగువమీరగ వీర తిలకంబునేదిద్ది
పగరపై కుఱికించెరా! భళిభళీ! జగములే పులకించెరా!

వీరగాథలు త్రివ్వి ద్విపదలాలాపించి
తీరుతెన్గునబాడె తెలుగు వారలు మెచ్చ
వీర చరితము విప్పరా! శ్రీనాథు వీరసూక్తులు చాటరా!

# పలనాటి వీరభారతము

## నాయకురాలు - నాగమ్మ

### గురిజాల ! నాగమ్మ మంత్రిపదవి

నలగామరాజు, బ్రహ్మనాయుడు, వందిమాగధులస్తోత్రపాఠములతో ప్రవేశము

వంది :- జయ జయ సకల సామంత శిరస్సంఘటితపాద సరోజా! వీర కామేంద్ర బిరుద విభ్రాజా! మైలమాంబాతనూజా! నలగామ మహారాజా! బహుపరాక్!

2 వంది:- జయ జయ బిరుదు బిట్టురుగండా! జగమెచ్చుగండా! గండర గండ గండభేరుండా! చండదోర్దండా! బ్రహ్మన్న మహామంత్రీ! బహుపరాక్!

(నలగామరాజు బ్రహ్మనాయుడు ఉపవిష్టులగుదురు)

నలగా :- బ్రహ్మన్నమహామంత్రీ! తండ్రి అలుగురాజులుంగారి తరువాత మన పరిపాలన మెంతవరకు ప్రజారంజనము గాంచునో?

బ్రహ్మ :- అడుగుచుంటివా మహారాజా! పలనాటి రాజ్యము రామరాజ్యము గావింపవలయునని నా తహ తహ. ఆంధ్రావనికి పలనాటిసీమ తలమానికముగావలయునని నా ప్రాకులాట.

నలగా :- ప్రజాశ్రేయమే ధ్యేయముగా పరిపాలనము సాగింపవలయునని కోరికపడుచున్నాను మహామంత్రీ!

బ్రహ్మ :- అందుకు నా బుద్ధిబలము జోడించి మనసా వాచా కర్మణా పాటుపడెద.

గండు :- (అంతలోవచ్చి) అపర బృహస్పతులగు బ్రహ్మన్నగారి బుద్ధిబలమునకుతోడు కన్నమనీని బాహుబలమున్నది. పలనాటి రాజ్యము శత్రుజనదుర్నిరీక్ష్యము కావించెదము మహారాజా!

నలగా :- సమయమునకు వచ్చితివి సేనాపతీ! కూర్చుండుము. మీరిద్దఱు మహామంత్రులుగా సేనాపతులుగా రాజ్యము ఓద్దుచుండ నాకేమి తక్కువ?

బ్రహ్మ :- పలనాటి ఉజ్వలభవిష్యత్తునకు ఉదాత్తాశయాలెన్నో గుండెలో గూడుకట్టుకొనియున్నవి మహారాజా!

గండు :- నీ బంగారు కోరికలు పండించుటకు నా భుజబలము హాలమం గావించెదను మహారాజా!

నలగా :- ఎంతో ఉప్పొంగుచున్నాను.

బ్రహ్మ :- దశలు దశలుగా దేశమభివృద్ధి పదములకు మలుపుకొను పదకములు రచింతుము. కులమతములలో ఎక్కువ తక్కువలనెడు ఎగుడు దిగుడులతో రాజ్యాంగ రథము నడుపలేము. జాతీయ పునర్వ్యవస్థీకరణము జరుగవలయును ధనికుల పేదల మధ్య, అధికారుల, అనధికారులమధ్య సవర్ణుల, అసవర్ణులమధ్య అగాధము లొక్కొక్కటి పూడ్చివేయవలయును.

సీ॥ అతి నికృష్టంబైన అస్పృశ్యతా మహా
బ్రహ్మరాక్షసి కోఱలను పెకల్చి
కులములలోని యెక్కువ తక్కువ లనెడి
బీరపీచుల చిక్కు వెడల జేసి
మతములందలి అసమ్మతముల పేరిటి
కొండలు పిండిగా గొట్టివైచి
స్వార్థపరుల యథేచ్ఛా భావ వీధుల
యిఱుకు బాటలనెల్ల జెఱపివేసి
నవసమాజంబు నందు జనంబులకును
రాజకీయపు న్యాయ సూత్రాలుపలని
బ్రహ్మనాయుని అకుటిల రాజనీతి
పసిడిపంటలు పండించు పల్లెబాట

గండు :- సర్వసమతా వాదముతో గూడిన యీ నవతతో పలనాటి రాజ్య సౌధమునకు గట్టి పునాదులు వేసికొనవలయును.

నలగా :- నవతా సిద్ధాంతము సవర్ణులకు దుస్సహమగునేమోగదా!

బ్రహ్మ :- కావచ్చు అది స్వార్థపర మానవలక్షణము. కులమత భేద మహా భూధరచ్ఛేదనకు సర్వవర్ణ సమతావాదమె వజ్రాయుధము అందుకే మన చాపకూటి సిద్ధాంతము.

నలగా :- చాపకూటి సిద్ధాంతము కొందఱి కేవగింపుగానున్నది మహామంత్రీ!

బ్రహ్మ :- ఉండనీ మహారాజా! ఈ మహోద్యమము క్రమముగా సత్ఫ

లితములీయక మానదు. కులములలో ఎక్కువ తక్కువలు మనము తెచ్చిపెట్టుకున్నవి గాని దైవ సృష్టిలోనివి కావుగదా! కొఱమాలిన యీ కులభేదములతో జాతి చీలికలైనపుడు దేశము దుర్బలమై విజాతీయ పరిపాలనకగ్గముగాదా? జాతీయ సమతా భావమే దేశమునకు కంచుకోట.

గండు :- ఈ మహాశయము సాఫల్యమందవలయునన్న ప్రజాచైతన్య మెంతైన అవసరము.

నలగా :- ప్రజలు కప్పల తక్కెడ సామెతకు జెందినవారు. ఒకడు కుదిరిన ఇంకొకడు కుదరడు.

కన్నమ :- అది నిజమే ఒకడు మెట్టకీడ్చిన ఒకడు గుంట కీడ్చును.

బ్రహ్మ :- బూజుపట్టిన ప్రాత సిద్ధాంతాలతో నవ్యతను ఛీత్కరించువారు న్నారు. అగ్రియులకు అసమానతయే వాంఛనీయము సమానత వారికి శిరోవేదనా దోదూయమానము.

నలగా :- పైకిపోయినవాడు క్రిందివానినడగద్రొక్కును పతయాతురనుద్ధరించువారులేరు. ప్రజలలో హెచ్చులొచ్చులు అప్పవెమో?

బ్రహ్మ :- అవి తప్పనప్పుడు దేశమున అశాంతి తప్పదు. అశాంతి చెలరేగినప్పుడు దేశమల్లకల్లోలముకాక తప్పదు.

గండు :- ప్రజలలో చైతన్యము కలుగునదెప్పుడో?

బ్రహ్మ :- దేశకల్యాణమునకు కంకణముకటుకొని కత్తిపదును మీద నడక సాహసకము. దేవునిమీద భారముంచి ఉద్యమింతము ఫలితము ప్రాప్తాధీనము.

సేవక :- (ప్రవేశించి) జయము జయము మహాప్రభువులకు. ఎవరో నాగమ్మయట, వచ్చి ద్వారమువద్ద వేచియున్నది.

నలగా :- ఎవరీనాగమ్మ?

బ్రహ్మ :- ఎప్పుడోవిన్న పేరుగనేయున్నది,

గండు :- సర్పనామధేయ! ఇక్కడికెందులకు వచ్చినదో? ఆమెకు మనతో రాజకీయములేమి వచ్చినవో?

నలగా :- సేవకా! ఆమె నిటురమ్మనుము.

సేవ :- (వెళ్లి నాగమ్మను బంపును)

నాయ :- (ప్రవేశము) జయము జయము మహాప్రభువులకు, అలుగు

రాయల తనూభవులకు (నమస్కరించును)

**నలగా :-** ఎవరు నీవు?

నాయ :- నేను ఆరవిల్లి నాగమ్మను. చౌదరి రామిరెడ్డి కొమార్తెను.

నలగా :- (చకితుడై) ఏమీ చౌదరి రామిరెడ్డి కొమార్తెవా?

నాయ :- ఏలట్లు చకితులైతిరి? ఆయనమీకు పరిచితుడా?

బ్రహ్మ :- నిది చిట్టిగామాల పాడన్నమాట.

నాయ :- ఆఁ, మమ్ములను మీరెఱిగియే యుంటిరన్నమాట

నలగా :- ఇప్పుడు మాతో నీకేమి పనియుండివచ్చితివి?

**నాయ :-** చిత్తగింపుడు. మీ తండ్రి అలుగురాజుగారు మా కొక దాన పత్రము వ్రాసియిచ్చినారు. పరిగ్రహింపుడు (పత్రమిచ్చును)

**నలగా :-** (పత్రము పుచ్చుకొని చదువును) "శ్రీ శ్రీ శ్రీ పలనాటి ప్రభువులు అలుగురాజుగారు చిట్టిగామాలపాడు గ్రామనివాసిని ఆరవిల్లి నాగమ్మకు వ్రాసియిచ్చిన పత్రము పొతురాలగు నాగమ్మ, మేము చిట్టిగామాలపాడునకు దక్షిణముగానున్న అడవులకు వేట కేగి అలసి తిరిగి వచ్చుచుండ మమ్ముల నాహ్వానించి, మజ్జన భోజనాద్యతిథి సత్కారములొనర్చి ఎంతో సంతోషపెట్టినది. నాగమ్మ, మూడులోజులపాటు రాజ్యాంగమున మంత్రిత్వాధికారము కోరినదికాన, ఇప్పుడుగాని మరెప్పుడుగాని నేనుగాని, నా కుమారులు గాని నెరవేర్పగలమని హృదయపూర్వకముగా అంగీకార పత్రము వ్రాసియియ్యడమైనది"

ఇట్లు
అలుగురాజు.

బ్రహ్మ :- ఆడుదానికి మంత్రిత్వమా?

గండుక :- ఇందేదో అంతరార్థమున్నట్లు తోచుచున్నది మహారాజా!

నలగా :- అంతరార్థమేమున్నను తండ్రిగారిమాట చెల్లించుట విధి.

బ్రహ్మ :- తొందరపడుచున్నావు మహారాజా!

నలగా :- మహామంత్రీ! పితృాజ్ఞాపరిపాలనము మాకవశ్యాచరణీయము. అడుగలేదుగాని రాజ్యమీయుడన్నను ఇచ్చివేయుదును.

నాయ :- సూర్యవంశపురాజులు సత్యసంధులు.

బ్రహ్మ :- ఒక్కటి అడుగుచున్నాను నాగమ్మా! ఆనాడు అలుగురాజుగారు

వేటకు వెళ్లి వచ్చునప్పుడు ఆయనకు సాయము చేయుటకు ముందుగా నీవెట్లు సిద్ధపడితివి?

నాయు :- ఏమిప్రశ్నయిది? అది, కాకతాళీయముగనే జరిగినది. పరిజనముతో అలుగురాజుగారు వేటాడి తిరిగి మాయూరిమీదుగా వచ్చినప్పుడు ఏదో యథోచితముగ అతిథి సత్కారము జరిపితిని. దీనికి పెద్ద సిద్ధపడవలసినదేమున్నది?

బ్రహ్మ :- మహారాజుగారు నీకు మంత్రిత్వమిచ్చెదననినారా?

నాయు :- వారు స్వయముగా వ్రాసియిచ్చిన పత్రమున్నదిగదా! మరల చదువుకొనుడు.

బ్రహ్మ :- నీవు కోరిన మంత్రిత్వము ఆయన ఉండగనే యేల పొందలేదు.

నాయు :- అప్పుడే పొందవలయునని కోరికలేదు. అదిగాక అప్పటి గృహచ్ఛిద్రములలో నాకదిపట్టలేదు

బ్రహ్మ :- మంత్రిపదవీ నిర్వహణకు రాజ్యతంత్రజ్ఞత యెంతైన అవసరము నీవు చదువుకొంటివా?

నాయు :- ఏదోకొంత, నా నిర్వాహకత మూడునాళ్లది బ్రహ్మనాయుడా!

నలగా :- నాగాంబా! మా తండ్రిగారు నీకిచ్చిన వరము ననుసరించి. యిప్పుడే నీకు మంత్రిపదవి యిచ్చుచున్నాను పరిగ్రహించి, నన్ను పిత్రాజ్ఞా పరిపాలకునిగా వింపుము. ఇదిగో మంత్రిదండము.

నాయు :- కృతార్థురాలను మహారాజా! (మంత్రిదండము పుచ్చుకొనును)

బ్రహ్మ :- నలగామరాజా!

గంజు :- మహారాజా!

నలగా :- మహామంత్రీ! సేనాపతీ! మీ మాట పాటింపనైతినని అనుకోవద్దు

చం॥ మునుపలతేత్రియందు నృపముఖ్యుడు మా రఘురాముడయ్యయో.
నను - వదునాలుగేడులు వనంబులనుండగలేదె? రాజ్యల
క్ష్మినివిడనాడి; తండ్రిపుడి మేరకు - నాగమదేవి మంత్రిణిం
బొనరిచినాడ మాకులము భూరి యశస్సులు పంటపండగన్.

బ్రహ్మ :- అడపెత్తనము మహారాజా!

నలగా :- పొరపడుచుండివి బ్రహ్మనా! ఇది తండ్రిగారి నిర్ణయము.

బ్రహ్మ :- తండ్రిగారీ వరమేల యిచ్చిరో విచారింపవైతివి.

నలగా :- విచారించినకొలది విపరీతార్థములు వచ్చును. నాకు కావలసినది తండ్రిమాట కాపాడుట

నాయు :- (నవ్వుచు) మహామంత్రి బ్రహ్మన్న కెందులకో యింత యార్తి? ఆడుది అధికారము నిర్వహించుట మగవారికి తలవంపులనియా? పదవీ నిర్వహణలో మగవారేకాదు, మగువలును తగుదురని లోకమునకు నిరూపింప వలయునని మా కోరిక. పలనాటి రాజ్యమున నాగాంబ యెంతవరకు తనపాత్ర నిర్వహింపగలదో సహృదయులు చిత్తగింతురుగాక! ఆంధ్రమాతకన్న ఆడసంతానములో నాగాంబ ఆదర్శనారి కాగూడదా? మా ప్రజ్ఞాపాటవములు దేశమునకు సేవాభాజనములు కాగూడదా! వంటవార్పులకేగాని మా నేర్పులు రాజకీయముగా ప్రతిభాసింపగూడదా? స్త్రీలు అబలలేకాదు సబలలనియు లోకమునకు నిరూపింతును దీనికి మీ మగవారికింత శిరోవేదన మేల?

గండు - ఆఁ ఆఁ మహామంత్రి బ్రహ్మనాయుడు గారితోనేనా అధిక్షేపించి మాటాడునది

బ్రహ్మ :- చీచీ! అవధీరణ! సభ్యతలు చట్టబద్ధమైన యీ సభాంగణములో క్షణముగూడ నిలువరాదు (లేచిపోవును)

గండు :- (లేచి బ్రహ్మనాయునను సరించిపోవును)

నాయు :- మహారాజా! మహామంత్రిగారి సహనశీలము మెచ్చుతునకగా నున్నదేమి? నా మంత్రిణీ పదస్వీకారము ఆయనకింత కంటగింపుగా నుండునని నేననుకొనలేదు. అయన మంత్రిపదవికి నేను పోటీపడినట్లు భావించినాడు. పలనాటి రాజ్యచక్రము అవలీలనడిపించు మహామేధావి. అయన మేధాసంపదయే పలనాటి సంపదగదా! ఆయనింత అసహిష్ణుత ప్రదర్శింపవచ్చునా? నా వచ్చినవేళ మంచిదికాదేమో? మూడునాళ్ల నా మంత్రిణీపదవికి ఆయనింత కష్టపడనేల? పోనీ నా పదవీస్వీకార ముపసంహరించుకొందును

నలగా :- నాగాంబా! ఏమి యీ మాటలు! పెద్దవాడయ్యు ఔచిత్యము పాటింపలేదు బ్రహ్మన్న. శాంతిక్షాంతులు బోధించు ఆయన జీవితములో ఇదొక తప్పటడుగు. పొరపాటులెట్లో దిద్దుకొనవచ్చు. నీవన్యథాభావింపకుము నాగాంబా! నా విధి నేను నిర్వహించితిని.

పితృవాక్యమును పాలించితిని.
సీ॥ మాటకోసమెగదా మాహరిశ్చంద్రుండు
ఆలుబిడ్డలనమ్మి మాలగొలిచె
మాటకోసమెగదా మరి దధీచిమహర్షి
ఇంద్రుడుకోర వెన్నెముకనిచ్చె
మాటకోసమెగదా మాయంపుడేగకు
శిబి మేనికండలు చెండియిచ్చె
మాటకోసమెగదా మగువ గాదనలేక
దశరథేంద్రుండు తనువువిడిచె
మనుగడలు శాశ్వతంబులా మాటగాని
మాటకోసమె నేనింత పాటుపడితి
మాటపోయిన వెనుకను మనుగడేల?
మనుగడకు విల్వయిచ్చునది మాటయొకటి.

నాయు :- మహారాజా!

ఉ॥ రాజ్యము నిర్వహించుటకు - ప్రజ్ఞయు, పాటవమింత స్త్రీలలో
పూజ్యమటంచునుందలప బోలునె? మాకవకాశమీయు, సా
మ్రాజ్యమెవినిర్వహత్వమున ప్రాజ్యయశంబులు వెల్వరింపమే?
సజ్యత వాలుడాలుగొని సంగరరంగములందు దూకమే?

నలగా :- ఎవ్వరేమనుకొన్నను వెనుకాడను నాగాంబా! నీ కవకాశమిచ్చు చున్నాను. మీ మగువల తెగువచూపించి మగవారలమించి రాణింతువుగాక! ఇకపోదము.

(తెరపడును)

దృశ్యము : గురుదేవుడు : గోపన్న గృహము
ప్రవేశము : గోపన్నమంత్రి

గోపన్న :- ఔరా! బ్రహ్మనాయుడింత బరితెగినాడే! మహామంత్రినను అధికారగర్వముతో కన్నుమిన్నెఱుగక పడుచున్నాడు. చాపకూటి సిద్ధాంతమొకటి కల్పించి సర్వము జగన్నాథము గావించుచున్నాడు సనాతనాచారములను, సంప్రదాయములను చట్టిబర్దలు సేయుటకు సాహసించినాడు. ఎంత నిరంకుశముగా ప్రవర్తించుచున్నాడు! పవిత్రదేవాలయములన్నియు హరిజన ప్రవేశములై పోవుచున్నవి.

సవర్ణులందఱిని అవర్ణులతో గలిపివేయుచున్నాడు. కులాలులేవు మతాలులేవు. ఈ పాషండునిమూలాన పలనాడెల్ల బగ్గము పొడగుచున్నది. అరరే! ఎంత అపచారము! ఎంత స్వాధికారపరిమత్తత! మాలతెప్పలినాయకుని కొడుకు కన్నమదాసుందెచ్చి యింటిలో నుంచుకొని పెంచుచున్నాడు. వానిని తన ప్రక్కనే కూర్చుండబెట్టుకొని చాపకూళ్లు తినుచున్నాడు. తాను తినుటయేగాక తోటిలను గూడ తినిపించుచున్నాడు. మా అందఱికి తలలుకొట్టివేసినట్లున్నది ఈ అవమానము భరింపలేము శీలము నాయుడట? ఎంగిలి మంగలపు శీలము ఏమి శీలము! నాగాంబచేతనే వీని ఆట కట్టింతును. ఆమె యింకనుదాలేదు.

నాయ :- (అంతలోవచ్చి) వచ్చితిని గురుదేవా! నమస్కారము.

గోపన్న :- వచ్చితివా అమ్మా! నీకు నూఱేండ్లాయువు. ఏమైనది నీపోయినపని.

నాయ :- సఫలమైనది. నా మూడునాళ్ల మంత్రిత్వమంగీకరించినాడు మహారాజు. తండ్రిమాట కాపాడినాడు. కాని-

గోపన్న :- బ్రహ్మనాయుడు నీకటప్రతికూలుడుగా-

నాయ :- దాపురించినాడు. బ్రహ్మనాయుడంత యీర్ష్యాళువేమిగ రుదేవా

గోపన్న :- ఏమి జరిగినది చెప్పు నాగాంబా!

నాయ :- ఏమిజరుగవలయునో అది జరిగినది. మహారాజు నాకు మంత్రిపదవీప్రదానము చేయుగా అడ్డుతగిలినాడు. కాని, వాని అడ్డుపాటు పనిచేయలేదు. చివరకు చేయునదిలేక సభనుండి లేచిపోయినాడు. అతని తోకవెంటనే కన్నమనీడును పోయినాడు.

గోపన్న :- అంధపరంపరాన్యాయము! వీరుపోవుట ఒకవిధముగా మనకు మంచిదే. దీనితో మహారాజునకు వీరిపై చీదరింపు కలుగును. మనకు మంచి అనుకూలవాతావరణమిది రాజును పూర్తిగా మనవైపు లాగికొనుటకు వీలుదొరికినది. ఈ నీ మూడునాళ్ల పదవీ నిర్వహణలోనే ఉన్నది శాశ్వతముగా పదవి నిలద్రొక్కుకొనుట, రాజహృదయ సమాకర్షణ అవసరము. దీనికి నీవప్రమత్తవతో పదకము వేసికొని ప్రవర్తింపవలయును.

నాయ : పదకము లీవరకేవేసి యుంచితిని. అప్పుడే ప్రయోగించితిని

గురుదేవా!

గోవన్న:- ఎట్లు నాగాంబా?

నాయ:- మన క్రిందమన్న దోపిడిగాండ్రను పలనాటిలోను తత్పరిసర గ్రామాలలోను బ్రహ్మనాయుని అనుకూలము గానుండువారి యిండ్లు దోయుడని పంపితిని. నేటి అపరాత్రివేళ ఆ ఘట్టము జరుగును.

గోవన్న - ఇది అవశ్యము జరుగవలసినదే. బ్రహ్మనాయుడు తన అను కూలముగా నుందురని చాల ధనము కోశాగారమునుండి వారికి త్రవ్వి తలకెత్తినాడు.

నాయ:- ఆ ధనరాసులనే తిరిగిదోయించి కోశాగారమున బోయించి మహా రాజునకు చూపింతును.

గోవన్న:- భళిభళీ శిష్యురాలా! నీ ప్రజ్ఞ అద్వితీయము ఆ ధనరాసు లను చూచుకొని మహారాజు పూర్తిగా నీపై ప్రీతిగుగును. బ్రహ్మ నాయునిపై అవిశ్వాసము పెరుగును మూడునాళ్ల నీ పదవికి సుస్థి రతనగును

నాయ:- గురుదేవుల ఆశీర్బలము!

గోవన్న:- నీ శేముషీ బలము!

నాయ - ఈ రెండింటికి దైవబలము మన కన్నివిధముల కలిసి రావల యును గురుదేవా! కాని, ఒక్క సందేహము!

గోవన్న:- నీకు సందేహమా? నాగాంబా!

నాయ:- ఈ మహోద్యమములో ఎందటి ప్రాణాలో బలికావలయును. డెందము పాపకళంకమునకు శంకించుచున్నది వెనుకాడుచున్నది. గురుదేవా!

గోవన్న:- ధైర్యమును నిలద్రొక్కికొనుము నాగాంబా! బ్రహ్మనాయుని వైష్ణవమును తుడిచిపెట్టుటకు, శ్రీగురుమల్లికార్జునారాధ్య పండితుల వారి ఆదేశానుసారము మన వీరశైవము విశేష ప్రచారము కావల యును నాగాంబా! ఈ విషయమున ఒకరి ప్రాణములేమి మన ప్రాణములను సైతము శివార్పణము గావించుకొన సిద్ధమైయుంటిమి గదా!

నాయ:- సిద్ధమైయుంటిమి. కాని, స్త్రీ చాపల్యము, నేనీ మహాకార్యము నిర్వహింపగలనా గురుదేవా!

గోపన్న!- స్త్రీ శక్తి ఆ మోఘము లోకకల్యాణమునకు మహిషా సురాది మహారాక్షస సంహారమొనర్చినది స్త్రీశక్తియేగా నాగాంబా! ఆ పరదేవతాత్త్వము నీలో నున్నది నీ శక్తి అజేయమై పలనాట ఏలుచుకొన్న స్వార్థపరుల విశృంఖలా ప్రవృత్తికి విచ్ఛిత్తి తేవలయును. మఱచిపోతివా నాగాంబా!

నాయ !- ఏదో జ్ఞాపకము చేయుచుంటివి గురుదేవా!

గోపన్న'- మీ తండ్రిగారిని ఉరితీసిన ఉదంతము-

నాయి :- (పల్లుకొఱుకుకొనుచు) మఱచిపోవుదువా గురుదేవా! అన్యాయముగా నా తండ్రిని ఉరితీయించినా డలుగురాజు' అందుకేగా వేట నుండి వచ్చునప్పుడు ఆయనకు నా అతిధి సత్కారము! దానపత్రి స్వీకారము; ఆయన పోయినాడుకాని, ఆ కసి ఆయన సంతానాన్ని పట్టిపాలార్చుదాక తీరదు. నాగమ్మ కాలనాగమునకు ప్రతీక!

గోపన్న!- "ఏకక్రియా ద్వ్యర్థకరీ" నాగాంబా! నీమూలమున అలుగు రాజుపై మీ తండ్రి పగతో బ్రహ్మనాయునిపై నున్న పగయు దీరి పోవును. తండ్రి నురితీసిన దానికి ప్రతిక్రియ! బ్రహ్మనాయుని వైష్ణవమునకు నిరోధము! నీ ఊహావాహిని ఉత్తుంగ తరంగితమై ద్విధా ప్రవహించుచునుగాక! అధికార దుర్మదముతో అంటరానివాళ్లను ఆలయ ప్రవేశము చేయించుచే బ్రహ్మనాయుడు! ఎంతపచారం! వాని వైష్ణవము పరిభ్రష్టము కావింపవలసినదే. వాని చాపకూటి సిద్ధాంతమునకు రాద్ధాంతము తేవలసినదే. వాని స్వేచ్ఛా ప్రవృత్తికి నివృత్తి జరుపవలసినదే. వాని అస్పృశ్యతావాదము ఛేదింప వలసినదే! వాని ఆశారేఖలు చెఱపివేయవలసినదే. శిష్యురాలా! బ్రహ్మన్న సర్వనాశనముతో నా నేత్ర పర్వము కావించు! ఇదే గురుదేవులకు నీ విచ్చు దక్షిణ! ఇదే నీవారాధించు మహేశ్వరునకు నీవొనర్చు ప్రదక్షిణ సంకల్ప సాఫల్యము వఱకు నిద్రపోరాదు.

నాయ !- నిద్ర! బ్రహ్మనాయుడు ప్రతికక్షియై ప్రత్యక్ష మగుచుండ నాకు నిద్రపట్టునా గురుదేవా!

ఉ॥ నిద్దుర రాదు కంటి కొక నీరము నన్ను మీకే పదార్థముల్
బుద్ధికి నింపుగావు, షడి భూరి హుతాశన కీల లంబలెన్
తద్దయు త్వత్పరాభవము, దారుణ మాపితృహత్య రెండు నం
బెద్దయు గాల్చెడున్ హృదయ వీధిని నేనెటులన్ సహింతునో?
సెలవు గురుదేవా!

గోవన్న:- ఆశయముల సాధింపుము శిష్యురాల!

నాయి:- అంజలించు చున్నాను గురుదేవా!

సీ॥ బ్రహ్మనాయుని మంత్రి పదవీ ప్రమత్తతా
స్వేచ్ఛా పథంబున కెదురు దెబ్బ
దొడ్డన్న బిడ్డని ఎడ్డెమడ్డి తనంపు
చాపకూళ్ళపయి శాశ్వతషటాంక్ష
బాదన్న తమ్ముని వర్ణసమైక్యతా
వాదమ్మునకు - పెద్ద చీదరింపు
శీలము నాయుని శీలమునకు - ప్రజా
స్తోమంబునందున - చుక్కయెదురు
వీరశైవ మహామత విస్తరణము
తారసిలజేసి వైష్ణవార్థములనెల్ల
వ్యర్థమొనరించి నాయుని పలుకుబడిని
నాశనము చేయు - పలనాట నాగమాంబ.

గోవన్న:- శుభంభూయాత్! పోయిరా అమ్మా!

నాయ:- (నిష్క్రమణము)

గోవన్న:- (నాగమ్మ పోవుచుండ అట్లనే చూచుచుండును)

(తెరపడును)



## బ్రహ్మన్న స్వగతము

దృశ్యము: బ్రహ్మనాయుని గృహము : ప్రవేశము బ్రహ్మనాయుడు.

బ్రహ్మ :- అపచారము! మహాపచారము! పలనాటి మహాభ్యుదయమునకు నిస్స్వార్థసేవాదీక్షతో అహోరాత్రములు పాటుపడు బ్రహ్మనాయుని నవసమాజ నిర్మాణమునకు - తీవ్రనిరోధము! దేశాభివృద్ధికి నేగాంచు బంగారు కలలన్నిటిని భంగము గావించుటకు అడుగడుగున అడ్డుపడుచున్నది నాగాంబ. ఈ సర్పనామధేయ నాకన్ని విధముల ప్రతిద్వంద్విగా - తయారైనది. మూడునాళ్లైనని మంత్రి పదవిలంకించుకొని, మూడు రాత్రులలో దోపిడి మూకల నుసికొల్పి పలనాటి పరిసర గ్రామముల నా హితుల గృహములు దోయించి ధనము రాసులు పోయించినది. మెఱసిపోవు ఆ ధనరాసులు కనులు మిఱుమిట్లుగొలుప మురిసిపోయినాడు నలగాముడు. నాగాంబ తన పదవి నిలదొక్కుకొన్నది. అమాయకుడగు రాజునకు చెవి నిల్లుగట్టుకొని నాపై కొండెములు నూరిపోయుచున్నది. నన్ను దేవునివలె గొలుచు ఆ రాజు మనసు మార్చినది. నరసింగరాజునేదో ఆశా సౌధముల కెక్కించుచున్నది. నాపై విసము గ్రక్కించుచున్నది. ఇప్పుడు నేనేది చెప్పినను నలగాముని కెక్కదు. పలనాటి భవితవ్యమేమి కానున్నదో?

శా॥ ఎన్నో పాట్లకు లోనుగానయితి - ఎన్నెన్నో శ్రమల్పొందితిన్
తెన్నుల్ సూచితి - పల్నాటి అభివృద్ధింగోరి, ఆంధ్రోర్విలో
ఎన్నంగా దగినట్లు దిద్దితిని కానీ వానికి నాటికిం -
కన్నుల్ నెత్తికివచ్చి కానడు కృతఘ్నత్వంబు నేమందునో?

గండు :- (అంతలో వచ్చి) ఎవడా కృతఘ్నుడు? వాని పేరు చెప్పుము మహామంత్రీ! చెవులు పట్టుకొని తెచ్చి నీ పాదములపై పడవేయుదును—

బ్రహ్మ :- అది నీవల్లకాదు సేనాపతీ? మన మీ నాగమ్మతో బడలేము. రాజును నాకవిధేయునిగా జేసినది, వానికిప్పుడు నా మాట సహింపదు.

గండు :- వీరవిద్యాదేవి కుమారులు మలిదేవుల విషయమున మనమెంతో జాగరూకత వహింపవలసియున్నది మహామంత్రీ!

బ్రహ్మ :- వేయి కన్నులతో కనిపెట్టి యుండవలయును. మలిదేవులను
చంపుటకు విషప్రయోగములకు సైతము పాల్పడినది నాగాంబ

గండు :- పాముపిల్లగాను ఒప్పనొడగట్టుకొన్నట్లు నాగమ్మను జేరదీసి
దేశమునకు ముప్పుతెచ్చినాడు రాజు.

బ్రహ్మ:- పలనాటి రాజ్యాంగము ఆడుదాని పెత్తనము క్రిందికి వచ్చునని
కలనైన ననుకొనలేదు కన్నమా! స్త్రీబుద్ధి ప్రళయాంతకము.

గండు:- పలనాటి ప్రళయము తప్పదేమో?

బ్రహ్మ:- అట్లనే అనిపించు చున్నది సేనాపతీ' పలనాటి రాజ్యాభివృద్ధికి
నేపడిన పాట్లన్ని ఊషర వృష్టి న్యాయమై పోయినవి దేశము
కోసము నేనెంత ఉత్కంఠితుడనైతినో నీవెరుగవా కన్నమా!

గండు:- ఎఱుగకేమి మహామంత్రీ! అలుగు రాజు మరణశయ్యపై నుండి
చెప్పిన మాటలు నీమనసున నాటినవనుట కన్న ఆయన నీ మన
సులో జొచ్చినాడనుట యుక్తము దేశ ప్రగతికై నీవు పడు మమ
తను వర్ణింప మాటలు చాలవు బ్రహ్మనా!

చ:॥ నిదురను సైతమున్ మఱువ నేరవు దేశపురోభివృద్ధి; నీ
యెద నొకయింత స్వార్థము పయింజననీక సదాప్రజార్థమై
కుదురుగ జేసికొంటి, విటుకూడని వారలు శాంతిభద్రతల్
చెదరగజేసి వేయుటకు సిద్ధముగా నయినారు నేడహో!

బ్రహ్మ :- దేశాభివృద్ధికంటె మతోన్మాదులకు మతప్రచారమే ప్రధానమై
నది కాబోలు! బ్రహ్మనాయుని వైష్ణవము నడుగునకు ద్రొక్కివేయ
వలయునని తన శైవము ప్రతిపాదించుచున్నది నాగసాని. స్వప్ర
యోజనసిద్ధికి దేశమేమైన తనకేమి!

గండు :- స్వార్థపరుల యథేచ్ఛా ప్రవృత్తికి పలనాడు నేడాస్పదమైనది.
చార దృష్టితో కనిపెట్టియుండుట మంచిది.

బ్రహ్మ :- కనిపెట్టుచునే యుంటిమి కాని, నాగాంబ కుటిలనీతి దుర్భేద్య
ముగా నున్నది కన్నమా! పదవికి వచ్చిన రాత్రియే పరిసరులగు
మన హితులను దోయించినదేనా, మలిదేవుల మట్టుపెట్టుటకు విష
ప్రయోగములు చేసినదేనా, యింకేమి చేయించదు? దేనికి వెనుకా
డును? ఒక్క ఒఱలో రెండు కత్తులిముడవు సేనాపతీ!

గండు :- మఱి ఏమి చేయవలయునని?

బ్రహ్మ :- తక్షణమే గురిజాలనుండి వైదొలగవలయును.

గండు :- ఆఁ అదెట్లు బ్రహ్మనా!

బ్రహ్మ :- ఎట్లయిననసరే. మన మీ గురజాలనుండి లేచిపోవుట మంచిది,

గండు :- నాగమ్మతో పడలేక పోయినట్లగునేమో! ఇది మన మగటిమికి లోపము కాదా? మహామంత్రీ!

బ్రహ్మ :- నాగాంబ ఆడుది. ఆమెను మనమేమి చేసినను ఆడువియందురు ఆమెను మట్టుపెట్టుట మనకు గిట్టని పని. ఆమె మనలను మట్టుపెట్టుటకే చూచుచున్నది. నాగాంబ మాయావాగురలో - చిక్కుకొనుట కంటె యుక్తిగా తప్పించుకొని పోవుట మంచిదిగదా!

కన్నమదాసు:- (అంతలోవచ్చి) పలనాటి వీరసింహమని ప్రసిద్ధికెక్కిన బ్రహ్మనాయుడు ఒక ఆడుదానితో పడలేక యెక్కడికో పోవుటయా? సెలవిమ్ము తండ్రీ! నాగమ్మ వెనుక యెందరున్నను.

ఉ॥ ఒక్కడజాలుదుం దలల నొల్చెద దుల్చెద గవ్వలట్టులన్
ఉక్కివమింత సూపుటకు ఉమ్మస మెక్కడినుండి వచ్చెనో
తక్కరి నాగసాని కల దైవతలడ్డిన పట్టి కట్టియుం
తక్కక బ్రహ్మనాయుల పదమ్ములపై బడవేయకుందునే?

బ్రహ్మ :- కన్నమదాసూ! నీవంతపని చేయదగినవాడవే. కాని, యిది సమయముకాదు. నీవన్నట్లు నాగసానికి వెనుక పెద్ద ఉమ్మసమున్నది. ఆమెకు సవర్ణాల వత్తాసి. ఏమో అనుకొంటినిగాని కుటిల రాజనీతిలో నాగాంబ కూలంకష పరిజ్ఞగంది. విశేషించి కౌటిల్యమున మనమామెకు చాలము. ఆ కుటిల నీతికి మనము కూర్చుండలేదు. ఆ కుటిల రాజనీతిలో శ్రేయోరాజ్యస్థాపన మున్నదని విశ్వసించిన వారము మనము.

గండు :- కన్నమదాసనే సింగపుగొదమ బ్రహ్మన్నగారి ఆజ్ఞా బంధనములకు కట్టువడినదిగాని, ఊఁ అనినచాలు. లంకాదాహముచేసిన ఆంజనేయునివలె గురిజాల మొత్తము వచ్చిపడినను తన పటా కత్తిక్రింద చాపచుట్టగా బడవేయగలడు.

బ్రహ్మ :- కావచ్చు తొందరేల? కత్తి వేటకిది సమయముకాదు. బత్తి చేత పని కావించుకొందము.

కన్నమ:- వలస పోవుదమందురా

బ్రహ్మ :- వలస! వనవాసము! కావలసివచ్చునేమో చివరకు.
కన్నమ :- అర్థము కావటములేదు.
గండు :- అర్థముకాదు నాయనా! మహామంత్రిగారి గంభీరతదురవగాహము!
బ్రహ్మ :- నీవు తరువాతవెత్తువుకాని పో కన్నమదాసూ!
కన్నమ :- (వెళ్లును)
బ్రహ్మ :- సాగభీరతకంటె రాజకీయమెంత దురవగాహమో చెప్పవల యునా? సేనాపతీ

సీ॥ పెదతండ్రి పినతండ్రి బిడ్డలు, కౌరవ
పాండవుల్ రాజ్యంబు పంచికొనువ-
కుదురదయ్యెను, పుట్టిగొడవలు, జూదాన
ఒడ్డిరి రాజ్యమ్ము, ఓడిరందు
పాండవుల్, చనినారు వనవాసమునకు దు
ర్వార బాహాబల ప్రథితులయ్యు
అలుగురాజు కుమారు లౌదునొక్కరు వీరి
కెటు పొత్తుకుదురని చింతనిజము
ఇముడవొక యొఱయందున - ఇన్ని కత్తు
లిముడువగజూచినాడ నేనింతవరకు
స్వార్థపరులిందుజొచ్చిరి వ్యర్థమయ్యె
స్వప్రయోజనమెఱుగని నా ప్రయాస.

గండు :- భూరమాదేవి పుత్రజ్యేష్ఠుడు నరసింగరాజు నలగామరాజు అడుగు లకు మడుగులు పఱచుచు యువరాజైనాడు. వీరవిద్యాదేవి కుమా రులు మలిదేవులు వేరయినారు.
బ్రహ్మ :- మలిదేవులను నేను విడువను సేనాపతీ! వారందఱికంటె చిన్న వారు. వృద్ధరాజుగారి మాటమేరకు వారికి నా సర్వస్వము సమర్పిం చుకొందును. నలగామరాజు హృదయపూర్వకముగా పలనాటిసీమలో ఏది ఇచ్చినను చాలు.
గండు :- నలగామరాజు మలిదేవులకు రాజ్యము పంచియిచ్చునా?
బ్రహ్మ :- నేను పోయి స్వయముగా అర్థింతును.
గండు :- మీ అభ్యర్థనమునకు అవతల నాగమ్మ ఉన్నది బ్రహ్మనా! ఆమె కిష్టము లేకుండ నలగామరాజు ఒక్కడుగైన ముందువేయడు.

బ్రహ్మ :- అమాయకుడు నలగామరాజు, ఆయన స్థితిజూడ నాకెంతో జాలి గానున్నది. నాగమ్మ కప్పకూత పాముని తెలిసికొనలేకున్నాడు.

గండు :- ఈ కప్పకూతపాము పరుసపెట్టి అలుగురాజు సంతానమును కబళించుటకే వచ్చినదేమో బ్రహ్మనా!

బ్రహ్మ :- పలనాటి రాజకీయములో నాగమ్మ ప్రవేశము! ఏమేమో అంతరార్థాలు స్ఫురించుచున్నవి. ఆమెకు మతద్వేషముకన్న మానరానిది మఱొకటున్నది. అది పితృహత్యా ద్వేషము. ఇప్పటిది కాదది అలుగురాజు నాటిది. ఆ రాజు నాగాంబ పెంపుడు తండ్రిని రామిరెడ్డిని ఒకానొక రాజకీయ నేరముక్రింద ఉరితీయించినాడు.

గండు:- అట్లుచెప్పుము బ్రహ్మనా! అలుగురాజు వేటకు బోయినప్పుడు అక్కడ నాగమ్మ సాయముచేయుటేమి? రాజువల్ల వరముఅందుటకు వన్నిన ఉచ్చు. పిచ్చిమారాజా ఉచ్చులో పడిపోయినాడు వరమిచ్చినాడు కొఱివితో తలగోకికొన్నట్లయినది.

బ్రహ్మ :- ఇన్ని గూఢార్థములున్నవి పలనాటి రాజకీయములో మతముల పేరిట మానని ద్వేషము నిప్పులు చెఱగుచున్నదొకవంక, మరొకవంక స్వార్థపరుల ప్రతిక్రియా చింతనము. దేశమున కన పాయతయెట్లో రాజకీయపు టూసులు ఊపిరి సలుపనిచ్చుటలేదు ప్రతిపక్షుల యెత్తులకు ఉక్కిరిబిక్కిరగుచున్నాను. ఇంత సదమదమగుచున్న నన్నర్థముచేసికోలేక నాగమ్మ విషయమున సరిపడనివానిగా భావించుచున్నాడురాజు. నన్ను కేవల మీర్ష్యాళువుగా జమకట్టినాడు.

గండు - పైత్యరోగికి బెల్లముచేదుగదా!

బ్రహ్మ :- బెల్లము చేదుతో వాని ఉల్లము చేదయినది. నాగమ్మ వాని చేత చక్కెరపూసిన విషపు మాత్రలు మ్రింగించుచున్నది. వాని హృదయమెల్ల విషపూరితము కావించినది. వీరవిద్యాదేవి కుమారుల కేదోయింత రాజ్యమిప్పింపవలయునను నా సంకల్పము వికల్పము గాకుండవలయునని నా కొలుచు చెన్నయ్యకు కోటి మొక్కులు మ్రొక్కుకొనుచున్నాను. అఖండ పలనాటి రాజ్యము రెండు కావింపవలయునను కొనుచున్నందుల కెంతో బాధగనున్నది కన్నమనీడా!

గండు :- నిజమే గిత్కంతరములేనప్పుడేమి చేయుదుము. మహామంత్రీ! పలనా డఖండముగానుండు యోగములేదేమో? దైవేచ్ఛ! ఈనాటి పరిస్థితులనుబట్టి పలనాటి రాజ్యమేకముగా నున్న ముసుగులో గ్రుద్దులాటలు తప్పవేమో? హత్యలు అత్యాచారాలతో దేశ మశాంతికి నెలవైపోవునేమో?

బ్రహ్మ :- దేశమశాంతికి నెలవు కానీరాదు గురిజాల రాజధానిగా పలనాటిని వారేలుకొనగా మలిదేవులకు మాచర్ల నిమ్మందును. నలగాముని క్రింద నా మంత్రిత్వము కూడదిక, ఈ తెగతెంపులకిప్పుడే నలగాముని కడకుబోయెద. ఏమందువు కన్నమనీడా!

గండు :- తప్పక పొమ్మందును.

బ్రహ్మ :- కన్నమదాసూ! ఆ తలపాగ యిటు తే.

కన్నమ:- (తలపాగ తెచ్చియిచ్చును)

గండు :- పోయిరా మహామంత్రీ! నీ తలపు నెరవేరుగాక!

బ్రహ్మ :- (అటుపోవును)

గండు :- (ఇటుపోవును)

(తెరపడును)

# మలిదేవుల వేటుపాటు

## నలగామరాజ సౌధము

ప్రవేశము : నలగామరాజు

నలగా :- ఎంత దుర్ఘట మీ రాజ్యపాలనము! సుఖభోగముల కాకర మందురుగాని రాచఱికమున సుఖముకన్న దుఃఖమేమిన్న - కష్ట క్లిష్టమైన రాజ జీవితముకంటె సామాన్య ప్రజాజీవితమే మేలనిపించును. పలనాటి రాజ్యభవితవ్యమునుగూర్చి అంతయు అయోమయము! స్వార్థపర మానవ యదేచ్ఛా ప్రవృత్తి ఒకవంక, ఒకవంక శైవ, వైష్ణవముల విజృంభణము. పరస్పర మతద్వేషాలతో హింసా ప్రతిహింసలతో ప్రజాజీవితము సంక్షుభితమగుచున్నది. పెత్తనమోక రిదికాదు. ఎటు మొగ్గువారటు మొగ్గుచున్నారు. ఒక్క తాటిమీద నుండవలసిన ప్రజానీకము ఒకరు నొకరు భేదభావముతో చూడకుల వెళ్లగ్రక్కుచున్నారు కత్తిదూసి యొకరు దాయకుండగనే

యొకరు పొడుచుకొని చచ్చునట్లున్నారు. అసూయాద్వేషాలతో అంతఃకలహాలతో దేశమశాంతికి ఆలవాలమైపోయినది. తండ్రి పోయిన దాదిగా పెంచి, పెద్దజేసి, విద్దెలు నేర్పించి, గద్దె నెక్కించిన మహామంత్రి బ్రహ్మనాయునిపై నాగాంబ యెన్నో చెప్పుచున్నది. అవి కొండెములనుకొనుటకు వీలుగాదు. దేశము కోసము నాగాంబ స్వార్జితమెంతో వెచ్చించుచున్నది. ఇంతయేల? తన సర్వస్వము నిచ్చి వేసినది. స్వార్థము చూచుకొనునదైన ఆమె అట్లేల చేయును? వెదకి చూచినను ఆమె చిత్తప్రవృత్తిలో స్వప్రయోజనమిషమాత్రమును కనుపించుటలేదు. మరి బ్రహ్మనాయుడో నిస్వార్థమునకు మారుపేరు. ఆయన నవసమాజ నిర్మాణము సృజనాత్మకము సమత ఆయన సాధించు నవత- ఈ ఉభయ మంత్రులలో ఎవరి మార్గమనుసరణీయమో? ఎవరిదికాదో? తెలియకున్నది. దేశమెల్ల సిద్ధాంత రాద్ధాంతములకు రచ్చబండయై తేలినది. ఒకరు శైవము గొప్పయనిన ఒకరు వైష్ణవముగొప్పయందురు. దేశమింత అధ్వాన్న పరిస్థితులలో బడిపోవుటజూడ నా అసమర్థతను రూఢిచేయుచున్నది రాజలోకమున నాకెంత తలవంపిది? ఎంత అపకీర్తి? పలనాటి చరితలో నలగామని జీవితఘట్టము మాలిన్యమయముకాగా భావి తరాల ఆంధ్ర యువకులు పెదవులు విరుతురు. పలనాటిరాజకుటుంబ వ్యవహారము చూతమన్న "జ్ఞాతిశ్ఛేదనలేనకి"మ్మను సూక్తికి పరిపోవుచున్నది. రాజ్యతృష్ణ మృగతృష్ణవలె పరుగులు వారించుచున్నది. సవతి తల్లి వీరవిద్యాదేవికి తన కుమారులతో వేఱుగ నుండవలయుననియే కోరిక. వారికేదోయింత నేలయిచ్చి కుటుంబ కలహము నివారించుకొనుట మంచిదేమో? (ఎదుటచూచి) ఎవరక్కడ?

సేవకు:- (ప్రవేశించి) మహామంత్రి బ్రహ్మనాయుడుగారు వచ్చుచున్నారు ప్రభూ!

నలగా:- ఆయన కొఱకే నిరీక్షణ. స్వాగతము మహామంత్రీ! అభివాదనము.

బ్రహ్మ:- (ప్రవేశము) మేలగు గాక. నీతో కొంత ఏకాంతముండి వచ్చితిని మహారాజా.

నలగా :- (ఆసనము చూపించుచు) ఏకాంతముగా నేనున్నాను మహామంత్రీ!
బ్రహ్మ :- కుటుంబ పరిస్థితులు నీకవగతములేగదా!
నలగా :- అవగతములే నన్నిప్పుడేమి చేయమందురు?
బ్రహ్మ :- వేఱే అనుకొనవేని నీ కొకటి చెప్పదలచుకొన్నాను.
నలగా :- చెప్పుము మహామంత్రీ!
బ్రహ్మ :- మహారాజా! నిండుమనస్సుతో పలనా డఖండముగాడ దిద్దిన నేను చెప్పవలసిన మాటలు కావివి. అయినను పరిస్థితులు నాచే జెప్పించుచున్నవి.

శా॥ నీ తమ్ముళ్లకు నీకు - ఒక్కటిగనున్నే యెల్లకాలంబు? ఉ
ద్యూతంబౌ పోరపొచ్చెముల్-సవతి తమ్ముల్ వారలెంతైన-వా
రే తంటాలాపడంగ జాలుదురు గానీ రేపురాబోవు పే
చీ తప్పున్ ధర పంచియీయదగు నీ చిత్తప్రకారంబుగా.

మీ తండ్రి, పసివారగు మిమ్ము నా కప్పగించి పోయినాడు. కన్న దాయన, పెంచినది నేను. నేనేది చెప్పినను, ఏది చేసినను మీ శ్రేయస్సునకేనని భావింపదగును. విశేషించి నే జెప్పునదేమన?

ఉ॥ మున్నల ధార్తరాష్ట్రసుతముఖ్యుడు పాండుకొమాళ్ళ భాగ మీ
నన్న నిమిత్తమేగద! మహారణమయ్యెను, దాన - ఎందఱో
మన్నయి పోయివారు కొరమాలిన నైతురుటేర్లు తప్పగా
తిన్నని నేర్పుతోడ సరిదిద్దు కొనందగు మీ కుటుంబమున్.

నలగా :- మహామంత్రీ! మీ మాట కొకనాడు కాదంటినా? మీరు చెప్పునది మలిదేవుల విషయమైయుండనోపు! వారికి వేఱుపోవలయునని యున్న చంద్రవంక పొలిమేరగా మాచెర్ల భాగమిచ్చుచున్నాను.
బ్రహ్మ :- ఇది నీ హృదయపూర్వకముగనే చెప్పితివని తలంచెద. సంతోషము మహారాజా! గురిజాల రాజధానిగా పలనాడెల్ల నీ వేలుకొనుము. నేను వీరవిద్యాదేవి కుమారులతో మాచెర్ల కేగుదును. మలిదేవులందఱికన్న చిన్నవారు. వారికి నేను మంత్రిగానుండి రాజ్యపాలనా భారము వహించెద. అన్యథా భావించవద్దు పరిస్థితులు నన్నిట్లు చేయించుచున్నవి. (కన్నీరునించుచు) మహారాజా!

సీ॥ ఏ మహారాజ్యలక్ష్మి మహోన్నతికి ని
ద్రించు నప్పును కల్వరించినానొ?

ఏ నేలపైన నవీన భావ ఫలాల
 ఆరగించడింపగా గోరినానో?
ఏ సీమ ఆంధ్రికి చిన్ని చేదుక్కగా
 నిద్దంపు పావట దిద్దినానొ?
ఏ రాజ్యము విరోధి ధారుణీశ్వర దుర్ని
 రీక్ష్యంబుగా నొనరించినానొ
అవియెగా పలనాటి రాజ్యంబు రెండు
బ్రద్దలుగ జేసివేయుగా – పాల్పడితిని
నా కనభిమతమే పలనాటి రాజ్య
భాగహారము తప్పక వచ్చెనకట!

రేపో మాపో? పరిజనముతో మాచెర్లకు తరలి పోవుదుము.

నీ అంగీకార పత్రము దయచేయుము మహారాజా!

నలగా :- నా అంగీకార పత్రము మీ వెనుకనే పంపెద.

బ్రహ్మ :- నేనిక పోయివచ్చెద.

నలగా :- అట్లనే మహామంత్రీ!

బ్రహ్మ :- (నిష్క్రమించును)

నలగా :- (స్థిమితముగ) అమ్మయ్య! గుండె బరువు తీరినట్లయినది.

గీ॥ అన్నదమ్ములు విడి పోవుటది నిజముగ
ఎప్పటికినైన మన్నదే తప్పదు గద!
వీరవిద్యా కుమారులు వేఱుపడిరి
చిన్ని మాచెర్లతో నాకు – చిక్కు తీరె.

నాయ :- జయము జయము మహారాజా!

నరసింగ :- అన్నగారికి అభివాదనము.

నలగా :- కూర్చుండుము నాగాంబా! తమ్ముడా! ఇటువచ్చి కూర్చుండుము

నాయ :- మహారాజా! మాచెర్ల మలిదేవులకిచ్చి వేసితిరా?

నలగా :- ఇచ్చివేసితిని నాగాంబా!

నాయ :- అనాలోచితముగా – ప్రవర్తించితిరేమి ప్రభూ!

నరసింగ :- అన్నగారు తొందరపడినారు.

నలగా :- అనాలోచితమేమియుగాదు–ఆలోచించుకొనియే వేసితిని. తొందర పడిన దేమియునులేదు. అంతయు స్థిమితముగనే చేసితిని. కుటుంబ కలహాలతో నేనుక్కిరిబిక్కిరగుచున్నాను.

నాయ :- రాజ్యాధికారము జ్యేష్ఠునకేగాని అన్నదమ్ములందఱు పంచుకొని అనుభవింపమనియున్నదా?

నలగా :- ఒక కడుపున బుట్టినవారికేపడదు. సవతి తమ్ముల విషయము చెప్పవలయునా? తమ్ముల నన్యాయముచేసినాడని లోకము నిందించును. లోకనిందపడలేను నాగాంబా!

నాయ:- మాచర్లను వీర విద్యా దేవి కుమారులకు పంచియిచ్చి లేనిపోని సమస్యను తెచ్చి పెట్టుకొన్నట్లయినది గదా!

నలగా :- ఇందులేనిపోని సమస్యయేమున్నది?

నాయ - భూరమాదేవి సంతానమునకును సమాధానముచెప్పవలసి రాలేదా?

నరసింగ.- వీరవిద్యాదేవి కుమారులతో పాటు భూరమాదేవి కుమారులము మేము చేయుమా అన్నయ్యా!

నలగా:- మీరుగూడ ఏదో తీసికొనుడు నరసింగరాజా! మీకు గాదననేల! మిగిలినదానితోనే నే నూరేగద.

నరసిం!- ఏదో అంటినిగాని నా కెందుకన్నయ్యా! రాజ్యము. మాచెర్లతో మలిదేవులను వేఱుపోనిమ్ము. మేము మాత్రము నిన్ను వదలి పెట్టియుండము. మాకు రాజ్యమువద్దు రాద్ధాంతము వద్దు.

నాయ :- నరసింగుల హృదయ మర్థమైనదా మహారాజా! దేశముచీలికలు పేలికలగుటకాయన కిష్టము లేదు. అఖండ పలనాటి రాజ్యమాయన యిష్టము. ఆయనకా యువరాజపట్టము చాలునను కొనుచున్నాడు.

నలగా:- నాగాంబా!

గీ॥ ఏడుగురమన్నదమ్ములమేము, మాకు—
తండ్రి యొకడయ్యు ముగ్గురు తల్లులు గద!
ముగుర తల్లుల బిడ్డలమును ధరిత్రి
పాలుపంచి కుడుచుటయు మేలటందు.

నరసిం:- నాకు మాత్రము రాజ్యము పాలుపంచుకొనవలయుననిలేదు. ఏదో యిట్లు సేవాభాజనముగ జీవితము గడుపుకొందును.

నలగా!- నాకు మాత్రమిప్పటికా ఆడ సంతానమొకటి-

నరసిం!- ఆడసంతానమైన నేమిలే అన్నయ్యా! రత్నాల పేరిందేవిని పూవుల్లో పెట్టి పెంచుకొనుచున్నాము

నాయ :- మహారాజుగారి తరువాత ఆమెయే రాజ్యాధికారిణి.

నలగా!- ఏదో అట్లు పెరగనీ నాగాంబా! రాజెవరో? రెడ్డెవరో?

నరసిం!- ఆమెకు కాకుండ పలనాటి రాజ్యమింకెవరికి కట్టబెట్టుదుమన్నయ్యా

నలగా:- ఎంతో గారాబముగా పెంచుచున్నాము పేరిందేవిని

గీ॥ రాజ్యలక్ష్మితో బాటుగా లక్ష్మివంటి
పేరమాదేవి బెళతుము పెంచుకొంచు
డెందమను పొలమందు - కడింది పసిడి
కోరికలపేరి పంటలు కుతుక మెసగ.

నాయ :- పేరమాదేవి నిజముగా రూపు తాల్చిన అదృష్టలక్ష్మి.

నరసిం!- ఆమె అదృష్టపు కొలపోతలో అన్నగారి తలపోతలు జలపాతముల వలె క్రిక్కిరియుచున్నవి నాగాంబా!

నాయ :- అది సహజమేగద నరసింగరాజా! మహారాజుగారి తీయతీయని కోరికల పైరులకు మనమెంతైన దోహదము గావింపవలయును యువరాజా! సరికాని ప్రభూ! బ్రహ్మనాయుడుగారు మలిదేవులతో మాచెర్లకెప్పుడు తరలిపోయెదరో?

నలగా:- ఎప్పుడు పోయినను నా కిష్టమే. రేపో మాపో పోదురనుకొందును నాగాంబా! ప్రస్తుత పరిస్థితులలో బ్రహ్మనాయుడట్లు మలిదేవులతో బోవుటయే మంచిదికాదా?

నాయ :- మంచిది. మన ప్రగతి నిరాటంకముగ సాగిపోవునిక. కానీ, అఖండ పలనాటి రాజ్యము రెండు ఖండములై పోయినదేయని నా చింత ఇప్పటికిట్లుపోనీ, ఎప్పటికైన అఖండపలనాటి రాజ్యపునః ప్రతిష్ఠాపనము జరుపకపోదీ నాగాంబ!

గీ॥ ద్విజు డసంతృప్తిచేత, సంతృప్తిచేత
భూభుజుడు చెడునంచు - చెప్పొదురు బుధులు
పోయినదిపోవ ఇకముండ బోవుసదొక
చీరచెరగంత యిడియేమి చేసికోను?

నలగా :- ఏమి చేసినను నీ యిష్టమే మహామంత్రిణీ!

నాయ :- నీవు చేసినది మంచిపనియే మహారాజా! దీనికి లోకమునిన్ను పొగడును గాని తెగడదు. ఆ చేతితో జారవిడిచిన దానిని ఈ చేతితో లాగికొనవచ్చును. మనసున్న మార్గములులేవా! తరువాత మాటాడు కొందుము శివారాధనమున్నది. నే బోయెద.

నరసిం!- నేనుగూడ పోయెదనన్నయ్యా!

(నాగాంబ నరసింగరాజులు నిష్క్రమింతురు)

(తెరపడును)

## విష్కంభము

ప్రవేశము : రంగిరెడ్డి

రంగి :- ఏం కాలమో మా సెడ్డకాలమొచ్చి కూకుంది రాజ్జానికి. పెద్ద రాజు గోరు పోయాక రద్దెక్కువై అది. నలగామయ్యేమో సిన్నోడై పోయాడు. అటంసుటం తెలీని పిచ్చిమారాజు. ఈ పామమ్మొచ్చింది యింకేముంది రాజ్జానికి శంపేసింది. విట్టుమతం సివుడిమతం రెండూ సుప్పాలు రాసుకుంటన్నయ్. ఒకడిట్టా అంటాడు ఒకడట్టా అంటాడు. ఈడంటే ఆడికి పడదు. ఆడంటే యీడికి పడదు. బెమ్మనాయుడుగోరు మామంచోడు కామట్టి సిన్నంగా వైదొలిగాడు. విజ్జలమ్మగోరి అబ్బాయిలతో మాసెల్ల సేరుతున్నాడు. పామమ్మ మా సెడ్డది. సరివడనోళ్ళని గుట్టుసప్పుడుగాకుండ మెడకాయల్ని నులిమేయిత్తది ఈడుంటే మా తంటా. ఎల్లిపోత సందేలకే మాసెల్లకి బెమ్మనాయుడేడుంటే ఆడ రాముడి రాజ్జెంలాగుంటది. ఆయన అట్టది కులాలంతా వొక్కటేనంటాడు. సావకూళ్ళు తినిపిత్తాడు. ఎక్కువలు తక్కువలు లేవాయనికి. నిజానికి వోడెక్కువ? వోడు తక్కువ? ఈ యెక్కువ తక్కువలతో వోడిమాటాడిదైతే దేశానికి మాలావుమువ్పు జెనమంతా కలిసికట్టుగుంటేనే యెదుటోడికి గుండెదడ (ఎదుటచూని) వోడో వత్తున్నట్టుగుంది. పామమ్మ శారుడు కాడుగంద!

గంగి :- (ప్రవేశము) ఏందిరా రంగులూ నువ్వీడనే కూకున్నావేం?

రంగి :- వోరి గంగులుగా నువ్వా? యేంది యెవ్వారం?

గంగి :- నువ్వసలు వూళ్ళో లేనట్టుగుందేం?

రంగి: - లేను లేను యీ వద్ద అత్తకూతరు మొగుడు పుట్టింటికెల్లె నసి!

గంగి :- బలే సెమత్కారం నేరుసుకున్నావురా రంగులూ! ఇంటికాడేవున్నావన్న మాట! అయితే అన్నెరుగుండే యేంది యవ్వారం అంటే నానేం సెప్పను? బెమ్మనాయుడుగోరి ముటా అంతా మాసెల్లకి శేరుకుందాయె నువ్వీడున్నావేం తోకమ్మడేమోక?

రంగి :- నానుు బెమ్మనాయుడుగోరి తోకమ్మడేమోతే, నువ్వా పామమ్మ కోకట్టుకొమండీడనే.

గంగి :- వుంటా నా నీడేవుంటా. బెమ్మయ్యేమో అడ్డమైన సావకూళ్ళు తిని

పిత్తాడాయె. మాలామండీ సగలం జెగన్నాద మాయనికి. అది నాకు సరివడదసి! నాగమ్మ మామంచి దొరసానమ్మ. యెవళ్లెవళ్లంతత్తులు గురుతెరుగుండి నడుచు గుంటది. నువ్వాడకుపో నా నీడుంటా.

రంగి :- నువ్వడ్డబొట్టోడి మతంలో సేరావన్న మాట.

గంగి :- నువ్వా నిజువ బొట్టోడి మతంలో సేరితే మరి నానదే నా దంతా నీ దానికి యెతిరేకంగా రంగులూ! నాదినీకుపడదు నీది నాకుపడదు!

రంగి :- యాదాడంటే గోదాడంటావు నువ్వుత్త యెతి మతంగోడివిరా. గంగులూ!

గంగి - మరేందంట! నీ యెంగిలికూళ్లమతం పోడిక్కావాలి.

రంగి:- నీ బోడిలింగడిమతం పోడిక్కావాలి.

గంగి :- వొరేయే రంగులూ! మాటలు సిన్నంగారానియ్యి

రంగి :- యేం! యేంసేత్తావో సెప్పు. పామమ్మతో సెప్పి కోదండమేయిత్తావా?

గంగి :- సూడు మరి తెల్లారేటప్పటికి నువ్వుంటావేమో?

రంగి .- శాతబడి సేయిత్తావా?

గంగి :- నాగమ్మగోరికి సెప్పి కోదండమేయిత్తా

రంగి :- నువ్వా పామమ్మకి సెప్పి కోదండమేయితే నాను బెమ్మయ్యగోరికి సెప్పి ముక్కు సెవులు కోయించి సూర్పణక్కను సేయిత్తా. ఇప్పుడే మోతున్నా మా సెర్లకి బెమ్మనాయుడిగోరికి నీ సంగతంతా సెప్పేత్తా.

గంగి :- నానూ మోతున్నా నాగమ్మగోరికి నీ సంగతంతా సెప్పేత్తా.

(చెరొక వైపు వెళ్లుదురు)

(తెరపడును)



# బ్రహ్మన్న త్యాగము

దృశ్యము : మాచెర్ల బ్రహ్మనాయుడుగారిల్లు

నేపధ్యమున

గీ॥ దేశమున కరిష్టంబు ప్రాప్తించుననుచు
వెఱ్ఱిమొఱ్ఱి జోస్యంబులు విశ్వసించి
బ్రహ్మనాయుడు తనపుత్రు బాలచంద్రు-
కత్తికెఱజేయ బంపునా కానలందు.

బ్రహ్మ :- (ప్రవేశము చెదిరిన మనస్సుతో) శీలమునాయుని వంశాన ఒక్కగానొక్క నలుసైనందుకు అదిగూడ దక్కకవచ్చెనే? వీరరేఖ యొవలారు ఆ విశాల ఫాల పట్టిక జూచి బ్రహ్మనాయుని మించునని రందఱు. ఒ్రతుకని బిడ్డ బారెడు కాబోలు! వాని కోసము నే గట్టుకొన్న ఆశాసౌధాలన్ని గాలిమేడలై పోయెనే. దేశారిష్ట కారకుడైన నష్టజాతకుడు మహామంత్రి కడుపున బుట్టినాడు. ఎంత దురదృష్టము! దేశశ్రేయస్సుగోరి కన్నకుమారుని కత్తికెఱగావింతునా?

చ॥ ఒకదెస పుత్రమోహమది ఊపుచు నున్నది ఊయెలట్లు మా
మక హృదయంబు - ఒక్కదెస మానని దేశహితాభిలాష నన్
తికమక పెట్టుచున్నయది దేనినవశ్యముగాదనందు? క
న్నకొడుకు కత్తికోతకిడనా? మఱిదేశము భంగపుత్తునా?

బాలచంద్రుని జాతకముచూచి దేశమునకు యుద్ధోపద్రవము తప్పదనినారు జ్యోస్యులు! రక్తపాతమున కొప్పుకొనని బ్రహ్మనాయుని కగ్నిపరీక్ష! పుత్రమోహము! దేశశ్రేయము! ఈ రెండింటిమధ్య అంతరంగమున సంగరము! దేశముకోసము పుత్రుని జంపుకొనుటయా? పుత్రుని కోసము దేశశ్రేయము పాడుచేసికొనుటయా? ఏ దన నరణియిప్పుడు? పుత్రవ్యామోహమును దిగద్రావి దేశముకోసము పుత్రుని బలిసేయుదును. పుత్రవధతో దేశారిష్టము తీరిపోయిన నాకదిచాలు. ఒక్కని ప్రాణహరణముతో వేలకువేల ప్రాణరక్షణము! మనసూగిసలాడుచున్నది. కర్తవ్యతా మూఢుడనగుచున్నాను. రేచర్ల పద్మనాయకవంశాంకురము! నలువురన్నదమ్ములకు ఏకైక సంతానము? శీలమ్మ ముద్దుల

మనుమడు! చంపింపలేను బాలచంద్రుని - చంపింపకున్న దేశము యుద్ధభూతమైన కాహ్వానము - వద్దు యుద్ధము రాగూడదు - యుద్ధ నివారణకు నా సుతుని బలిదానము - అవశ్యము జరుగవల సినదే - జరుగవలసినదే నా కన్నకొమరుని కత్తికోత! దేశము కోసము పుత్రవ్యామోహ పాశమును కోసివేసికొందును. మనసికలొంగనీయను. బిగ్గబట్టుకొందును.

సీ॥ హృదయమా! సుంతయు దృఢతను విడకుమా
గండశిలను మించి యుండుమీవు
మోహమా! మోహసమ్మూఢులజేరు మా
త్యాగమ్ము ముందు నీ వాగలేవు
ధైర్యమా! నీ పట్టు తగ్గిపోనీకుమా
మాయ మోహము నిన్ను మలుపునేమొ
త్యాగమా! నీ వింక రాగ మాసింపకు
మంచి కీర్తులను పండించుకొనుము!
స్వార్థమా! పొమ్ము - రాకు నా పరిసరముల
కాశయము పాశమునుగోసి అశలందు -
కీర్తి వెలిగింతు సుతు నతికింతు - కొలుచు
దీవుకడ్డము వచ్చిన తిరుగలేదు.

(బిగ్గరగ) కన్నమదాసూ!

కన్నమ :- (ప్రవేశించి) స్వామీ!

బ్రహ్మ :- రా నా వెంట. (నిష్క్రమింతురు)

(తెరలేచును కక్ష్యాంతరమున)

(బ్రహ్మనాయుని భార్య అయితమాంబ బాలచంద్రునితో ప్రవేశము)

అయిత :- ఉ॥ హా తనయా! సమంచిత నయా! కని పెంచియు ప్రేమతోడ వి
ఖ్యాత పరాక్రముండవుగ-ఆయుధ విద్యలనేర్పి, ఖండన
క్ష్మాతలమందు వైరిభట ఖండన జేయగజూడ మాని, ని
న్నీతరి కన్నతండ్రి వధియింపగ బంపునెనిర్దయాత్ముడై.

నాయనా! బాలచంద్ర!

ఉ॥ బిడ్డలులేక మ్రొక్కదగు వేల్పులకెల్లను మ్రొక్కి యెన్నియో
దొడ్డ వ్రతంబులంజలిపి, తోరపు నేమములెన్నొ పూని నే
బడ్డ బదంబులెల్ల ఫలభావము నొందగ - చాలనాళ్లకుం
గొడ్డును వీగికన్నయది కోతల పాలొనరింపనా? సుతా!

బాలచంద్ర:- ఎందుకమ్మా! దుఃఖించుట? పుట్టినవార గిట్టకుందురా? సంసార బంధములో దగులుకొనకముందె నాకు మరణము సంభవించిన అది నిశ్చింతగా అనుభవింతును. నా జాతకమున దేశారిష్టమున్న అది తొలగుటకు నా మరణముకన్న సాధనమేమున్నది? నేనుండి దేశ మరిష్టము పాలుచేయుటకంటె, చచ్చి దేశశ్రేయము గలిగింతును. నాకింతకన్న కావలసినదేమున్నదమ్మా!

అయిత:- నాయనా! నీ కప్పుడే యిదేటి వైరాగ్యమురా? పెరిగి పెద్ద వాడవై పెండ్లిచేసికొని వంశాభివృద్ధిని గలిగింప వలసినవాడవు నీకిదేటి వేదాంతము!

బాల:- ఇందులో వేదాంతమేమున్నదమ్మా! ఎప్పుడైన చావవలసినదే గదా! ఎప్పుడో చచ్చుదానికంటె ఇప్పుడే చచ్చి, దేశారిష్టము తొలగించి నా జన్మ చరితార్థము చేసికొందును. దేశము కొఱకు ఆత్మ త్యాగము చేయువారే ధన్యజీవులు. జగన్నాటకములో నిష్క్రమాగమనములవలె జీవులువచ్చుచుందురు పోవుచుందురు. అనిష్టమైన దేశారిష్టమునకు వెఱచి కన్నకొమరునే చంపుకొనినాడన్న నాయన గారి ఉదాత్తాశయము విశ్వాదర్శమౌను. అది ఆయన త్యాగ జీవితమునకొక వెలుగురేక. అదుగో! నాన్నగారు! చూడు ఆయన గంభీరత! ఆయన విస్తరంగ సాగరము!

బ్రహ్మ:- (ప్రవేశము వెనుక కన్నమదాసుగూడ వచ్చును)

అయిత:- (ఒక్కపెట్టున ఏడ్చుచు భర్త కాళ్లపై బడును)

బ్రహ్మ:- (పొర్లివచ్చె దుఃఖాన్ని మ్రింగుకొనుచు భార్యను లేవనెత్తును) ఊరడిల్లుదేవీ! మనకసలు కొడుకు పుట్టలేదనుకొనుము. మనసు రాయి చేసికొనుము.

అయిత:- (పొంగివచ్చె దుఃఖముతో) కొడుకు పుట్టలేదనుకొనవలయును- మనసు రాయి చేసికొనవలయును - పెంచిన చెట్టు విషపు చెట్టాయె నను స్వయముగా నఱుకవలయునన్న చేతులురావే! వంశాకుర

మైన ముద్దు కొమరుని చే జేతుల నఱకు కొనుటయా? పిచ్చి జోస్యముకాకపోతే దేశారిష్టమునకును కుమారుని జాతకమున కెక్కడి సంబంధము? వీరరేఖ పెంపెసలారే ముద్దు కొమరుడే! వంశోద్ధారకుడే! నలువురన్నదమ్ములకేకైక పుత్రుడే! రేచర్ల వంశాబ్ధిచంద్రుడే! బాలచంద్రుని జంపుకొనుటకు నీ కెట్లు మనసొప్పినదయ్యా! నీ హృదయమింత శిలాసదృశమా? నీ ఎదినిర్ధయుకు నిలయుమా?

బ్రహ్మ :- అదంతయు త్రివ్వకు దేవీ! నా హృదయ క్షేత్రములో పుత్రవ్యామోహము మొలకెత్తింపకు! నా నిశ్చయమునకు తిరుగులేదు. లేదు తిరుగు. నా కొలుచు చెన్నకేశవుడువచ్చి చెప్పినా నా మనసు మారదు. ఆ యిచ్చు దేవుడు దేశారిష్టకారకడైన కొడుకు నేల యీ వలయును. నాకు కావలసినది కొడుకుకంటె దేశము. నా దేశభక్తికి కన్నకొడుకునే బలి' (దుఃఖించుచునే) కన్నమదాసూ! బాలచంద్రుని నీ వెక్కడికైన తీసికొనిపోయి - వధించు.

కన్నమ,- (ఏడ్చుచు) స్వామీ! ఈ పని నేను చేయలేను.

బ్రహ్మ :- చేయులేవా కన్నమదాసూ? (పిచ్చిగా అఱచును)

కన్నమ:- (సమాధానము రాక యేడ్చుచునేయుండును)

బాల :- కన్నమదాసూ! తండ్రిగారి ఆజ్ఞ పాలించు! జెంబేలుపడకు! నన్ను వధించి దేశానికి రానున్న విపత్తు బాపు! ఊc పద.

మ॥ ఎదవయ్యా! వదవన్న కన్నమ! కృపాస్వాంతుండవై ఘోరదుః
ఖదమౌ సంసృతి బంధమందు బడనీకన్నన్ను నీ కత్తికిం
బదునెక్కించి వధింపు! తండ్రి నియతిం బాటింపుమెప్డైన ను
న్నదియేగా మృతి - తప్పకొందమనుకొన్నందప్పునా చావిలన్.

కన్నమ:- (దుఃఖించుచునే బ్రహ్మన్న కాళ్లు కన్నులకద్దుకొని, ఖడ్గపాణియై బాలచంద్రునమసరించి పోవును)

అయిత :- (దుఃఖాతిశయముతో మూర్ఛిల్లును)

బ్రహ్మ :- (దుఃఖరుద్ధ హృదయముతో నిలబడిపోవును)

(తెరపడుచుండును)

(నేపథ్యమున)

చం॥ ఒకదెస - పుత్రమోమహాది ఉత్కటమై హృదయంబు నెంతయో
తికమకపెట్టి ఊపినది. దేశహితైషణమైన బుద్ధి యిం
కొకదెస లాగివైచినది యుద్ధము రెండిటికయ్యె దేశల
క్ష్మికొఱకు-పుత్రమోహముత్యజించెను బ్రహ్మనయెంత త్యాగియో!

(వెకిలినవ్వు)

ఉ॥ టక్కరి జోస్యముం దనయెడంద నిజంబని నమ్మిననాడు-పెం
పెక్కిన దూరదృష్టి యది యేమయి పోయెనొ? బ్రహ్మనాయు డి
ట్లక్కట! ఒక్కగాని ఒకడైన కుమారుని బాలచంద్రునిన్
ముక్కలుసేత కాయనకు బుద్ధియు నీగతి ముక్కలయ్యెనే!

(తెరపడును)

దృశ్యము : నల్లమల అడవులు

## బాలచంద్రుని హత్యాప్రయత్నము

ప్రవేశము : కన్నమదాసు : బాలచంద్రుడు.

కన్నమ :- నల్లమల అడవులివి. క్రిక్కిఱిసిన యీ అడవులవలె నా మన సెంత క్రిక్కిఱిసినది. ఇందలి కొండల జాతిబండలవలె నా గుండె యెంత బండ బాఱినది. ఇందలి చీకటి ఋఋకుబాటలవలె నా మన సెంత యిఋకుబారినది. బాలచంద్రునిక్కడనే వధింప వలయును. దైవమా! నా కెట్టి సంకటము తెచ్చి పెట్టితివయ్యా!

ఉ॥ దొడ్డన మంత్రికిన్ సుతులు తోచిరి నల్వురు వారికెల్ల యీ
బిడ్డడె యొక్కగా నొకడు - వీనిని బతము చాల నాళ్లకుం
గొడ్డుతనంబు వీగకనె - కుత్సిత జోస్యము నమ్మి తండ్రి యీ
బిడ్డని కత్తికోతలకు బెట్టె నిదెంతటి ఘోరకర్మమో?

ఈ ఘోర కర్మకు నేనే తగినవాడనని కాబోలు! స్వామి నన్నే నియోగించినాడు.

ఉ॥ నా మనసొప్పకున్నయది - నాయన ఆనతి తప్పరాదు - ని
ర్నామముగాదె దొడ్డన కులంబు ఖిలంబయి - బాలచంద్రునిన్
నా మహితాసిచేనటికి నా చెయి మీదుగ నమ్మినట్టి నా
స్వామికులంబు నాశనము సల్పుటయా? యెటు సేయుదీ పనిన్.

బాలచం!– ఆలోచించుచున్నావేమి కన్నమదాసూ! అయ్యో! అట్లు గ్రుడ్ల నీళ్లుగుక్కుకొనుచు ఏడ్చుచున్నా వెందుకయ్యా! నన్ను చంప వలసి వచ్చినదనియా?

కన్నమ:– బాలచంద్రా! చందమామవలె ముద్దులొలుకు నీ ముఖము చూచిన ఎట్టి కసాయివానికైన చంప చేతులువచ్చునా? నీవు మహా మంత్రి బ్రహ్మనాయునిగారికి కుమారుడవుగా బుట్టక సామాన్యుని కెవనికో పుట్టియుండిన నీకీపాటు వచ్చెడిదికాదేమో? సామాన్యకుటుంబ మున బుట్టిన ఏ కలియో? గంజియో? త్రాగి సుఖముగా జీవింతువే! మహామంత్రి కుమారుడవై నీ కొరిగినదేమున్నది? మాలవాడనని నీ వధ విధానమునకు నాయనగారు నా కాజ్ఞ యిచ్చినారుగాని. నాలోని మార్దవతా గుణము గుర్తింపలేదు నా చేతిమీదుగా నీ తల నఱకమనినాడు. ఇంతకన్న నాకు నరకమేమున్నది? జన్మచేత నీచుడనయ్యు మనః పరిశుద్ధిచేత ఉచ్చత నందుకోవలయునని పరమవైష్ణవుల పంచ జేరితిని. నా పాకులాటకు ఫలితమిట్లయినది. నమ్మిన నా స్వామి వంశమును నాశనమొనర్చి నే నధఃపతితుడను కావలయునని యున్నది కాబోలు! నా తలవ్రాత తప్పింప ఎవరి వల్లనగును? ఏ జన్మ పాపఫలమో? కసుమాలపు మాల పుట్టువు పుట్టితిని. ఇప్పుడీజన్మలో ఈ పాప ఫలమున ఇంతకంటె నీచాతి నీచ జన్మ యెత్తుదునేమో? జన్మ దుఃఖ పరంపరా క్లేశమునకు బీజ రూప మయిన కర్మరాహిత్యమునకు దారి దొరకదయ్యెనే? ఎంత దుర దృష్టవంతుడను?

బాలచం!– కన్నమదాసూ! ఈ ఆలోచనలన్నిమాని, ఈ ఆడవిలో నన్ను చంపివేయుము. ఇక్కడెవ్వరుచూచువారులేరు ఇది నిర్జనప్రదేశము

కన్నమ:– ఇది నిర్జన ప్రదేశమా? ఇక్కడెవ్వరు చూచువారులేరా? నా పాప కృత్యము! ఉన్నారు బాలచంద్రా! జగమెల్ల కన్ను చేసుకొని సూర్యుడు చూచుచున్నాడు విశాల నీలాకాశము దిశాంధులు పఱచు కొని యున్నది. ఎంతపోయిన అంతయున్నది భూదేవి. నా ఘోర కృత్యము చూచి జావురుమనే దిక్కులున్నవి. ఈ దిశావకాశ భూమ్యా కాశ సూర్యప్రకాశములు సాక్ష్యములు లేవు. వీరందఱి కన్నులు మూసి నిన్ను చంపలేను.

ఉ॥ ఎత్తగలేను నీ మెడపయిం గృపమాని కృపాణమిద్ది - ఈ
యెత్తిన మాలపుట్టువున కేడ్పుచునుంటిని - గుండెకేదొ పీ
తెత్తుచునుండె - ఈ దురిత కృత్యపు కర్మఫలాను భోక్తగా
ఎత్తగలేను వేనిక నికృష్టపు జన్మల ఎత్తలేనిలన్.

బాలచం!- తండ్రిగారి ఆజ్ఞ కన్నమదాసూ! జవదాటుదువా?

కన్నమ:- జవదాటలేను. నా గుండె అదరుచున్నవి చేయి వణకుచున్నది. నేనీ పని చేయలేను.

బాలచం!- నీవు చేయలేకున్న నేనే చేసికొందును. ఆ కత్తి నిటు తే.

(అని కన్నమదాసు చేతిలోనున్న కత్తిని తీసుకొన ప్రయత్నించును)

కన్నమ:- (కత్తిని గట్టిగ పట్టుకొని యేడ్చును) విడిచిపెట్టుము బాలచంద్రా! కత్తిని విడిచిపెట్టుము (మరి యేడ్చును)

బాల:- ఉ॥ కన్నమదాస! ఏలయిటు కన్నుల నీళ్లొలకంగ - ఏడ్చెదో?
ఎన్నటికైన - ఉన్నయదియేగద! చావిల దేహధారికిన్
నన్ను వధించి రమ్మనిన నాన్న నియోగము మేరకిప్పుడే
తిన్నగ నీదుగత్తి తలద్రెంపుము! నీ విధి నిర్వహింపుమా!

కన్నమ!- (ధైర్యముతో కత్తినెత్తుచు) బాలచంద్రా! కన్నులు మూసికొని కడసారిగా మాచెర్ల చెన్నయ్యను ధ్యానించు. ఒక్క వ్రేటుతో నీ తల తెగిపోవును

బాలచం!- (కన్నులు మూసికొని చేతులెత్తి నమస్కరించుచు)

గీ॥ మాతృభూమికి నా వల్ల మానరాని
యే అరిష్టము వచ్చిన ఇష్టమగునె!
దేశమునకగు మేలు నే తీరిపోవ
చెన్నకేశవా! నన్ను నిన్ జేర్చుకోవ.

కన్నమ:- (ఒకచేతితో కన్నులుమూసికొని ఇంకొక చేత కత్తినెత్తును)

గండు ;- కన్నమదాసూ! కన్నమదాసూ! ఆగు ఆగు (దూరమునుండి కేకలు పెట్టును)

కన్నమ!- ఆగుమను చున్నారెవరు?

గండు !- (పరుగునవచ్చి) బాలచంద్రుని చంపితివా కన్నమదాసూ!

కన్నమ:- లేదు. చంపలేదింకను. కన్నమనీడుగారు!

గండు :- నీ వెంత మంచివాడవు కన్నమదాసూ! నీ వీ పాటికి చంపియే
యుందువని మరుగులు గ్రక్కుకొనుచు పరుగులతో వచ్చితినోయి!
చెన్నయ్య అనుగ్రహాన ఆ పని జరుగలేదింతేచాలు.

మ॥ ఎవ్వరోచెప్పిన పిచ్చి జోస్యములతో ఈ రీతి బ్రహ్మన్న సుం
త వివేచింపడు మంత్రియయ్యును-మహా తంత్రజ్ఞ నాగాంబ తం
తవునేమో యిది నాకు జూడగను దూరాలోచనల్ చేయగా
నవు నీ శక్తి నిదింపు ముందు తలదీయ న్వేయి నీకేటికిన్?

కన్నమ:- మన దేవుడు చెన్నయ్యే నిన్ను పంపినట్లున్నాడు. నమ్మిన
నా స్వామి కొమరుని నా చతిమీదుగ చంపుట తప్పిపోయినది కాని

గండు:- శంకింపకుము బ్రహ్మనాయుడు నీవు తన ఆజ్ఞ నెరవేర్చితివనియే
అనుకొనును. దూర గ్రామమున నా బంధువు చంద్రమ్మ యింట
బాలచంద్రుడు పెరుగును. కొన్నాళ్లు జరుగును.

కన్నమ:- ఈ రహస్యము -

గండు :- బ్రహ్మన్న యెఱిగిన ముప్పే.

కన్న :- అప్పుడు తాను, చూచుచుండ - తన యెదుట - బాల చంద్రుని

గండు :- అంతవరకురాదు. ఈ లోపల నాగమ్మ తంత్రము బయటపడును.

కన్నమ:- ఇప్పుడు పోగానే బాలచంద్రుని వధించితివిగదా యనిన నేనే
మందును?

గండు :- నీ వేమియు ననవద్దు. కన్నీరు కార్చుము. ఆయన నిజముగ
బాలచంద్రుని వధించితివనియే అనుకొనును.

కన్నమ:- రేచర్లవారి వంశమును నిలబెట్టిన పుణ్యాత్ముడా! నీకు కోటి
నమస్కారాలు. (నమస్కరించును)

గండు :- నీవు వద. రా బాలచంద్రా! (బాలచంద్రునితో బోవును)

(తెరపడును)

# నాగమ్మ కౌటిల్యము

దృశ్యము : నాగాంబ మందిరము

ప్రవేశము : నటరాజ విగ్రహము ఎదుట ఏదో ఆలోచనగా నిలబడి చూచుచు నాగాంబ.

గోపన్న:- (ప్రవేశము వెనుకనుండి) నాగాంబా!

నాయ :- ఎవరు (తిరిగిచూచి) మీరా గురుదేవా! నమస్కారము.

గోపన్న:- ఏదో ఆలోచించుచున్నావు? అన్నట్లు మరచితిని ఆ మధ్య మన ప్రయోగమేమైనది

నాయి :- వ్యర్థమైనది.

గోపన్న:- ఆఁ - మహేంద్రుని వజ్రము కుంఠితమగునేమోగాని, మన ప్రయోగము-

నాయ :- కుంఠితమే అయినది. దానితో బ్రహ్మనాయుని త్యాగనిరతి మెరుగు బారినది. బ్రహ్మనాయుడు జోస్యము నమ్మి కన్న కుమారుని కన్నమదాసుచేత చంపబంపినాడు.

గోపన్న:- బాలచంద్రునివధ-

నాయ :- జరుగలేదు గురుదేవా! కన్నమదాసు బాలచంద్రుని చంపలేదు.

గోపన్న:- చంపలేదా? వాడు బ్రహ్మన్న యెంత చెప్పిన అంత చేయునందురే.

నాయ :- కమ్మకులముజెడు కన్నమనీడు అది తప్పించినాడు. బాలచంద్రుని దూర గ్రామమున ఎవరో తన బంధువింటదాచి కాపాడినాడు.

గోపన్న:- (పెదవి కొఱికికొనుచు) కన్నమనీడు! వీడొకడు!

నాయ :- ఈ సంగతి వింటివా గురుదేవా! ఆ గండువాడు తన ముద్దుల కూతురు మాంచాలను బాలచంద్రునికిచ్చి మాచెర్లలో మహా వైభవముగ పెండ్లి చేసినాడు.

గోపన్న:- అరరే! పదకమెంత పాడయినది.

నాయ :- అప్పుడే అట్లనుకొనెదవేమి గురుదేవా? గండువాడు తన కూతురు సుఖపడునని మహామంత్రుల వియ్యంకుడైనాడు. వీరి వియ్యపు తియ్యములో విషము పోసెదను! మాంచాల కాపురము కచ్చికలు కావించెదను. ఆ నవదంపతుల కొకరికొకరు కాకుండజేసెదను. కొంత

లంచమిచ్చి ఆ ఊరిలో బొల్లసాని కూతురు సబ్బాసానిని ప్రయోగించితిని. ఆమె మాయా నాటకమునకు నాందియు జరిగినది. ఆ పెండ్లి మేళములో తన మేళమును నిన్ననే అభినవరతియగు ఆమె తన అద్భుత లాస్యమున బాలనాయని మనసు వశ్యము చేసికొనును. ఇకచూడు! ముద్దుల మాంచాల వాని కంటికి మొద్దు మాంచాల వద్దు. సబ్బాసానితోనే పొద్దులు సద్దులేకుండ వృత్తునము కొనును. చాలునా గురుదేవా!

గోపన్న!- చాలు నాగాంబా! గండువాని తిక్క యిట్లుకుదిరినచాలు. దీనితో వెలమ బ్రహ్మయ్యకు కమ్మ కన్నయ్యకు నీవన్నట్లు వైమనస్యమే.

నాయ :- మరి వియ్యపురాండ్రు అయితాంబా రేఖాంబలకో?

గోపన్న:- ముక్కు విఱుపులు, మూతి ముడుపులు.

నాయ !- ప్రధానులసేనానుల హృదయాలలోవ్యధాగ్నులు, క్రోధాగ్నులు, రాజకీయ వాతావరణములో రవరవలు. మాచెర్ల ఒక నిప్పుల కుంపటిగా మారిపోవును. నీకు సంతోషమేనా గురుదేవా!

గోపన్న:- సంతోషము! మహాసంతోషము! శిష్యురాలి అఖండ శేముషీ విశేషమునకు గర్వించుచున్నాను.

నాయ :- మీ ఆశీర్వాదబలము గురుదేవా!

మ॥ మగవారే తగువారలంచును మహామంత్రిత్వముల్ సల్పు చుం
డగ - మీరేగురుదేవులౌచు - అసమానప్రజ్ఞ కౌటిల్యమున్
తెగ బోధించితిరిల్లుగట్టి చెవియందే నాకహోరాత్రముల్
తగువారైరిపుడాడువారు - ఇది యెల్లన్ మీ కృపావీక్షయే.

ఇక చేజాఱిపోయిన మాచెర్ల పునరాకర్షణము! అందుకే నటరాజస్వామి ముందు నా ఆలోచన నా తపస్సింకా ఫలోన్ముఖముకాలేదు గురుదేవా!

గోపన్న:- అవుతుంది నాగాంబా! ఇది తథ్యము. అదిగో ఘంటారావము. మల్లికార్జునారాధనా సమయము. పోయెదను.

నాయ !- మీరు పదండి గురుదేవా! నేనుగూడ వత్తును.

గోపన్న!- (నిష్క్రమించును)

(తెరపడును)

# సంక్రాంతి ఆహ్వానము

మాచెర్ల మలిదేవరాజు సభ

ప్రవేశము : మలిదేవరాజు, బ్రహ్మనాయుడు.

బ్రహ్మ :- నాగాంబ దూరదృష్టి గమనార్హము మలిదేవా!

మలిదే:- ఇప్పుడేమైనది మహామంత్రీ!

బ్రహ్మ :- మాచెర్ల గురిజాలలు దేనికది వేఱైన తరువాత దేనికది రాజకీయపుటంతపుండలు సృష్టించుకొనుచున్నవి.

మలి :- అర్థమగుటలేదు. చెప్పునది సూటిగా జెప్పుము మహామంత్రీ!

బ్రహ్మ :- కల్యాణపురాధీశ్వరులగు వీరసోములు శైవులగుట మొదట నీకు గూతునిచ్చుటకు సంకోచించినను సిరాలదేవిని నీకు దేవేరిగ జేసినాడు.

మలి :- అది మీ అద్భుతరాజనీతి చతురతకు తార్కాణము మహామంత్రీ! కల్యాణపురాధీశ్వరుల ప్రత్యర్థుల పక్షము వహింతుమని మన కతడు లోబడకతప్పలేదు. కాని, వీరసోముల తరువాత ఆయన కుమారుడు కొమ్మరాజు రాజ్యభ్రష్టుడై మాచెర్లలోనే ఉండవలసి వచ్చెనుగదా! తిరిగి ఆయన కల్యాణపురాధీశ్వరుడగున దెప్పుడో?

బ్రహ్మ :- ఎప్పుడో అది మనమే చేయవలసియున్నది. ప్రస్తుతము మీ కుటుంబపరిస్థితులతో అది సాధ్యముగాదు. సమయము రావలయును

మలి :- అందాక కొమ్మరాజ కుటుంబమిక్కడే యుండవలయునుగదా

బ్రహ్మ :- ఉండనీ మలిదేవా! నీవు గమనించితివోలేదో? కొమ్మరాజండ మనకు లేకుండ జేయవలయునని నాగాంబ, నలగాముని యేకైక పుత్రికను రత్నాల పేరిందేవిని కొమ్మరాజు కుమారుడగు అలరాజున కిప్పించి కొమ్మనతో వియ్యము గల్పించినది.

మలి :- దీనితో కొమ్మరాజు ఉభయులకు గావలసినవాడైనాడు. నాకు బావమఱదియై మా యన్నకు వియ్యంకుడైనాడు.

బ్రహ్మ :- నాగాంబ మీ అన్నదమ్ముల హృదయాలను వేఱుచేయుచున్నది. ఎవ్వరేమనుకున్నను నాకు మీ యిద్దఱొక్కటి. మాచెర్ల గురిజాలలు రెండును రెండు కన్నులు నాకు. ఉభయ రాజ్యాల శ్రేయస్సు నాకభిలషణీయము.

మలి :- అన్నట్లు నేననగూడదు గాని, అన్నయైనందులకు నా పెండ్లి విషయమున నలగామరాజు తన పాత్ర యెంతవరకు నిర్వహించినాడు?

బ్రహ్మ :- నీ పెండ్లిలో పట్టియు పట్టనట్లేయున్నాడు. మనము గూడ పేరిందేవి పెండ్లిలో ఎంతలో నుండవలయునో అంతలోనే యుంటిమి. నాగాంబ మూలమున మీ అన్నదమ్ము లింకను దూరమైపోవుదురేమో యని భయముగా నున్నది.

మలి :- భయమెందుకు? ఆమె యెంతచేయునో చేయనీ మహామంత్రీ! మీ పట్ల యెంతో అడకువననుసరించు నలగామరాజు నేడు నాగాంబ యెట్లు వినయించుమన్న అట్లు వినయించుచున్నాడుగదా!

చం॥ స్వయముగ విద్దెలంగఱపి పట్టముగట్టియు రాజ్యలక్ష్మి క
ద్వయముగ పల్లెనాటి విభవమ్మును బెంచిన మిమ్మెకింతయున్
నయముగనెంచబోడిపుడు నాగమప ల్కమృతంపు పల్కుగా
అయినది - నీదువల్క విసమైనది యెంతకృతఘ్నుడోగదా!

బ్రహ్మ :- కృతఘ్నుండు! నిజము మఱిదేవా! నలగామరాజు నాయందింత ఉదాసీనుడగునని కలలోగూడ అనుకొనలేదు. నాయందతనికి గౌరవము పోయినది. కొడుకు పెండ్లికి రావలయునని అంతగా పిలిచితిమే రాకుంటకు వానికి తీరని రాచకీయములేమున్నవి? నాగమ్మ తను గీచిన గీటు దాటకుండ జేయుచున్నది. పాపము! అమాయకుడైన రాజా మెనర్థము చేసికొనలేకున్నాడు. ఎంతమారినాడు.

మ॥ ననుగొల్చెన్ మును దేవునట్లు - తలచెన్నన్నుం బితృప్రాయుగా-
నను బూజించె గురుండుగా - ఇపుడహో నాగాంబ దుర్బోధల
న్నను నేమాత్రములక్ష్యపెట్టడు కృతఘ్నత్వంబు హెచ్చెం గసుల్
కనదావయ్యో నహంబుగుర్తిడ్డితన మెక్కంజేసె నెంతేనియున్.

మలి :- (ఎదురుజూచి) ఎందుకో పిలిచినట్లు వచ్చుచున్నాడు మనసేనాపతి

గండు :- (ప్రవేశము)

మలి :- రా సేనాపతీ! కూర్చుండుము!

బ్రహ్మ :- కూర్చొనుము! ఏమట్లుంటివి బావా! ముఖమట్లు వివర్ణముగ మున్నదేమి?

గండు :- అడుగుమందివా మహామంత్రీ! ఆడపిల్లవారి బాధలు చెప్పు కొననిదే తెలియవు కాబోలు!

బ్రహ్మ :- ఏమట్లనుచుంటివి? బావా! ఇప్పుడు మీ ఆడపిల్లవారికే మన్యాయము జరిగినది?

గండు .- మహామంత్రులు కొమరుని విషయమింత పట్టించుకొనకుందురని నేననుకొనలేదు.

బ్రహ్మ :- బాలచంద్రుని విషయమా నీ వనునది?

గండు :- అవును బావా! చనవుచేత కొడుకు, సంగముచేత యతి చెడు నందురు. మొక్కై వంగనిది మ్రానై వంగదుగదా!

బ్రహ్మ :- అన్నట్లు ఇది వేనెఱుగకకాదు. కొడుకు విషయము నేనంతగా పట్టించుకొననిమాట వాస్తవము. వాడు మా నలుగురన్నదమ్ములకు కొక్కడేగదా! కడుపుతీపి తెలియనట్లనుచున్నావేమి బావా!

గండు :- కడుపుతీపి! కనుకనే కాబోలు! కన్నమదాసుచేత చంపబంపినది.

మలి :- (నవ్వుకొనును)

బ్రహ్మ :- తిరుగదోడకుము బావా? బ్రహ్మన్న తత్త్వము తెలిసిగూడ నీ వట్లనుకొనుట శోచనీయము. బ్రహ్మన్నకు వ్యవహారకంటె దేశ ప్రజయందే మమత పెచ్చు. జ్యోతిశ్శాస్త్రముపై విశ్వాసమున్నవాడను

గండు :- ఆ విశ్వాసముతో పుత్రవధ జరిగిన యేమయ్యెడిది?

బ్రహ్మ :- ఏమియులేకుండబోయెడిది. ఇందు నాగమ్మ కుట్రియెంతున్నను (ఏదో అనబోయి ధోరణి మార్చుకొని) అది పోనిమ్ము మీరందరు చెప్పగా నేనది జరిగింపని మూలమున నా కన్నియు సమస్యలే యైనవి.

మలి :- మహామంత్రిగారి నొప్పింపకుము కన్నమనీడా!

గండు :- (ఊరకుండును)

బ్రహ్మ :- నే జెప్పగూడదుగాని. కుమారుడట్లు సంసారమునుగాని, రాజకీయమునుగాని పట్టించుకొనకుండుటయే మంచిది. ఏదో కొన్నాళ్లు వాని యిష్టము వచ్చినట్లు తిరగనీబావా!

గండు :- బ్రహ్మన్న బావా! స్వేచ్ఛగా తుచ్ఛవేశ్యాలంపటమున వాని నట్లు తిరుగ నిమ్మను చున్నావా? నీ గంభీరత నా కర్థముగాదు.

మలి :- సేనాపతీ! మహామంత్రిగారి హృదయ గంభీరత యెవరికీ అర్థముగాదు.

గండు :- అర్థముకాదు నిజమే మహారాజా! తండ్రిగా ఆయన అనవలసిన మాట కాదేమోయిది. కోడలి సుఖము చూడదలచుకోలేదేమో బావ గారు!

బ్రహ్మ :- (మితముగ నవ్వుకొని) కోడలి సుఖము చూడదలచుకోని మామను నేను నిజముగ. బావా! నా హృదయములోని గూఢార్థములు విప్పిచెప్పలేనిప్పుడు.

గండు :- భర్తృ తిరస్కృతయై బాధపడుచున్న మాంచాల ముఖము చూడవలసి వచ్చినప్పుడు తన్నవారికి మా కెట్లుండునో విప్పి చెప్పవలయునా బావా!

చం॥ తొలిదెస చందమామ తొగతొయ్యలితో గిలిగింతలాడగా
ఎలమిని రాగపైపయికి, ఎట్టెదుటన్ శశికాంతవేది - చె
క్కిలి జెయిజేర్చి - ఊర్పులు నిగిడ్చుచునుండగ-ఇంకనెన్ని నా
ళ్లిల నెలలెన్ని వత్సరములెన్నిగ బోవలెనో వచింపుమా!

బ్రహ్మ :- (నిట్టూర్చి) బావా! నా కిది తెలియనిదికాదు తెలిసి తెలిసియే కుమారునట్లు విడిచివేసితిని. నా మనోగతము చెప్పనిదే నీ కర్థముగునట్లులేదు. నేను వాని జాతకమును గుఱించిన జోస్యముపై నమ్మకము పూర్తిగ తీసివేసికొనినవాడనుగాను. నే ననరాదుగాని, వాని మూలమున పలనాటికేదో ప్రళయము ముంచుకొని వచ్చుననియే తోచుచున్నది. దానికి నాందిగా నాగాంబ పలనాటి రాజకీయ ప్రవేశము! ఆడుదాని మంత్రిత్వము!

మలి :- మహామంత్రిగారి హృదయకవాటమావల దాగియున్న ఊహలను బట్టి భారతేతిహాస మెఱిగినవారమగుట ఈ యుగమున పలనాటి వీరభారతము జరుగవచ్చు.

సేవ :- (ప్రవేశము) జయము జయము మహాప్రభువులకు గురిజాలనుండి ఎవరో తమకేదో సందేశము తీసికొనివచ్చినాడు.

బ్రహ్మ :- (చకితుడై) ఏమైయుండును?

మలి :- సేవకా! వాని నిక్కడికి రమ్మనుము.

సేవ :- చిత్తము. (వెళ్లి సందేశహరుని బంపును)

సందే :- (ప్రవేశము) ప్రభువులకు నమస్కారము. గురిజాలనుండి నల గామరాజుగారు పంపగా మీ కొక సందేశ పత్రము తీసికొనివచ్చితిని (ఇచ్చును)

మలి :- (తీసికొని) ఇదేదో నీవు చూడుము మహామంత్రీ!

బ్రహ్మ :- (పత్రమువిప్పి చదువును)

మాచెర్ల ప్రభువులు మలిదేవులకు శుభాశీస్సులు! మహామంత్రులు బ్రహ్మనాయుడుగారికి నమస్సులు! కుశల ప్రశ్నానంతరము నల గామరాజు తెలియజేయు సందేశార్థములు.

సంక్రాంతి పండుగ తెలుగువారికి గొప్ప పండుగ. రానున్న సంక్రాంతికి యథాపూర్వముగా నాకు తమ్ములతో, తక్కుంగల బంధుగులతో వినోదముగా గడుపవలయునని యున్నది. ఈ సంద ర్భమున కోళ్ల పందెముల కేర్పాటులు చేయుచుంటిమి. వినోదము కోసము మాచెర్ల ప్రభువులు గురిజాల ప్రభువులు కోళ్ల పందెములు ఒండొరులము జరుపుకొందము. కనుక, మీ పందెపు కోడిపుంజులతో గురిజాలకు బయలుదేరి రావలసినదిగా కోరుచున్నాను. ఈ నా కోరిక త్రోసిపుచ్చరని విశ్వాసము.

గురిజాల — ఇట్లు

పుష్యశుద్ధ ౩ సోమవారము. — నలగామరాజు.

(కొంచెముసేపు అందఱు స్తబ్ధులై యుందురు)

సందే :- నేనిక సెలవు తీసికొనుచున్నాను.

మలి :- మంచిది. మా రాకను గుఱించి తరువాత తెలియజేసికొందుము.

సందే :- చిత్తము (నిష్క్రమించును)

మలి :- అడుగో! బావ కొమ్మరాజుగూడ సమయమునకే వచ్చుచున్నాడు. రా బావా! కూర్చుండుము.

కొమ్మ :- (కూర్చుండును) గురిజాలనుండి యెవరో వచ్చిరట. మనుగుడు పులకున్న అలరాజు పంపినవాడు కాదుగద?

మలి :- అట్లయిన నీకు జెప్పకుందుమా! మా అన్న నలగామరాజొక సందే శము పంపినాడు. మనము సంక్రాంతి పండుగ వేడుకలుగా కోడి పందెములాడ గురిజాల రావలయునట! రాజాహ్వానము!

కొమ్మ :- కోడిపందెములా ఎందుకివి? మీ రేమి నిశ్చయించితిరి.

బ్రహ్మ :- కోడిపందెములు హింసతో గూడుకొన్నవి. హింస నా కిష్టములేదు సాటివారాహ్వానించినప్పుడు పోవకుండుటయును గాదు పోవుటయో పోవకుండుటయో అందటి ఉద్దేశములపై ఆధారపడియున్నది.

గండు :- నాకుజూడ ఇది దుర్యోధనుడు, నూతన సభా భవన ప్రవేశ సందర్భమున, ఉబుసు పోకకు ద్యూతక్రీడావినోదమునకు రమ్మని ధర్మరాజాదుల నాహ్వానించుటలాగున్నది

బ్రహ్మ :- అన్నట్లు వినోదాలకని దిగిన కోడిపందెములు రాజ్యాలొడ్డుకొను దాక రావుగా?

గండు :- రాజ్యాలొడ్డుకొనుటయే జరిగిన ఎవరో ఒకరోడక తప్పదు.

మలి :- దిగువంకే యెగతాళి. తరువాత పగలు పట్టుదలలు పెరగక మానవు.

కొమ్మ :- కోడిపుంజుల రోసాలతో పలనాటివారు మీసాలు మెలివేయుదురా యేమి?

గండు :- ఇదేదో నాగాంబ పన్నగడ.

బ్రహ్మ :- ఎక్కడ దాపురించినదీ నాగాంబ? పాలు నీళ్లలాగ కలిసి మెలసి యుండవలసిన పలనాటి రాజకుటుంబమున వేరుబందములు తెచ్చి పెట్టుచున్నది.

గండు :- అనురాగముగా ఉండే అన్నదమ్ముల మధ్య లేనిపోని కచ్చలు పెచ్చరిల్ల జేసి, ఆమె సాధించు ప్రయోజనమేమిటో?

బ్రహ్మ :- ఉన్నది ఒక ప్రతీకారవాంచ. అది నలగామరాజునకు తెలియదు తెలియజెప్పుదమన్నను తెలిసికొను స్థితిలో లేడు.

మలి .- ఇదేదో నాగమ్మ పదకము కాకపోతే తండ్రి అలుగురాజుగారు వేటకు బోవుటేమి? అక్కడి నాగమ్మ అతిథి సత్కారములేమి? ఆయన వరమిచ్చుటేమి? ఆ వరమప్పుడు కాదని యిప్పుడు నలగామరాజు నడుగుటేమి? పిచ్చిమా రాజు మూడురోజులు మంత్రిత్వమిచ్చుటేమి? ఏవేవో గాదలు త్రవ్వుకొని వచ్చుచున్నవి.

గండు :- ఆవగింజంత సందుచేసుకొని గుమ్మడికాయలను దూర్చినట్లు. మూడునాళ్ల మంత్రిపదవితో స్థిరముగా పల్నాటి రాజ్యమున వేళ్లు పాతుకొని పోయినది. నిజముగా ఆమెకేదో ప్రతీకారవాంఛ యున్నట్లు సువ్యక్తము.

బ్రహ్మ :- అదేదోకాదు నాగమ్మ పెంపుడుతండ్రి రామిరెడ్డిని ఒకానొక రాజ కీయ నేరము కారణమున ఉరితీయుట జరిగినది.

కొమ్మ :- అట్లు చెప్పు! ఆ పగ తీర్చుకొనుటకా యిదంతా.

గండు :- ఒక్క ఆడుది ఎంత సాహసమునకు దిగినది?

మలి :- స్త్రీ సాహసము! నేరముచేసినప్పుడు శిక్షించుటలో తప్పేమున్నది? చాలిన దాననని రాజకుటుంబముపైనే కక్షపూనినదిగా?

కం|| చాలిన వారిని విడిచియు
చాలని వారలను శిక్ష సలుప దొరదగుం-
చాలమి - శిక్షాస్మృతి శా
స్త్రాలం దపవాద సూత్ర సరణులు గలవే?

కొమ్మ :- స సర్పగృహావాసము మృత్యుప్రదము సర్పనామధేయ నాగాంబను నమ్మి నలగామరాజెంత ముప్పుతెచ్చుకొనుచున్నాడు.

బ్రహ్మ :- నాగమ్మకు అంతరంగమున ఆ స్పర్థ. బహిరంగమున మతస్పర్థ ఆమె స్పర్థాద్వేషములముద్ద. ఆమె దుస్సంకల్పమునకు తోడు మత ద్వేషము మానని నిప్పుగా నున్నది.

ఉ|| ఈ మతవైమనస్యములిటే ప్రబలంబయి పల్లెనాటితో
ఏమి అనర్థకమ్ములిక ఏర్పడజేయునో? పాముపేరునం
గామయి దాపురించినది - కప్పలతక్కెడయయ్యె జాతియున్-
కామధరాతలేశుడిది కానడు మాన డమాయకత్వమున్

గండు :- ఇంత తెలిసి, ఇప్పుడీ కోడిపందెములకు మనము పోకుండుటయే మంచిదని పించుచున్నది. కోడిపందెముల వెనుక ఏదో కుట్ర.

కొమ్మ :- అడుసుత్రొక్కనేల? కాలుకడగనేల? కోడిపందెములకు పోకుండు టయే మంచిది. ధర్మరాజిట్లే కితవద్యూతమునకియ్యకొని, అంత చేసికొనినాడు. ధర్మరాజును శకునివలె, నాగమ్మ న ల గా మ రా జు వెనుక మనలను పొంచిద్యూతమునకు ఉసికొల్పుచున్నది. తడిగుడ్డ లతో గొంతులు కోయునదిగానున్నది నాగమ్మ.

మలి :- లెస్సవచింతిరి, మన మీ కోడిపందెములకు పోకుండుటయే మంచిది కాని, పోకున్న అసమర్థులక్రింద లెక్కించుకొని సాటి రాజలోకమున మనల అవహేళనము పాలుచేయునేమో? యోచింపుడిదిగూడ!

గండు :- అట్లనుకొన్నచో నాగాంబ మాయావాగురలో మనము తగులు కొన్న వారమగుదుము మహారాజా! కీడెంచి మేలెంచవలయును.

ఉ॥ ద్యూతము కూడదెవ్వరికి - తొల్లి నలుం, డల ధర్మజుండునున్
జ్ఞాతులతోడ నియ్యకొని - సర్వము బోవ మహోగ్ర కానన
వ్రాతములందు - కట్టిడుములం బడరే? మనకేల కుక్కుట
ద్యూతపు రొంపిలో దిగగ దుర్వ్యసనంబది నీవెఱుంగవే?

మలి :- కన్నమనేడా! ఇప్పటి విషయమున మహామంత్రిగారి మాటయే మనకు బాట-

బ్రహ్మ :- కన్నమనీడు బావా! నీవు చెప్పినది నిజమే. కాని, క్షాత్రము పాటింపవలయును గదా! కోడిపందెములు రాజులకొక పౌరుషాంకములైన పినాడు

గండు :- మహామంత్రులకు కోడిపందెములక్షేగవలయునని యున్నది.

బ్రహ్మ :- క్షాత్రమావెపునకు లాగుచున్నది బావా! ఏమి చేయుదుము. మలిదేవరాజా! నీ యిష్టమేమి?

మలి :- మీ యిష్టమే నా యిష్టము

బ్రహ్మ - కన్నమదాసెక్కడ?

కన్న :- స్వామీ! ఏమాజ్ఞ?

బ్రహ్మ - గురిజాలకు కోడిపందెములాడ బోవలయును రెండు మూడు రోజులలో పౌరుషముగల కోడిపుంజులను సిద్ధము చేయుము. వినోదముల కనినారుగాని కోడిపందెము పట్టుదలలకు దించకపోదు తగిన సన్నాహముతోనే పోవుట మంచిది. నలగామరాజు వెనుక నాగమ్మదే పాత్ర నిర్వాహణము నాగమ్మ కోడికి ప్రతిద్వంద్విగా మన చిట్టిమల్లు నుపయోగింతము.

కన్న :- చిట్టిమల్లు, నాగమ్మ కోడిని జుట్టుపట్టుకొని గిర గిర త్రిప్పికొట్టక మానదు. మన చిట్టిమల్లు నాడి ప్రతాపము వాళ్ళకు తెలియదు.

బ్రహ్మ :- కోడిపందెముల సంగతి తెలిసిన పడవాలు గోపన్న రాకమానడు. వాడు రాకుండుట మంచిది

కన్న :- ఏమిట్లనుచున్నారు? గోపన్నను కోడిపందెములకు రావద్దని కట్టి వేసినను కట్టు తెంపుకొని రాగలడు. గోపన్న రాకుండుట మంచిదనుచున్నారేల స్వామి!

బ్రహ్మ :- (కోపావేశముగ) గోపన్న వచ్చిన తిరిగిపోడు. అంతరాత్మ చెప్పుచున్నది వాడు రాకుండ చూడుము ఏదో చెప్పిపంపు దారిగాచి యుండు

కన్న :- అట్లనే.

మలి :- సరే యిక మనము గురిజాల ప్రయాణసన్నాహములతో నుండెదము.

(తెరపడును)

## విష్కంభము

# గురిజాల పురోపకంఠము

గంగిరెడ్డి !- (ప్రవేశము) అబ్బో! అబ్బ యేం జెనం యేం జెనం? వొసుళ్ళ పట్ట పగిలినట్టుగుంది. యాడజనం యేంకత? వూర పట్టుతుందాంట! వోరి న్నా సామిరంగోయ్! గుఱ్ఱాలెక్కొచ్చేవోళ్ళు! ఒన్లెక్కొచ్చేవాళ్ళు! కూళ్ళుకట్టుకొనొచ్చేవాళ్ళు! ముసిలోళ్ళు! ముతకోళ్ళు! పడుచోళ్ళు! పావళ్ళు! ఆడోళ్ళు! మొగోళ్ళు! సీమలబారుల్లాగా వొచ్చేత్తున్నారు. నేల యీనినట్టుగుంది గంప వోరి బాబోయ్! మేనాలూ, పల్లకీలూ, మేళాలు, తాళాలూ, యీలలేసుగుంటూ యాలలు పాడుకొంటూ వొచ్చేత్తున్నారు జెనం. సూత్తానికి కళ్ళు సాలేట్టులేదురోయ్! యేం సంబరం? యేం పంబరం? వుల్లాసం వురకలేత్తుంటేను. యీ యేడు పండగ మాలావు జోరుగా సాగేట్టుగుంది. మా సెర్ల దొరలూ, గిరిజాల దొరలూ మీసాలు మెలేత్తూ కోడిపందేలేత్తుంటే యేడుక సైన్న సెక్కెమ్మాంట! యేడుక సూత్తానికి దేవతలు యిమానాలేసుకొని సొరగ్గంనించి భూమ్మీనకి దిగొత్తారు యిందుడూ సెందుడుడూ యాళ్ళంతా వొత్తారన్న మాటే. గురిజాల వైబోగం యేం సెప్పను. నింగ్గినించినేలమీనికి సొరగ్గం అంటుతొక్కినట్టుగుంటది సంకురాతిరి యిటొచ్చి అటుమోక యాడాది పొడుగ్గావుంటే మా బాగుండును. (చూచి) వోడీడు యిటొత్తాడు? (గుర్తించి) వోరి మా రంగులే! యెన్నాళ్ళకెన్నాళ్ళకి? వోరి రంగులోయ్! నీతల్లి సిగదరగ యెప్పుడొచ్చావు? యాడున్నావు? యేంది యిసయం?

రంగిరెడ్డి – వోరి నా గంగులు మా వోంయ్! యేం సెప్పేదుంట? కోళ్ళపందేల మాటినాన్ను నిద్దరడితేవొట్టూ, కోడికూయంగలేశానాయె. కూసింత. కూడుమేసి పొద్దొడిసేటప్పటికల్లా పిట్టలాగొచ్చేత్తిని గురిజాలకి. నానేందిరా గంగులూ! మా సెర్ల మొత్తం వొచ్చేసిందన్న మాటే. కోడి పందేలు మా జోరుగా సాగేట్టుగుందిగా! పైపందలేసుగుంటాం సెప్పుమరి? మా బెమ్మనాయుడిగోరి కోడిమీనా నువ్వొకటంటే నాను రెండు.

గంగి :- వారేయ్ రంగులూ! మా నాగమ్మగోరి కోడిమీనా నువ్వొకటంటే నానరొండూ. వొరాకి రొండొరాలు. వొందకి రొండొందలు (చిటికె తేస్తాడు)

రంగి :- సూత్రాంగా నీ దెబ్బ నా దెబ్బ.

గంగి :- యింతకీ మీ బెమ్మనాయుడుగోరి ముటా అంతా వొచ్చేసినట్టేనా యింకేమైన వుందా?

రంగి :- ఆఁ ఆఁ నగలమైనాళ్లొచ్చేసినట్టే. యింకోరైనా వుంటే రేపీయాలకి దూకరా - మరి మీ తట్లోళ్లో?

గంగి :- వొచ్చేశారు సుట్టవక్కాల్తోసహా. గురిజాల్లో యే యిల్లు సూసినా కిక్కిరిసింజెనం. సుట్టుపక్కల వూళ్ల జెనం యింకా లాడూ బీడూ రేపీయాలకి దిగిందంటే పూరుపట్టదు.

రంగి :- మరి యీళ్లందటికీ కూళ్లో?

గంగి :- మా రాజులు తలుసుగుంటే కూటికేం తక్కువ? యూర్పాట్లు మా జోరుగా సాగిత్తున్నారు. పుట్లుసుట్లే కూళ్లొండి మోత్తారు. నానుండా నువ్వేం దిగులడొద్దు. కూడుదిని కులాసాగా కోడిపందేల కాడికి ముందేపోయి కూకుంటాం రా రంగులల్లుడా! యింటికాడ అప్పచ్చులొండి మోత్తుంది గంపలకేసి మీ అత్త.

రంగి :- (నవ్వేసి) వోరి గంగులుమావోయ్! సిన్నప్పటినుంచి సావాసగోళ్లం సాలాకాలానికొచ్చినాయె. వుత్త అప్పచ్చులేనా? కోడి నేమైనా కోత్తావా? కోటికూరయెసరు అప్పచ్చుల్లో యేసుగోని దంచుతూంటే నా సామిరంగ సొర్గ్గమెళ్లినట్టుగుంటది.

గంగి :- వోరెయ్ అల్లుడు పిల్లోడా! నువ్వేం బెంగపడొద్దు కోణ్ణికోత్తా, కల్లు మోయిత్తా నానేంలోటు సేత్తానమకున్నావా యేంది?

రంగి :- అయితే పా. గంగులు మావోయ్! (ఉల్లాసంగా చిందేసుకుంటూ పాట)

కోడిపందెమనగానె కూడునీళ్లు పట్టవసలు
యేడుక యేమందురోయ్! యెట్టి గంగులుమావ!

గంగి :- మీసాలు మెలియేత్తూ రోసాన రోసుగుంటూ
యేసుకొన్న కల్లు కొద్ది యెగరాలి రోరల్లుడా!

రంగి :- వోట పందెమేయమంటే వొకటికి రొండిచ్చుకుంటా
మాట తప్పకోనురోయ్! మావ వోరత్త మొగుడ!
గంగి :- బుట్టమీసాలోడ! యెట్టి మొట్టి వాగకుర
బుఱ్ఱ తడిపి పంపిత్తా పోదరా వోరల్లుడా!
రంగి :- కల్లుతాగి కైపులోన వొల్లు తెలీదేమొ మావ!
సల్లంగ మోసుగెల్లి కోళ్ళకాడ దింపుమావ!
గంగి :- పెద్ద పెద్దోళ్లొత్తరు పెబువులొచ్చి కూకుంటరు
రద్ది గిద్ది శాయకురోయ్ రంగుడ! వోరల్లుడ!
రంగి :- బెమ్మయ్యగోరందే బెమ్మదేముడంతోడు
నెమ్మదిగ సూత్తుండరోయ్! నిలువునముంచేవు మావ!
గంగి :- బుద్దిగడ్డితినిందంటే పోకిరోళ్ళ కదుపుండదు
అద్దు తెలిసి వుండరోయ్ అల్లుడ! వోరంగులా!

(తెరపడును)

## కుక్కుట ద్యూతము

### గురిజాల పురోపకంఠము

ప్రవేశము :- నలగామరాజు, నాగమ్మ, నరసింగరాజు ప్రభృతులు ఒకప్రక్కగా మలిదేవరాజు, బ్రహ్మనాయుడు మొదలగువారు.

నలగామ :- బ్రహ్మన్న మహామంత్రీ! సోదర మలిదేవ! తక్కంగల బంధు సుహృజ్జనములారా! సంక్రాంతి పండుగ వినోదాలను పురస్కరించుకొని, ఏర్పాటుచేసిన కోడిపందెములకు మా ఆహ్వానమంగీకరించి విచ్చేసిన మీ యెల్లరకు సభాముఖమున సంతోషాభినందనము తెలుపుకొనుచున్నాను.

చం॥ అనుపమలీల ఆంధ్రనృపులచ్చపు క్షాత్రము రూపుతాల్పగా
మొనకొని కోడిపందెముల - ప్రొద్దులు పుత్తురు తెల్గునాట - ఈ
దినములలోన మీరిపుడు తెచ్చిన పుంజులనెత్తి పందెయం
బున కెనకొల్పు డోడుగెలుపుల్గని ప్రేక్షకులబ్బురంపడన్.

బ్రహ్మ :- కోడిపందెములు నా కిష్టముకావు రాజా!

చం॥ పసగల రాచపాడి కొకవన్నె ఘటించుటమాని, యేల? దు
ర్వ్యసనమునందగుల్కొనన – ధనాదుల సర్వము నొడ్డివేయగా
నెసకొలుపున్ వినోదమున కేర్పడినట్టివి కోడిపందెముల్
కాసటివి యేమనర్థకము కూర్చునొ? దూరవు మాపు రాజుమా!

నాయ :- బ్రహ్మనాయుడుగారు కోడిపందెములను నిందించుచున్నారే! ఆంధ్రదేశమున అనుస్యూతముగా వచ్చుచున్న వీనిని దుర్వ్యసనముల క్రింద జమకట్టినారు. అనుభవముగల మహామంత్రులు క్షాత్రోచితమును విడనాడుట శోచనీయము. కుక్కుట ద్యూతములు పలనాటికే గాదు తెలుగునాటికినాటివా?

సీ॥ ఆంధ్రరాజుల మహాత్యాగ భోగశ్రీకి
ప్రతిరూపములు కోడిపందియములు
ఆంధ్ర వీరుల పౌరుషాంక విస్ఫూర్తికి-
పరిపుష్టములు కోడిపందియములు
ఆంధ్రజాతి ప్రతిష్ఠా విశిష్ట నిష్ఠకు-
ప్రాచుర్యములు కోడిపందియములు
ఆంధ్రదేశమునకు - అచ్ఛకీర్తి ప్రభా
ప్రతిపాద్యములు కోడిపందియములు
ఆంధ్ర జనతానితాంత ప్రహర్షమునకు -
ప్రబలతార్కాణములు కోడిపందియములు
కోడిపందెములనగ కాదు కూడదనుచు
అడ్డు చెప్పెదరేల? బ్రహ్మన్నగారు!

బ్రహ్మ - స్వవాదసమర్థనము! నాగాంబా! ఆంధ్రదేశమున కీప్రాణి ద్యూతములేదో ప్రత్యేక వీర పౌరుషాంకములుగా వర్ణించి చెప్పుచున్నావు గాని, నీ వొప్పుకొన్నను. ఒప్పుకొనకున్నను కుక్కుట ద్యూతము ద్యూతముక్రిందికే వచ్చును. కావున ఇది వ్యసనమనియే నేనందును. విశేషించి యివి దేశమునకు మహానర్థకములు.

సీ॥ ఈ కోడిపందెంబు లే రాజులందు - ప
రస్పర ద్వేషముల్ ప్రబలజేయు -
ఈ కోడిపందెంబు లే వీరజాతికి
పతన కారణములై పరిణమించు -
ఈ కోడిపందెంబు లే ఆంధ్రనృపతుల
వ్యసనలంబు క్రిందికి - పాలుపఱచు -
ఈ కోడిపందెంబు లే తెలుగు ప్రజకు
సిలుగు లెంతైనను గలుగజేయు -
ఇవి మహానర్థకములకు హేతువులగు -
ఒడ్డుకొనిన రాజ్యాలనే ఊడ్చగలవు
తెలిసి తెలిసి యీ రొంపిలో దిగగనేల?
నా పలుకులాలకింపుమా నాగమాంబ!

నరసిం :- మహామంత్రిగారికి రాజ్యము పోవునని భయముగనున్నట్లున్నది.

మతి :- ఏమంటివి నరసింగరాయా! మహామంత్రిగారు అతుల బుద్ధితో ఉభయ శ్రేయస్సాధ్యములై దూరదృష్టితో వ్యవహరించుచున్నారు. వారి భయము రాజ్యము పోవుననిగాదు. పోడు కోడిపందెముల మూలమున అన్నదమ్ములమధ్య రవరవలు హెచ్చునేమోయని.

నలగా :- మతిదేవా! ఏదో సంక్రాంతి వినోదాలకని కోడిపందెము లేర్పాటు చేసితిమి. వేరే భావములు త్రవ్వుకొననేల? ఇంత దూరాలోచనలేల?

బ్రహ్మ :- దూరాలోచన మంచిది మహారాజా! వెనుకటి ఇతిహాసిక దృష్టాంతములు మన మెఱుగనివికాదు.

తం॥ తలపగ - పెద్దతండ్రి పినతండ్రి కుమారులెకాదె? ధార్త రా
ష్ట్రులు మరి పాండురాట్సుతులు! లోకమెఱుంగను యోధనుండు సౌ
బలు డెనకొత్తినట్టి కితవంపు దురోదరమందు ధర్మజుం
గెలిచి వనాంతరంబులకు గెంటెడె? మున్నిల రాజ్యలోభుడై.

నలగా :- ఎంత దూరము పోతివి మహామంత్రీ! పరస్పరేర్ష్యా స్వభావు లగు కౌరవ పాండవులతో మమ్ము పోల్చుట సరిగాదు. తల్లులు వేరైనా తండ్రి యొక్కడే మాకు. ఏదో కించిత్కారణముగ వేఱుపడితిమిగాని, ఒక్కచోటనుండవలసినవారము. పోనీ మీ కిష్టము లేకుండిన కోడిపందెములు మానుకొందుము.

బ్రహ్మ :- నలగామరాజా! ఆ హృదయనైర్మల్య ముండవలయునేకాని, కావలసినదేమున్నది? మీ కంతటి ఔత్సుక్యమున్నప్పుడు మేము కాదననేల? బరిమీదికి కోళ్లను దింపుడు.

నాయ :- పట్టువిడుపుగలవారు బ్రహ్మన్నగారు. మొదట కాదన్నను చివరకు సరేయందురు. నాకు నచ్చినారు సుమా!

బ్రహ్మ :- నాగాంబ! వద్దీ మెచ్చుకోలులు. పందెములు వినోదమునకు మాత్రమేనని సంయమనము వహించుట ఉభయులకు శ్రేయస్కరము. పైనుండువారి యెసకొల్పు మాటలతో పసచెఱచుకోరాదు. ఇక కోళ్లను వదల నియమింతము. గోపన్నా! మన కోడిని వదలు.

నాయ :- చింతపల్లిరెడ్డి! నీవు మన కోడిని వదలుము. ఊరక వినోదమునకే గదాయని ఉదాసీనత కూడదు. అనపేక్ష్యతోడి ప్రదర్శనము ప్రేక్షకుల కాశాభంగముగనుండును.

(తెరలో కోళ్ల కొక్కొరోకో ధ్వనులు)

(అందఱుచూపులు సారించి ఆ వైపునకు చూచుట నభినయింతురు)

నాయ :- ఆహా! కోడిపుంజులెట్లు పోరాడుచున్నవి! ఒండొండు పెనగుచు ఒకదానికొకటి పట్టీక చుట్టి చుట్టి తిరుగుచు, వీలుచిక్కినప్పుడు నోట సిగపట్టి రెండుకాళ్లతో ఎగసి ఆరెఱు బోరలు గీఱుకొన తాడించుచున్నవి. తిర్యగ్జంతువులకే యింత పౌరుషమున్న వీర పూరుషుల కెంతుండవలయును! (పరికించి) అరరే? బ్రహ్మన్నకోడి మా కోడిని త్రిప్పికొట్టుచున్నదే! ఊపిరి త్రిప్పుకోనీదు మా కోడిని.

బ్రహ్మ :- (నవ్వుచు) మా కోడి గెలిచినది.

(తెరలో) గురిజాల కోళ్లకు రోసాలులేవు
గురిజాల వీరులకు మీసాలులేవు
మాచెర్ల కోళ్లకే రోసాలు మిన్న
మా చెర్ల వీరులకే మీసాలు కన్న.

బ్రహ్మ :- (చకితుడై) ఎవరది? పైనుండువారియెక్కింపుమాటలివి. ఈ మాటలు చాలింపుడు ప్రేక్షకులారా? చూచి వినోదింపుడు కాని, పొగడ్తలు తెగడికలువద్దు ఇవే కక్షలు రేకెత్తించును. కత్తులు దూయించును.

నాయ :- వారి మాటలకేమిలెండి బ్రహ్మన్నగారూ! ఇంత మాత్రమునకే మేమది పట్టించుకొందుమనియా? మీ ఊహ, ప్రేక్షకులెప్పుడిట్లనే యుందురు అది వారి ఉత్సాహము, ఊటకలువేయు వారి ఉత్సాహపు వెల్లువలకు - కట్టలు వేయలేము. ఏ పక్షమువారి కోడి గెలిచిన ఆ పక్షమువారు కేరింతలాడుదురు. కేకలు పెట్టుదురు. ఈ సారి వేఱొక జోడును పందెమునకు వదలింతము.

బ్రహ్మ !- అట్లనే గోపన్నా! మన కోడిని మార్చు.

(తెరలో) అట్లనే, మన కాకిడేగను వదులుదును.

నాయ :- చింతపల్లి! నీవు మన నెమిలిని వదలు.

(తెరలో) అట్లనే ఈ సారి మన నెమలే కొట్టాలి

(తెరలో) కొక్కొరుకో ధ్వనులు.

మలిదే ;- (చూచుట నభినయించును) కోళ్లను విడిచినారు. ఆహా అద్భుత ప్రదర్శనము! ఈసారి యేది గెలుచునో ఊహింపలేము. ఒకదానిని మించి ఒకటి ఒండొండు ఢీకొనుచున్నవి. వాడిగల ఆరె పోడిమి చూపించుచున్నవి. నెత్తురు కాఱుచున్నను మెత్తబడక యునుమడించిన యీసుతో రోసము చూపుచు చూపఱుల మీనములు దువ్వించుచున్నవి. అరరే! నాగమ్మ కోడ యెగిచి యెగిచి తన్నుచున్నదే!

నరసిం :- బ్రహ్మన్న కోడి పస బైటపడినది.

మలి !- ఈసారిచూడు మా కోడి మసలుకొని మఱపించి తన్నును.

నరసిం :- ఇంకేమి తన్నుట, దొంగయై ఱెక్కలలోనికి తలదూర్చుచున్నది.

మలి :- అదిగోచూడు తిన్నగా వీలుచూచుకొని మీ కోడిని గూబబట్టి రెండు కాళ్లతో ఱొమ్ములపై తాడించినది.

నరసిం :- ఇప్పుడుచూడు, దెబ్బతిన్న మా కోడి యిబ్బడి ముబ్బడి రోసముతో మీ కోడిని ఈడిగిల ఒడునట్లు తన్నినది.

(తెరలో కలకలము)

మాచెర్లకోళ్లకు రోసాలులేవు

మాచెర్ల వీరులకు మీసాలులేవు

గురిజాల కోళ్లకే రోసాలు మిన్న

గురిజాల వీరులకె మీసాలుకన్న.

బ్రహ్మ :- (చకితుడై) ఈ బోటు మాటలు చివరికి చేటుతేగలవు.

నాయ :- బ్రహ్మన్నగారూ! కోడిపందెమెట్లున్నది?

బ్రహ్మ :- బాగుగనేయున్నది ఒకసారి మా కోడిగెల్చిన, ఒకసారి మీ కోడి గెల్చినది మీకు గెలుపు లిప్పటికి సమానమేగదా!

నాయ :- (చప్పరించును)

బ్రహ్మ :- ఏమిట్లు చప్పరించితివి నాగాంబా!

నాయ :- కోడిపందెము చప్పగానున్నది గనుక చిత్త కోళ్లను పోరించుట నా కేమంత అభిరుచిగాలేదు.

ఉ॥ జీతములేనికొల్వు - రససింధువులం దొరలింపజాలని
గీతములేనిపాట కమనీయత యుండునె కైతలున్నగాని
వ్రాతములేని హారమును - పన్నిదమేమియులేని ఎక్కటి
ద్యూతము రక్తిహీనమయి యుక్తిగ మే లొనగూర్చు బుద్ధికిన్

బ్రహ్మ :- పందెమేలొడ్డుకోవలయుననియా?

నరసిం :- ఏదో పందెము కొంత ఒడ్డుకొనుటయే బాగుండును

నాయ :- రాజ్యము లొడ్డుకోవలసివచ్చెననియా?

మలి :- రాజ్యములొడ్డుకొనుటకు వెనుదీయుదుమనియా! ఈ యెత్తిపొడుపు నాగాంబా! మేమందరము క్షాత్రము చచ్చినవారము కాము సుమా!

బ్రహ్మ :- మలిదేవా! తొందరపడుచున్నావు.

నలగా :- రాజ్యాలొడ్డుకొనుటెందుకులే మలిదేవా?

నరసిం :- ఏమన్నయ్యా! నీకుగూడ రాజ్యము పోవునేమోయని భయముగా నున్నట్లున్నది పోనీ, ఎగతాళికి రాజ్యాలొడ్డుకొందుము

నాయ :- ఎగతాళికి రాజ్యాలొడ్డుకొనుటేమి నరసింగరాయా! నీ నిర్ణయము మరింత బాగున్నది. నిజముగనే ఒడ్డుకొందము రాజ్యాలు. జయాపజయములు దైవాధీనముగదా! మేమే గెల్చెదమనిగాని, వారే గెల్చెదరనిగాని యెవరు చెప్పగలరు? విజయలక్ష్మి యెవరినైనను వరించును ఏమందురు బ్రహ్మనాయుడుగారూ! మలిదేవులకు రాజ్యము కావలయునని యున్నట్లున్నది.

బ్రహ్మ :- నాగాంబా! సంక్రాంతి సరదాలకై కొనిన ప్రాణిద్యూతము రాజ్యాలొడ్డుకొనువరకు రప్పించుచుంటివా?

నాయ :- భయపడకుడు బ్రహ్మనాయుడుగారూ! రాజ్యము మీరే గెల్చుకొందురేమో?

బ్రహ్మ - రాజ్యాలు గెలుచుకొనవలయునని మాకులేదు నాగాంబ! మేమంత రాజ్యలోభులముకాదు

నాయ :- మరి రాజ్యలోభులము మేమేనన్నమాట,

మలి :- ఎందుకువచ్చినదో యీ కోడిపందెము? కానీ మహామంత్రీ!

నాయ - మలిదేవరాయా! మీ మహామంత్రిగారింత పిరికిమందు త్రాగు చున్నారేమి?

మలి :- నాగాంబా! మాటలు జారుచున్నావు. మహామంత్రులను ఎల్లిదము లాడుటకు నీవంటి నాగమ్మలకు వేయి జన్మలెత్తినను యోగ్యత యుండదు. రాజ్యమువన్నిదమిడుటకు మేముమెనదీయుము మేము మాచెర్లను

బ్రహ్మ :- మలిదేవా! తొందరపడుచున్నావు.

మలి :- తొందరలేదు గిందలేదు. ఊబుసుపోకని పెట్టకొన్న కోళ్లపందె ములు పట్టుదలలకు దిగినవి. మనమేమి పౌరుషహీనులమా!

బ్రహ్మ :- పౌరుషాలమరేపుమన్నవి చివరికి కోడిపందెములు.

నాయ :- మాచెర్లను కాయుటకొప్పుకొనినట్లేనా? బ్రహ్మన్నా!

బ్రహ్మ :- (మాటాడడు)

మలి :- మమ్మాటికి ఒప్పుకొనినట్లే నాగాంబా!

నరసిం :- మేము మా గురిజాల రాజ్యమును కాయుచున్నాము.

నాయ :- నీవుండుము నరసింగరాయా! నీదేమున్నది? ఆ మాట మీ అన్న గారనవలయును. ఏమందువు మహారాజా!

నలగా :- ఏమందును? మందుడనై ఏమియు ననలేకున్నాను.

నాయ :- (నవ్వి) రాజ్యము పోవునని భయము మా మహారాజుగారికి గూడ. మష్టరాజ్యము పోతేపోనీ మహారాజా! ఈ జంగొలు రాజ్య ముండి యెవరినుద్ధరించునని? వారే సంపూర్ణరాజ్యాధి కారులు కానీ మహారాజా!

నలగా:- (అంగీకారమభినయించి) సరే మేము మా గురుజాల నొడ్డు చున్నాము.

నాయ:- ఏమండి బ్రహ్మనాయుడుగారు! తెగినవా? మీ మనసులోని నళ్లు.

బ్రహ్మ :-

ఉ॥ నీయెసకొల్పు మాటలు ధ్వనించుచున్నవి భావమర్మముల్
నాయకురాల! రాజ్యము పణంబిడు దాకను దెచ్చినావు నీ
వీయది కోరి చేయునటులే కనుపించుచు నున్నదైన వె
న్దియము చూత మీ తెలుగుదేశ చరిత్రి యిదెట్లు మారునో?

నాయకు :- పోనీ బ్రహ్మన్నగారు! రాజ్యాలు పోయినా, మతము పోయినా చరిత్రియేగదా నిలచునది ఉభయరాజులు రాజ్యము లొడ్డినారు. తరువాత పేచీపడుట కంటె కట్టుదిట్టముగా వ్యవహరించుకొనుట మంచిది.

బ్రహ్మ:- ఏమిటి నీ ఉద్దేశము నాగాంబ!

నాయ:- ఏమీలేదు. ఎవరినైన మధ్యవర్తులనెన్నుకొనుట మంచిది.

బ్రహ్మ:- మధ్యవర్తులుకావలయునా? ఎవరి నెన్నుకొనవలెనని?

నాయ:- ఉభయులకు కావలసిన వాడలరాజు. ఆయన మధ్యవర్తిగా నుండుటకు మీకేమైనా అభ్యంతరమా?

బ్రహ్మ - మాకేమభ్యంతరము లేదు

నాయ:- మహారాజా! మీ అల్లుడుగారిని పిలిపింతురా?

నలగా :- అదుగో అలరాజు! రావయ్యా! యిటు రాచమల్లూ!

అలరా :- (ప్రవేశము)

నాయ :- రాచమల్లు! ఈ కోడిపందెపు వ్యవహారములో నీవు మధ్యవర్తిగా వ్యవహరింపవలయును.

అలరా :- పందెమునకు కోళ్ళను విడుచుచుంటిరిగదా! మధ్యలో నా మధ్యవర్తిత్వ మెందుకు?

నాయ :- ఉభయులు రాజ్యాలొడ్డికొనినా రలరాజా!

అలరా :- (చకితుడై) రాజ్యాలొడ్డుకొనుదాక వచ్చినదా?

నరసిం :- పందెములేనిదే కోడిపందెమేమి బాగుండును? చప్పగా.

అలరా :- సరదాగా సాగిపోనీక పట్టుదలలు పెంచుకొనినారా?

శా॥ ఏలా మీకిటు? అన్నదమ్ములుగదా! యీ లీలరోసాలతో
మీలోమీరలు లేనిపోని తెగువల్ మీరంగ మేలేది రా
జ్యాలం బందెములొడ్డుకొందురె పరక్ష్మాపాలకుల్ నవ్వరే?
త్రైలింగక్షితి కింతకన్నను అనర్థంబున్నదే చూడగన్.

నాయ :- (నవ్వి) అలరాజుగారూ! ఇప్పుడు కావలసినది మీ నీతి పాఠము గాదు. మధ్యవర్తిత్వము.

అలరా :- మధ్యవర్తిత్వపదవి పెద్దలెందఱోయుండ నాకేల పెట్టెదరు?

బ్రహ్మ .- రాచమల్లూ! ఉభయులకు గావలసిన నీకన్న మధ్యవర్తులెవరు మరి?

అలరా :- సరే చెప్పుడు కోడిపందెములో మీ పందెపు నియమములు.

నాయ :- నీవే చెప్పుము రాచమల్లూ!

అలరా :- అయితే ఒకటి చేయుడు. కోడిపందెమున ఎవ్వరోడినను శాశ్వతముగ రాజ్యము గోల్పోనక్కఱలేదు ఏవో కొన్నేండ్ల ప్రవాసము.

బ్రహ్మ :- ఆ యేండ్లెన్నో నీ నోటిమీదుగనే చెప్పు మలరాజా!

అలరా :- ఉభయులిష్టపడిన ఏడేండ్లు చాలు.

నలగా :- మా కిష్టమే.

మలి :- మాకుగూడ యిష్టమే.

అలరా :- పత్రము వ్రాయుదును. ఉభయ రాజులు సంతకింపుడు.

(వ్రాయుట నభినయించి, వ్రాయుట పూర్తియైనట్లునటించును)

పత్రము పూర్తయైనది చదువుచున్నాను.

శ్రీమన్మహాజరాపూజితులు శ్రీశ్రీ అలుగురాజులుంగారి కుమారులు నలగామరాజు, మలిదేవరాజులు కుక్కుట ద్యూతసందర్భమున వ్రాసుకొన్న పత్రము.

శ్రీ నలగామరాజులుంగారు గురిజాల రాజ్యమును, శ్రీ మలిదేవరాజులుంగారు మాచెర్ల రాజ్యముపు పన్నిదములొడ్డుకొని, ఎవరోడినను వారి రాజ్యమును సర్వాధికారములతో నొసంగి ఏడేండ్లు వలసపోవలయును. సప్త వత్సర ప్రవాసానంతరము తిరిగి సర్వాధికారములతో వారి రాజ్యము వారికీయవలయును.

ఉభయరాజులు సంతకములు చేయుడు (అట్లు చేయించును)

బ్రహ్మ :- అలరాజా! మధ్యవర్తిగా నీవు సంతకము చేయుము.

అలరా :- (సంతకించి) వ్రాతలు పూర్తియైనవి సభ్యులారా! మీరును వినుట మంచిది.

ఉ॥ ఓడినవారు పందెముగనొడ్డినరాజ్యము వీడనాడి యే
డేడులుగా ప్రవాసమున కేగవలెన్ – పెకసి కలందు – ఏ
డేడుల యాప్రవాసమది యెల్లగతింపగ రాజ్యమీవలెన్
పొడితొలంగ రాదెవరు పందెపునేమము రేర్పరించిరన్.

(అందరు కంతాళధ్వనులు)

బ్రహ్మ :- గోపన్నా! మన చిట్టిమల్లుని విడువుము

(తెరలో) చిట్టిమల్లంటే పేరు చిట్టి పెగ్గెలో మాగట్టి కూయరా చిట్టి మల్లూ! (కొక్కొరొకో కూత)

నాయ :- చింతపల్లిరెడ్డి! నీవు మన నల్లమల్లుని విడువుము.

(తెరలో) నల్లమల్లుగాడంటే సిసలైనవల్లమల్లు కూయరా! నల్లమల్లు

(కొక్కొరొకోకూత ఒకదాని తరువాత ఒకటి కూయును)

అలరా :- ప్రేక్షకులారా! తోసికొనకుడు కిక్కిరిసెదరేల? సద్దుమాని అందరు నొద్దుకొని కూర్చుండుడు. విడువుడిక బరిమీదకి పుంజులను!

బ్రహ్మ :- మలిదేవా! చిట్టిమల్లుని ప్రతాపము చూచుచుండుము

మలి :- మన చిట్టిమల్లుడు బిరుదము సార్థకము చేసికొని రియను

నాయ :- మహారాజా! రాజ్యములొడ్డుకొన్న పందెమిది. ఈశ్వరేచ్ఛ యెటు లుండునో? నేనిటుండి చూచెద (వెళ్లును)

నలగా :- జయాపజయములుదైవాధీనములు. నేనిటుండిచూచెద (వెళ్లును)

అలరా :- పోరాటమారంభమైనది. చిట్టిమల్లు నల్లమల్లుల పోరాటము మల్లుల పోరాటమే నిజముగ నేనా ఉన్నత వేదికపైనుండి చూచెద (వెళ్లును)

బ్రహ్మ :- మలిదేవా! చిట్టిమల్లుంజూచితివా? పౌరుసందర్భమును మందర గిరివలె బరియెల్ల పరిభ్రమించుచున్నది.

సీ॥ ఒడిచి ప్రతిద్వంద్వి నూపిరాడగ నీక
    జిక్కించి తన్నెడు నొక్క మాటు
పొడిచి ప్రతిస్పర్థి పొడవాటునట్టుల
    క్రిక్కించు నెత్తురు లొక్కమాటు
ఎగిచి శత్రువుకోడి యీడిగిలబడంగ
    అక్కున – తాటించు నొక్కమాటు

మలి :- అయ్యయ్యో! చిట్టిమల్లు పడిపోయినాడు!

బ్రహ్మ :- (దిగ్భ్రమముతో) చిట్టిమల్లూ! ఎంతపని చేసితివి?

(తెరలోనుండి తోసికొనుచు బాలచంద్రుడు ప్రవేశించుచున్నాడు)

బాలచం :- మోసము! మోసము! మాయ! మంత్రము! నాగమ్మ తంత్రము! నాగమ్మ కోడిని మార్చినది. మొదటికోడి కాదిది. దాని బొమ్మన యేదో యెత్తుగానున్నది. మీరెవ్వరు గమనించలేదా మహారాజా! నాన్నగారుగూడ చూడలేదా? ఆ మధ్యవర్తి అలరాజెక్కడ? కోడిని పరిశీలింపుడిప్పుడైన

(అందరు లోనికిబోయి కొంచెము సేపటికి తిరిగివత్తురు. బ్రహ్మనాయుడు, మలిదేవరాజు వివర్ణవదనములతో గానిపింతురు. నలగామాదులు ఉల్లాసముగ గానిపింతురు. అలరాజు ప్రవేశించును బాలచంద్రుడు ప్రవేశించును)

నాయ :- అంతాభ్రాంతి! బాలనాయకునికి కన్నులు తిరిగినట్లున్నది. మధ్యవర్తులు మీరు చెప్పుడలరాజుగారు! ఇందు నాగమ్మ తంత్రమేమున్నదని?

అలరా :- (తలత్రిప్పుచు) బాలనాయుని ఆరోపణము నిరూపణము కాలేదు. మాచెర్లవారి కోడి ఓడినట్లే.

నాయ :- ఏమందురు బ్రహ్మనాయుడుగారు! ఓటమినొప్పుకొంటిరా?

బ్రహ్మ :- ఒప్పుకొంటిమి నాగాంబా!

నర :- నలగామరాజుగారికిజై! మహామంత్రిణి నాగమ్మగారికిజై!

(నేపథ్యమున జయ జయధ్వనులు)

నర :- మాచెర్ల మాదైనది.

నలగా :- మహామంత్రిగారు సప్తవత్సరంబ్రవాసమును సరింపవలయును.

బ్రహ్మ :- సరే.

నర :- మా భటులు వచ్చుదాక మాచెర్లలో మీరుండరాదు

(బ్రహ్మనాయుడు, మలిదేవరాజు ఈవలకు నడుచుచుందురు)

అలరా :- (బ్రహ్మనాయుల ననుసరించి వచ్చుచుండును)

బ్రహ్మ :- నీవుండుము రాచమల్లా!

అలరా :- సంక్రాంతి కోడిపందెము లెంతకుదెచ్చినవి?

(బ్రహ్మనాయుడు, మలిదేవరాజు నిష్క్రమింతురు)

నలగా :- (ఇటునుండి) అలరాజా! నీవు మా యింటనే నిలిచిపో

అలరా :- (తలత్రిప్పుచు) రాజ్యభ్రష్టులమైన మేమింతకాలముగ మలిదేవుల నాశ్రయించుకొని మాచెర్లలో నుంటిమి. మలిదేవులు మామయ్య మమ్మెంతో ఆదరించినాడు. ఇప్పుడాయన మాచెర్ల రాజ్యము పోయినది వలస పోదురిక. వారిననుసరించుట మా విధి

నాయ :- ఇదేమన్యాయము రాచమల్లూ! కొత్తల్లుడవు. కొత్తకాపురపు తీపులతో పేరిందేవినలరింపక, వారితో వలస పోయెదననుచున్నా వేమి.

అలరా :- అది సరిగాదు నాగమ్మగారూ! మా తండ్రి గ్రాసవాసోద్దైన్యము లతో మలిదేవుల ననుసరించి ప్రవాసమందుండ, నాకు శ్వశురగృహ వాసమా? లోకులేమనుకొందురు! నా పునరాగమనము ప్రవాసానంత రమే

నలగా :- అల్లుడా!

సీ॥ అలపులెఱుంగక వలపు వందిళ్లలో
పసిడిముగ్గుల నార బఱచువేళ
తలపుల మెఱుగు టద్దాల మేడలలోన
ఒకరి రూపొకరు చూచుకొను వేళ
కోరికలు సరులుగుచ్చి యొకళ్లొక
ళ్లమెడల వైచి కొంచాడువేళ
ఎలజవ్వనంపుటూయేల జంపాలలో -
కొత్తపాటలు పాడుకొనెడువేళ
నీ వలసమాటవిని గుండెనీరుకాగ
డీలుపడిపోదె మా రతనాలదేవి
వచ్చి యొకమాటచెప్పి వెన్నాడుల విడి
పోవుటలకు ఊఱటపుచ్చి పోవరాదె?

అలరా :- సరే. మీ కోరినమేరకు పేరిందేవి నూఱట పుచ్చియే పోయెద. (వెళ్లును)

నలగా :- (డీలుపడినట్లగపడును)

నాయ :- మహారాజా! ఏమట్లు డీలుపడెదరు? అల్లుడు పోవుచున్నాడనియా!

నలగా :- మనుగుడుపులతో మా యింటిలోనుండిపోక తీయని కాలమడపుల పొలుచేసికొనబోవుచున్నాడల్లుడు!

నర :- అన్నీ చూండి అల్లుడునోట శనిలాగున్నది.

నాయ :- పోనీ మహారాజా! పోవువానిని మనము పట్టుకొందమా?

నలగా :- (భావము మార్చుకొని) నూతన రాజ్యలక్ష్మీ సమాశ్లేషవిశేషము కూర్చితివి నాగాంబా! ధన్యవాదములు!

నాయ :- ఇందు నూతనమేమున్నది మహారాజా! మాచెర్ల నీదికాదా? పొరపాటున పోగొట్టుకొన్నదానిని కోడిపందెములో తిరిగి లాగి కొంటిమి.

నరసిం :- మలిదేవులనిక మాచెర్ల కడుగుపెట్టనీయము!

నలగా :- విజయోత్సవమునకు గొప్పగా ఏర్పాట్లు జరుపవలసియున్నది పోదమిక.

నాయ :- విజయోత్సవముతో పాటు విజయప్రదాతయగు గురజాల మల్లి కార్జున స్వామికి పూజాదికములు జరుపవలసియున్నది మహారాజా! ఆ స్వామి కృపవల్లనే మనకీ విజయము

నలగా :- అట్లనే నాగాంబా! మల్లికార్జునస్వామికి గొప్పగా ఆరాధనలు జరిపింతము.

నాయ :- (నిమీలిత నేత్రియై చేతులు శిరమునకెత్తి) హరహర మహాదేవ!

చం॥ కదలదు నీనియోగమెడగా - తృణమేనియు - చీమయైన గు
ట్టదు భవదాజ్ఞలేకిల, నిటాల విలోచనా! నీకు నల్కయే
యొదవిననాడు లోకమసలుండదు నిప్పున ఖూదియౌను - నీ
వె దయనుచిల్క మోడయిన బెట్టు నిగుళ్లు పరాత్పరా! శివా!

(తెరపడును)



## మలిదేవుల ప్రవాసము

ప్రవేశము :- ప్రవాస సన్నాహములతో, బ్రహ్మనాయుడు మలిదేవరాజు, కన్నమనీడు, కొమ్మరాజు ప్రభృతులు.

(నేపధ్యమున)

గీ॥ ముగిసినవి కోడిపందెముల్, మోసము లవి
దేవుడెఱుగు, రాజ్యము మలిదేవు లోడి
పోయిరిటు, ధర్మము మూగపోయినయది
ఏమి మిగిలిననింక- ఏడేండ్ల వఱకు

గండు :- ఎంతపని జరిగినది! కోడిపందెములెంతచేసినవి!

మలి :- నాగమ్మ కుయుక్తులకు, కుట్రలకు, తంత్రములకు, మంత్రములకు, ఎత్తులకు జిత్తులకు, గురిజాలస్థానబలముగా వారికెంతో కలిసివచ్చినది.

బ్రహ్మ :- రాజ్యము పోవుటయేగాదు, రక్తపాతము సైతము జరిగినది. పడవాలు గోవన్న పోయినాడుగదా! నాగమ్మ వానిం జంపించినది.

కొమ్మ :- ఎట్టి దుస్సంఘటన! శకుని మాయ పాచికలు ధర్మజునట్లు, నాగమ్మ మాయకోడి మనలను రాజ్యవిహీనులను జేసినది.

బాల :- నాగమ్మ కోడికి తొమ్మునకు ఉక్కుతీగెల కవచము కట్టినది. లేకున్న మనకోడి దెబ్బతినెడిదికాదు.

మలి :- నిజమే కానోపు! ఆ కోడిరంగు యీకల నతికి యుండును. కను గొనుటకు వీలుకాలేదు.

కన్నమ :- కనుగొని, పరిశీలింపబోవునప్పటికి దానిం దీసివేసినది.

కొమ్మ :- ఆచూకి దొరకలేదు

బ్రహ్మ :- నాగమ్మ కౌటిల్యముదుర్భేద్యము! అది ఆమెకు వెన్నతో బెట్టిన విద్య పోనీండది. గతజలసేతు బంధనము! మన ప్రవాసమునేడే. నలగామునిభటులువచ్చుదాకేందుకు?

మలి :- మనమిప్పుడెక్కడికి బోదము మహామంత్రీ!

బ్రహ్మ :- (కన్నీళ్లు తుడుచుకొనుచు) మలిదేవా!

సీ॥ పట్టుపాన్పులమీద - పవళించు వాడవు
కటికినేలలనెట్లు గడపగలవు?
ఇష్టమృష్టాన్నంబు లిచ్ఛించువాడవు
కాయకసరులెట్లుగడపగలవు?

ప్రాసాదములలోన వసియించువాడవు
అడవిగుట్టలనెట్లు గడపగలవు?
పరగుసింగపుగద్దె భాసించువాడవు
కటికిజాళ నెటుల గడపగలవు?
రాజ్యమేదగ ఒకముని రాజువోలె-
కానకోనలలో తిరుగంగ వలసె
అపరధర్మజుడీవైతి అక్కటకట!
కోడివందెము లెంతటి గొడవదెచ్చె?

గండు !- బ్రహ్మనాయుడుబావా! మేరుధీరుడవే నీవే యిట్లు బెంబేలుపడు చున్నావేమి?

బ్రహ్మ !- గండువాడా! కన్నమనీడా!

గీ॥ అలుగురాయడు మరణశయ్యాతలమున
మండి, నను బిల్చి, కన్నులనుండి నీళ్లు
జాలువాఱ' వీరలనెట్లు సాకెదొ గద
బ్రహ్మనా' యనె - అడియెంచ - వగులుగుండె:

కొమ్మ:- కుడిచి కూర్చుండక కొఱవితోతలగోకికొన్నట్లు పరమ వంచకియగు నాగమ్మ పన్నిన కోడివందెమునకియ్యకొని యింతచేసికొంటిమి. ఇప్పుడు వగచి యేమి ప్రయోజనము బ్రహ్మనా!

బ్రహ్మ :- గీ॥ అలుగురాయని సంతాన మందొకండు
రాజ్యములనేల - ఒక్కడు రాజ్యమూడి
అడవులంబట్టగా మంత్రినౌచు వారి
నింతకొలిచిన నా కది యెట్టులుండు?

గండు :- అన్నదమ్ముల బిడ్డలు కౌరవులు రాజ్యములేల పాండవు లడవుల పాలైనారు.

బ్రహ్మ !- ఈ వ్యత్యాసమునకు కురువృద్ధులైన భీష్మాదులకు కష్టముగా నుండలేదా?

కొమ్మ !- ఉండి యేమిచేయగలిగినారు?

గండు !- ఏమియుం జేయలేదు. ఎవరి ప్రాప్తమునకు వారే కర్తలైనారు.

బ్రహ్మ :- జ్ఞాతులలో ఒకరి బాగొకరు చూడలేరుకాబోలు! దుర్యోధనుడు పాండవుల నాశనమున కెంత చేసినాడు!

సీ॥ పినతండ్రి కొడుకులన్ నెనరొకింతయులేక
వారణావతమును జేరబంచి,
ఓర్వజాలనిబుద్ధి ఒకరూపు తాల్చి న
ట్లక్కడ లక్కయిల్లొక్కడుంచి,
తల్లికుంతిగలసి తనయులు ధర్మరా
జాదులనేవుర నందు నుంచి,
నిద్రపోయెడు వేళ నిసిరేయి లాక్షా గృ
హంబు దాహంబున కగ్గిపెట్టి,
పాండవులు చచ్చినారని వారికొఱకు
పిండములు పెట్టువాడటె మొండికట్టె
చీకురాజు పెద్దకొడుకు సీ! పరోన్న
తా సహిష్ణుడు వాడెంత యీసుగలడు?

మలి :- ఈ భారతాన్వయము మనకును సమన్వయించుచునే యున్నది మహామంత్రీ! ధార్తరాష్ట్రాగ్రజుని చెంత శకునివలె, నలగామునిచెంత నాగమ్మ చేరినది నలగామరాజొక తేనెపూసినకత్తి! మేక వన్నె బెబ్బులి! పయోముఖ విషకుంభము! పైకి యేమి యెఱుగ నట్లుండును. వాని కడుపులో విషభాండములున్నవి. కొడుకులు లేకపోయినా ఎంత రాజ్యలోభి?

ఉ॥ పాయని లోభవిస్తృతిని - పట్టకదిక్కులు - పాడువంచనన్
మాయలు మంత్రముల్ నెఱపి మాకెడసేయగ రాజ్యలక్ష్మి నా
నాయకురాలి కుట్రవినునా? నలగాముడు దాయసంపదల్
తీయముగాభుజింప-ప్రియతించున? అన్నలు తమ్ములెవ్వరో?

గండు .- ఇదే మలరాజు వచ్చుచున్నాడు?

అలరా :- (ప్రవేశము)

మలి :- ఏ మలరాజా! ఇంతలోనేవచ్చితివి? మాచెర్లనుండి మమ్ము వెంటనే వెళ్లిపొండని నీతో చెప్పిపంపినాడా? మీ మామ.

అలరా :- అదేమికాదు నేనును మీతో ప్రవాసమనుభవింప వచ్చితిని.

బ్రహ్మ :- సప్తవత్సరపరివాసము ముగియుదనుక నీవక్కడే శ్వశుర గృహమున నుండకపోతివా అలరాజా! నలగామరాజులకలుడవయ్యు మమ్మనుసరించుటేమి?

అలరా :- శ్వశుర గృహవాసమా? బ్రహ్మన్న మామయ్యా! అన్నీ తెలిసి నీవే యిట్లనుచుంటివా? రాజ్యమిచ్చెద మన్నను నేనక్కడుండను. కష్టమో? సుఖమో? మీతోడిదే నాకు. మీరు పరివాస క్లేశమనుభవించు చుండ నెనత్తవారింట భార్యతో కలుకుటయా? ఎంత వారింటి అల్లుడనైనా కేవలము నన్ను వారివాడనుగానే మీరు భావింపవద్దు.

మలి :- అలరాజా! సుఖములు కోరుకొనవలసినది పోయి మాతోబాటు కష్టములు కోరుకొనుచుంటివేమి? నీవైన సుఖపడు రాచమల్లూ!

అలరా :- మలిదేవ మామయ్య!

సీ॥ రాజ్యముల్లేక మీరలు వలసలుపోవ
నే నత్తవారింట నిలుచుటేమి?
కానకంతల మీరు కష్టముల్ పడుచుండ
శ్వశురు నింటను నాకు సౌఖ్యమేమి?
లిబ్బులెకెడసి మీరిబ్బంది పడుచుండ
మృష్టాన్నములు నేను మెసవుటేమి?
మనగడకై మీరు మన్నెభూముల త్రొక్క
మనె గుడుపుల నేను మసలుటేమి?
రాజ్యమరుల వశంబుగా భ్రష్టులమయి
యుండితిమి యింతదాక మీయుండజేరి
పాలుపంచి మీ కష్టసుఖాలలోన
అనుభవించుట విధిగదవయ్య మాకు!

కొమ్మ :- మలిదేవబావా! శ్వశురగృహమున మనుగుడుపులననుభవించక భార్యావ్యామోహమునబడక, ఏడేండ్లవలస మనతోగడపుటయే కుమారునిధి. పలనాటిచరిత్రలో త్యాగకీర్తులు మాకును కొంతదక్కినవి అలరాజు విజ్ఞతకు సంతోషించుచున్నాను.

బ్రహ్మ :- సరేకానిండు మనమిక పరివాస సన్నాహములనుండుదము.

మలి :- ఇప్పుడెక్కడికి పోవలయునో నిశ్చయించితివా మహామంత్రీ!

బ్రహ్మ :- నిశ్చయించియే యుంటిని మలిదేవా! వానకారు వచ్చువరకు మండాది అడవుల్లో గడుపుదము. అక్కడ మన పశుగణమునకు పసిగల పసిరిక సమృద్ధిగా నున్నదని వింటిని.

మలి :- సరే అక్కడికే పోదము

(అందరు నిష్క్రమింతురు)

(నేపథ్యమున)

గీ॥ కోడివందెములని యింత కూటమిపన్ని
లాగె మలిదేవురాజ్యంబు నాగసాని
వలన పిమ్మట మరియేమి పన్నుకొన గ
గలదొ॰ స్త్రీబుద్ధి ప్రళయాంతకంబు గాదె!

(ప్రవేశము బ్రహ్మనాయుడు మొదలగువారు)

బ్రహ్మ :- కన్నమదాసూ! మన ఎలుగణంబులు తరలించుకొని ముందు నీవు తిన్నగా సాగిపద.

కన్న :- (నమ్రుడై శిరోవందనమాచరించి నిష్క్రమించును)

బ్రహ్మ - సేనాపతీ! కన్నమనీడుబావా! స్త్రీ బాల వృద్ధజనములు బండ్లపై సాగి పోవుచున్నారుగద! వారిననుసరించుకొని నీవుపద.

గండు :- అట్లనే (నిష్క్రమించును)

బ్రహ్మ :- (కంట నీరిడి) మలిదేవా! ఏ సిడులనులేక సిరాలదేవితో నీకడవుల బడక తప్పదయ్యెనే!

మలి :- మహామంత్రీ! కాలగతి తప్పించుకొనలేముగదా!

సీ॥ సర్వరాజ్యముపోయి సతితోడ సుతుతోడ
మునుహరిశ్చంద్రుడు వనికరుగడె?
భూరి రాజ్యశ్రీని - పుష్కరునకు నోడి
నలమహారాజరణ్యాలబడడె?
పట్టభంగమునొంది పదునాలుగేడులు
శ్రీరాముడడవి వసింపలేదె?
మాయ జూదాన గోల్పోయి రాజ్యంబును
ధర్మరాజడవికి - తరలలేదె॰
దొరతనముపోయి బ్రతుకు పొద్దులనుపుచ్చ
మనమిపుడు పోవుచున్నాము మన్నెములకు
కాలవాహిని కెదురీదగా వశంబె
నరులకేగాదు దేవకిన్నరులకైన!

(తెరలో కలకలము)

బ్రహ్మ :- (వినుటనభినయించి) ఏమది?
మలి :- పౌరజనము మహామంత్రీ!
1 పౌరుడు :- మారాజులు మీరు పోవద్దండండి! మీరు పోవద్దండండి! మీరు
లేని మాచెర్ల మాకు - చెరసాల.
2 పౌరుడు :- మీరుపోతే చెన్నయ్యగుడికి పూజలే ఉండవు.
3 పౌరు!- హరిజనుల్ని అంటరానివోళ్లని వూరెలుపలికిగెంటేత్తుంది నాగమ్మ
బ్రహ్మ :- దానికి మనమేమి చేయుదుము. అనుకొన్న తీరున మేమేడేండ్ల
వలస గడిపి రావలయునుగదా!
పౌరులు :- ఏడేళ్లు ఏడుయుగాలు మాకు.
బ్రహ్మ :- ఏడునెలలుగా గడిపివత్తుము. అందాక మీ రోపిక పట్టకతప్పదు-
మీరిక తిరిగిపొండు
పౌరు :- (దుఃఖింతురు)
మలి !- దుఃఖింపకుడు పౌరులారా! మమ్ము శంపుకొన్నట్లు.
పౌరు :- (పోలేక పోలేక పోదురు)
బ్రహ్మ !- (పురమువైపు తిరిగి)

సీ॥ మమ్ముల గన్నయ్య! మా పాలి చెన్నయ్య!
పోయివత్తుము సెలవీయవయ్య!
మాచెర్ల పురలక్ష్మి! మరల వచ్చెదమమ్మ!
మఱచిపోవకెతల్లి! మమ్ము నీవు
చందవంకా! యింతసరిపోయెనో యేమొ
నేటితో మాకు నీ నీటి ఋణము
పురజనులార! మిమ్ముల వీడి దవులకు -
చనుచుంటిమి మమ్ము సైపుడయ్య!
అందటికి వందనములు? మే మరిగెదమిక
దొరతనములేది యెటకో సుదూరములకు
ఎటులగడచునో? మాకు ఏడేండ్ల వలస -
ఏమికానున్నదో? మరి యీశ్వరేచ్ఛ!

(పొర్లివచ్చు దుఃఖమును మిగ్రింగుకొనుచు, తిరిగిచూచుచు పోలేక
పోలేక పోదురు)

(తెరపడును)

# పలనాటి వీరభారతము

## అలరాజు రాయబారము

### అలరాజు స్వగతము

**అలరా** :- (ప్రవేశము) ఔరా! రాజ్యలోభ మెంతచెడ్డది! అన్నదమ్ములనీ ఆత్మబంధువులనీ లేదుదీనిముందు ద్వాపరాంత్యమున కౌరవ పాండవుల కీ మహాలోభ కారణముననే విషజ్వాలా సదృశముగ జ్ఞాతివిద్వేషము ప్రబలి, ఘోరరక్తపాతము జరిగినది. ఇప్పుడీయుగమున పల నాటి రాజకుటుంబమున అది పొడసూపినది. నాగమ్మ దీనికిమూలము

సీ॥ ఆరని రాజ్యదాహముతోడ - కుక్కుట
ద్యూతమందునరాజ్య మోడిచివైచి,
తీరని యాసున దూర సీమల ఆఱు
నొక్కేండ్లు వలసలు త్రొక్కజేసి,
పరమవంచకతను పశుగణంబు హరింప
చెంచుమూకను నియమించి పంచి,
మందపోటు జరిపి మండాదివలసలో
నిసిరేయి లంకన్న నేలగూల్చి,
ఏడకేగిన వీడక నీడవోలె
పొంచియుండి వెనక వెన్నుపోటు పొడిచె
లోభమదమత్సరాలు రాశీభవించి
పూవు తాల్చిన నాగమ్మ కోపమేమొ?

బ్రహ్మనాయుడు సప్తవత్సర ప్రవాసమిందే గడపవలయు నని శ్రీశైలమహారాజు నొద్ద తన పచ్చలపిడిబాకు కుదువబెట్టి యీ మేడపిని గుత్తకుతీసికొనినాడు. నేడిది వీరమేడిపిగా రూపుతాల్చినది. వలస గడిచి పోయినది. ఆనాటి కోడిపందెపు వ్యవహారమున నేను మధ్యవర్తిని. ప్రాణిద్యూతమున నలగామ మలిదేవరాజులు రాజ్యములొడ్డుకొని, ఓడినవారేడేండ్లు రాజ్యమువీడి ప్రవాసము నిర్వర్తించిన తిరిగి రాజ్యముపొందవచ్చునని వ్రాతలు కోతలు సైతము జరుపుకొనినారు. ఆ కోడిపందెములో మలిదేవరాజోడి మూచెర్లవీడి

ఏడేండ్లువలస గడపినాడు. కానినలగామరాజు వీరికి రాజ్యమప్ప గించునట్లులేదు. కాలము జరుగుచున్నది. సహనశీలియైన శీలము బ్రహ్మనాయుడింకను చూచెదమనుచున్నాడు. ఈయన చూచుటయే గాని నాకుజూడ వారు రాజ్యమీయరనియే తోచుచున్నది.

బాలచ :- (తెరలోనుండి) ఓరోరి! వాచాలా! అసంబద్ధప్రలాపకా! యెవడ వురా నీవు?

చం॥ ఎవడవురా నరాధమ! యీయరురాజ్యమటంచు వాగుచుం
టివి? మును కోడిపందియపు నేమము లేమగు? వ్యర్థమైనచో
బవరముపుట్టి నెత్తురుల వాగులుపారవె నాగులేటిలో
దివిజులు పిచ్చలింపగ నదీయకృపాణము తాంసిల్లదే?
(కత్తిదూసికొని ప్రవేశించుచున్నాడు)

అలరా :- ఓహో! బాలనాయుడా! శాంతింపుము శాంతింపుము కత్తిదూ యుటకు పగవారిక్కడెవ్వరునులేరు కత్తి ఒఱలో వేయుము.

బాలచ :- అలరాజా నీవిక్కడనే యుంటివా? రాజ్యమీయరన్న ఆ వాచా లుడేడీ? వానికుత్తుక ఉత్తరింపనిదే కత్తి ఒరలోకిపోదు.

అలరా :- అట్లయిన ఉత్తరించు నా కుత్తుక.

బాలచ :- (అదేమో అర్థముకానట్లుచూచుచు)

అలరా :- రాజ్యమీయరని వాగిన వాచాలుడను నేనేనయ్యా! నీ దూసిన కత్తితో నాతలతీసివేయుము. ఊ ఊరకుంటివేల? సరికాని, యీ ఖడ్గధారణమెప్పటినుండి?

బాలచ :- ఏమట్లనుచున్నావు? ఎంతైన వెలమ బిడ్డడను సుమా! నన్ను పౌరుషహీనునిగా మాట్లాడకు!

అలరా :- నీవుపౌరుషహీనుడవు కారాదు బాలచంద్రా! నీ పౌరుషము ఆంధ్ర జాతి కాదర్శనము కావలయును.

బాలచ :- అడుగమఱచితిని. మన వలసగడువింకెన్నాళ్ళు?

అలరా :- అదికూడ తెలియదా?

బాలచ :- ఇంకెన్నాళ్లోచెప్పు – మనవలసగడువు.

అలరా :- వలసగడువు ఏనాడో తీరినది.

బాలచ :- అట్లయిన మాచెర్లప్రయాణమెప్పుడు?

అలరా :- మాచెర్ల, చేజారిపోయిన రాజ్యము.

బాలచ :- అట్లనుచున్నావేమలరాజా! కోడిపందెములనాడు నీవు మధ్యవర్తివిగదా?

అలరా :- నా మధ్యవర్తిత్వమేమిచేసికొనను! నాగమ్మ రాజనీతి మహాకుటిలము గదా!

బాలచ :- నాగమ్మరాజనీతి మహాకుటిలము! మాయలమారి నాగమ్మ తన కోడికి, అదేపెట్టకోడి యీకల తోడి ఉక్కుకవచము బొమ్మునకు గట్టించినది మన కోడి అరె, ఆ కోడిబొమ్ము చీరలేకపోయినది. పోరి పోరి మన కోడి యీడిగలబడిపోయినది. మోసముకనిపెట్టి నేనలిచితిని, ఓయిపరిశీలించునప్పటికే కవచము తీసివేసినది. గుట్టుగుట్టుగనే పోయినది రాజ్యముపోయినది!

అలరా :- పోయినరాజ్యము తిరిగివచ్చుట తేలికగాదు,

బాలచ :- మీ మామ మాట తప్పునందువా అలరాజా!

అలరా :- రాజ్యలోభులకు మాటతో నేమిపని?

బాలచ :- రక్తపాతము తప్పదన్న మాట!

అలరా :- రక్తపాతము!

బాలచ :- ఏమట్లు డీలపడెదవు?

అలరా :- అదికోరరానిది బాలచంద్రా! అయినవారు! అన్నదమ్ములు!

బాలచ :- అట్లని పౌరుషముచంపుకొని పనికిరాని వారమై పాడువలసలతో ఇందే పడియుండవలయునా?

అలరా :- పడియుండరాదు. కాని, కొంత ఓర్పు నేర్పు లవసరము.

బాలచ :- నాయినగారి తత్త్వమే నీదిగూడ. ఆయన శాంతిపారమే యింత చేయుచున్నది.

అలరా :- మీ నాయనగారితత్వము చాలగంభీరము! నాయకురాలితో పడలేక అఖండ పలనాటిరాజ్యము రెండు చీలికలు చేసినాడు. కాని, అది ఆయన కావలయునని చేసినదికాదు. పలనాటి అభివృద్ధి ఆయనచేతిమీదుగజరిగినది ఉభయరాజ్యాలశ్రేయస్సు ఆయున దృక్పథము.

బాలచ :- ఇంతపాత్రిజలాటకు ప్రయోజనము ప్రవాసమా?

అలరా :- ప్రవాసానంతరము నేడత్యవసర సమావేశము. నాకు గూడ పిలుపువచ్చినది కొంచెమాలస్యముగ వత్తునని చెప్పిపంపితిని. నీవు రావా?

బాలచ :- నేను రాగూడదు. విషయముతెలుపుటకు నీవున్నావుగద!
అలరా :- మరి యిటెక్కడికి నీ పోక?
బాలచ :- అది నీవడుగ రాదలరాజా!
అలరా :- ఇంక నీవు మారేదెప్పుడు బాలచంద్రా!
బాలచ :- మారెదను మారెదను, నామూలాన మారణహోమము తప్పదు పల్నాటికి.

ఉ॥ అలపునేల పెండ్లి అరుగై తెగు హారంపము త్తె ముల్ తలం
బ్రాలయి వైరి వీరభట రక్తపుధార వసంత మాడు బై
ద్రాలెడు మాంసభుక్తులు బందుగులై రణభేరి మోగ్రియుగా
ఓలిగ శౌర్యధైర్యములనొడ్డి జయేంద్ర పెండ్లియాడనే?

అలరా :- విజయీభవ!

(తెరపడును)

## వీర మేడపి

(నాయకుల సమాలోచనము)

(ప్రవేశము :- మలిదేవరాజు, బ్రహ్మనాయుడు)

బ్రహ్మ :- మలిదేవరాజా! మందపోటుతో మండాది వీడి ఈ మేడపిలోనే మన యేడేండ్లవలస చెన్నయ్య కృపవల్ల గడిపివేయగలిగితిమి గడువుచెల్లి ఆరు నెలలు కావచ్చుచున్నవి. అదేమి కారణమో నల గామరాజు మాచెర్లకు మనలను రమ్మని కబురంపలేదు.

మలి :- మహామంత్రీ! కోడిపందెములో గెల్చుకున్న మాచెర్ల రాజ్యము శాశ్వతభుక్తముగా జేసికొనదలచినట్లున్నాడు. వ్రాసుకొన్న నియమా ఉల్లఘించునట్లున్నాడు. నలగామరాజు!

బ్రహ్మ - నియమోల్లంఘనము నీతిహీనుల లక్షణము మలిదేవా!

మలి :- అట్లయినప్పుడు మనమేమిచేయవలయునో కర్తవ్యమాలోచించి తిరా!

బ్రహ్మ :- ఆలోచించుటకేగదా! ఈ అత్యవసర సమావేశము. కన్నమనీడు నకు కొమ్మరాజునకు కబురంపితిని.

మలి :- అదుగో! అనుకొనుచుండగనే కన్నమనీడు వచ్చుచున్నాడు.

బ్రహ్మ :- ఇదుగో! కొమ్మరాజున్నువచ్చుచున్నాడు.

(చెరొకవైపునుండి కన్నమనీడు, కొమ్మరాజు (ప్రవేశము)

మలి :- కూర్చుండుము సేనాపతీ! ఇటురా కొమ్మరాజు బావా! అలరాజు గూడవచ్చిన బాగుండును .

బ్రహ్మ:- నాయనగారుందురు గదా! కొంచెమాలస్యముగ వత్తునని చెప్పినాడు.

మలి :- అవులను తోలుకొనిపోయినాడుకాబోలు! కన్నమదాసు.

బ్రహ్మ:- అవుల మాటవచ్చినప్పుడెల్ల మనలంకన్న జ్ఞాపకమువచ్చుచున్నాడు

మలి :- చెంచుమూకను గట్టుకొని నిసిరాత్రివేళ లంకన్నను జొడిపించినది నాగసాని!

బ్రహ్మ :- మనలనింతచేయుచున్న నాగసాని నలగాములనుమాత్రమెంత చేయకుండునని అనుమానము! "ససర్పేచగృహేవాసో మృత్యురేవ నసంశయ" అన్నట్లు పాముపేరిటి ఆమెమూలమున పలనాటికేదో మూడుననియే తోచుచున్నది. పలనాటి పతనము తప్పదేమో అనిపించుచున్నది.

చం॥ అలుగుధరావిభుండు తన అంతిమఘట్టపు శయ్యనుండి, నన్
బిలిచియు - చెంతకుంగడిపి, పేద యెలుంగన- పల్కరించి పి
న్నలు నలగామముఖ్యులను నాయుడ! ఏ మొనరింతొ అంచుమం-
పలపల కంటనీరిడిన వాడది నేనెటు విస్మరింతునో?

తండ్రి మరణించునాటికి నలగామురాజెంత? ఇంతవానినంతచేసి, విద్దెలదిద్ది, గద్దెనెక్కించితిని.

మలి :- ఇంతచేసిన గురుజనులనే ధిక్కరించినాడు.

గండు :- ఏరుదాటి తెప్పను కాల్చుట!

కొమ్మ :- నలగాములకిప్పుడు నాగమ్మ వాక్కే వేదవాక్కు.

బ్రహ్మ -- పాలుపోసిపెంచినను పామునకు వేమునకు చేదు పోదుమరి!

ఉ॥ ఎన్ని యొనర్చితిన్? శ్రమలనెన్ని సహించితి? పల్లెనాటి నిన్
తిన్నని స్వర్గఖండముగ తిద్దుటకై కలలెన్ని గంటి? నే
నిన్ని యొనర్చనం దెలియ డింతయు, నాయకురాలిమాటనే
కన్నులనద్దికొల్చు నలగామునికన్న కృతఘ్నుడెవ్వడో!

మలి :- మహనీయుల మనోవ్యథ వృథకాదేమో? అదిపోనిండు మహామంత్రి! కడుపుచించుకొన్న కాళ్లముందు పడుచున్నది, ప్రస్తుతాంశమునకు రండు!

బ్రహ్మ :- అట్లనేమలిదేవా! సభ్యులనెచ్చరించి విషయమునివేదింపుము.

మలి :- సభ్యులారా!

ఉ॥ నాడటు మాయజూదియగు నాయకురాలు మొగించినట్టి యా
కోడి రణాన రాజ్యమును గోల్పడి నారను పంచెమొడ్డి, యే
డేడులుగా - ప్రవాసమది యీదితి సింబుధి యీదినట్లు ప
ల్నాడున కేమియూడు నొకొ నాడనుకొన్నట్లు లీడు రాజ్యము న్
అన్నయైనందులకు నలగాముల ధర్మతత్త్వమిట్లున్నది.

కొమ్మ :- అన్నట్లు గడువేనాడో తీరిపోయినను నలగామరాజు మాచెర్ల సీయడేమి?

గండు :- నలగాములదేమున్నది? అంతా నాగమ్మది.

బ్రహ్మ :- నాగాంబ పలనాటి రాజకీయమంటించుకొనుటలో ఏదో అర్థము కాని స్వార్థమున్నది.

మలి :- అర్థముకాని దేమున్నది? మానని మత ద్వేషముతో మనపై మంటలు గ్రక్కుచున్నది.

బ్రహ్మ :- ఎందుకీ మతద్వేషము? ఇదే విషజ్వాలయై జాతిని నిశ్శేషము కావించునే? వాంఛింపదగినదిజాత్యభ్యుదయముకాని, జాతినాశనమా?

మలి :- వైష్ణవముపై ఆమెకెందుకో యింత అక్కసు?

గండు :- స్వమత విస్తారమునకు.

మలి :- పరమత ఖండనము స్వమతమండనము మతోన్మాదుల లక్షణము కాబోలు!

గండు :- అవర్ణుల ఐక్యతా సంఘటనకు సవర్ణుల ప్రతిఘటన!

కొమ్మ :- నాయుడుగారి చాపకూటి సిద్ధాంతాలకు నాగమ్మ రాద్ధాంతాలు!

బ్రహ్మ :- అధునాతన భావవిప్లవమునకు సనాతనుల మహోపప్లవము!

మలి :- మన రాజనీతి అకుటిలము, ఆమెది కుటిలము.

గండు :- శత్రునాశనమునకు కుటిలనీతి వీరునిచేతి హేతికన్న అకుంఠిత మైనది.

బ్రహ్మ :- నిజమే ఇందు శత్రువులెవరని మనమది పాటింతుము. తల్లులు వేఱుగాని, తండ్రియొక్కడేగదా! అవిభక్తముగా నుండదగిన అన్నదమ్ములలో జ్ఞాతి విద్వేషమంతంతకు ప్రబలుచున్నది.

శా॥ జ్ఞాతి ద్వేషమిదెంతచెడ్డది? విషజ్వాలాభమై కుక్కుట
ద్యూత ంబందున రాజ్యమూడ్చి వలనల్ త్రొక్కించి రింకెన్నియో
గోష్ఠుల్ అబ్రివ్వరి మందపోదాక మహాఘోరంబు! లోభాత్మకుల్
నీతిందప్పిన జాతికిన్ ముసలమై నేడేమి కానున్నదో?

కొమ్మ :- ఈ జ్ఞాతి కలహము నానాటికి పెరుగుచున్నది గాని, తరుగుట లేదు

గండు :- ఎట్లు తరుగును నిప్పు రగులుకొన్న దాని పని అది చేసుకొని పోవును

బ్రహ్మ :- అన్నదమ్ముల అంతఃకలహాలకే నిండు పలనాటిని రెండు చేయ వలసి వచ్చినది. ఏ రాజ్యాభివృద్ధినిగోరి నిద్రలో సైతము కలవ రించితినో! దేనికోసము మనసా వాచా కర్మణా నా సర్వశక్తులూ, సర్వయుక్తులూ ధారపోసితినో? ఆ పలనాటి రాజ్యాన్ని రెండు చేసి తిని ఇది నా కిష్టముండి చేసితినా?

మలి :- బ్రహ్మన్నగారి ఆశయము అఖిలాంధ్ర జాతికాదర్శము. ఆ మహా శయములో విశ్వ మానవ సౌభ్రాత్రత, విశ్వమానవ కల్యాణము గర్భితము. పూజ్య బ్రహ్మనాయాగ్రణీ! నీ లోకోత్తర గంభీరతా ప్రసన్నతా మధురతా నవతా భావమునకు నమోవాకములు!

బ్రహ్మ :- నవసమాజ నిర్మాణమగు నా నవతను నట్టేట ద్రొక్కుచున్నారు. నా చేత, ఏటికెదురీతైనది. నా విజ్ఞత విఱిగిపోయినది. కోడిపుంజుల రోసాలతో మీసాలు పెటికి కొన్నట్లయినది. పౌరుషాలకుదిగి రాజ్యా లొడ్డు కొనుచుండగా వారింపలేకపోతిని. మంత్రిగా నా బుద్ధి పని చేయలేదప్పుడు. కుక్కుట ద్యూతము కితవ ద్యూతముగా అనుమా నించుచునే కాదనసైతిని. ఇందఱు గ్రాసవాసోదైన్యములకులోనుగా జేసితిని. ఇందఱిని వలస బట్టించితిని, నా అవజ్ఞతకు నన్ను నే నిందించుకొనుచున్నాను.

మలి :- (చేతులు పట్టుకొని) ఈ దోరణి మాను బ్రహ్మన్నా! రాజ్యలక్ష్మీ వియోగమయిన యీ అవయోగము దైవనియోగమేకాని వేఱుకాదు. ఏదెప్పుడనుభవనీయమో అదప్పుడు జరిగిపోవును.

"అవశ్యమనుభోక్తవ్యమ్"

గండు :- ఎటుల పుట్టినదో? తల్లిదండ్రులెవరో, తెలియరాని నాగమ్మ నేడు నాయకురాలైనది. ఎక్కడి చిట్టిగామాలపాడు? ఎక్కడి పలనాడు?

చౌదరి రామిరెడ్డి పెంపుడు కూతురు, తానొక మహామంత్రిణియై పల నాట ఇన్ని సమస్యలకు మూలమైనది.

కొమ్మ :- నాగమ్మ నలగాముల పట్టింట నాగుబాము!

గండు :- దుర్యోధనుని చెంత శకుని, నలగామునిచెంత నాగమ్మ ఒకటి.

బ్రహ్మ :- పాండవ రాజ్యలక్ష్మిని శకుని మాయాద్యూతమున కరగతము చేసికొన్న దుర్యోధనుడెంతో నలగామ రాజంతై కూర్చున్నాడు.

మలి :- నిజమే. ఐదుగురన్నదమ్ములము, ఐదుగురికై దూళ్ళిచ్చిన జాలు నని ధర్మరాజడిగింప వాడిసూదిమొన యించుక మోపినంత నేలను గూడ యీయను పొమ్మన్నాడు దుర్యోధనుడు.

గండు :- ఈ నలగామరాజుగూడ మనకు, మాచెర్ల కాదుగద! మాలవల్లె గూడ ఇచ్చునట్లులేదు.

మలి :- అట్లయినప్పుడు, మహా భారతయుద్ధముగా పలనాటియుద్ధ మని వార్య మగునేమో?

బ్రహ్మ :- యుద్ధము! తెలిసి తెలిసి దేశమును యుద్ధోపద్రిమునముంచుట!

ఉ॥ నారును పోసి పెంచి మరినాటి పొలంబున నాడు నాడు మన్
సారపు దోహద క్రియల సంఘటి యింపుచు జాగ రూకతన్
పైరును పెంచుకొన్నటుల వారక పెంచిన దేశమక్కటా!
మారణహోమ ధూమమునా మాడ్చుటకున్ మనసెట్టులొప్పునో?

కొమ్మ :- నిజమే. ఆవేశముతో ఏదో యొనర్తుముకాని, యుద్ధము వలన గలుగు కష్టనష్టములను దలంచుకొన్న గుండె జలదరించును. యుద్ధము దేశోపద్రవములకెల్ల మూలము.

చం॥ రణమును కోరగా దగదు. రక్తనదుల్ ప్రవహించు-ప్రాణముల్
పణములగున్ జయేందిరకు- రాణువ తోడను వీరు లెల్ల మా
రణమును పొంది తీరుదురు-రాజ్యమునందు-అశాంతి దుర్నివా
రణమగు - కారణంబగును ద్రవ్యపు కోశము వట్టిపోవగన్.

గండు :- తొందరపడి యుద్ధమునకు దిగరాదు.

గీ॥ రణమహోపద్రవమ్ము దుర్వారమైన
దేశమున కంతకంటెను క్లేశమున్నె
వీరులు నశింతుర్ జాతి నిర్వీర్యమగును
ప్రగతి వెనుకాడు శాంతిభద్రతలు వీడు.

మలి :- మరివారు రాజ్యమీయక - మనము రణము చేయక - మనము మన ప్రజలు వలసలతోనే కాలము గడుపవలయునా? వీరజాతి కిదేమి యుక్తము?

బ్రహ్మ :- యుక్తము కాదు నిజమే. చరిత్రలు ఇతిహాసాలు చెప్పుచున్నవి. దీనికి భారత యుద్ధ మొక తార్కాణము. సూది మోపినంత నేల నీయనన్న దుర్యోధనుడు చచ్చి సాదించినదిలేదు సోదరం శత సహితముగ ఆ యేకాదశాక్షౌహిణీనాథుడు భీముని గదా ఘాతమున తొడలు విటిగి నేల కొఱిగినాడు. పాపము! విజయము సాధించిన ధర్మరాజు బ్రతికి బావుకొన్నది లేదు. బంధుజనులను సుహృజ్జనులను చంపుకొంటినేయని పరితపించినాడు.

కొమ్మ :- చారిత్రిక దృష్టాంతము లిట్లున్నవి.

చం॥ వగతురు కారు వారిల - అపాయములేని ఉపాయమూని చే
యగనగు - తొందఱించిన - అనర్థకమే మరి, సామమొక్కటే
తగు - తొలి సేయుకర్జముగ - తామసముల్గొనికత్తి వేటకుం
దిగు నటులైన హానియగు నెత్తుటికూడుగదా! రణం బిలన్.

బ్రహ్మ :- అది గాక, మన గండు కన్నమనీడు బావ చెప్పినట్లు యుద్ధము సంభవించిన దేశములో వీరులందఱూ వీరశయన మొందుదురు. దేశము తరతరాలుగ నిర్వీర్యమై పడియుండు ప్రమాదమునకు గురియగును. వీరులు ధీరులు శూరులు లేని దేశము బానిస దేశమగును బానిస దేశములోని ప్రజలు మనో వాక్స్వతంత్ర్యములు కోలుపోయి బ్రతుకులు బరువుగా ఈడ్చివేసుకొను వారగుదురు.

కొమ్మ :- బ్రహ్మన్నగారి దృక్పథము విశాలము, విశ్వజనీనము, వీరి గంభీరతా ముద్ర సామాన్యులకగోచరము. విశేషించి చెప్పవలయు నన్న వీరి వంటి వారు వీరే. వెయ్యేండ్లకైనను మన కిటువంటి వారు దొరుకు టరుదు. వీరిదృష్టిలో మలిదేవు లొకటి నలగాములొకటి కాదు మాచెర్ల గురిజాలలు రెండునూ రెండు కన్నులు వీరికి. ఇంతెవరు శతృవులు? శతృవులైన ఈ పాటికే ఈయన కంతము, సామంత రాగోల విజృంభించి విలయ నాట్యము చేసి యుండెడిది. ఎన్నో తలలూడి, కబంధాలాడి వాగులేఱు నెత్తుటే అయ్యేడిది.

మలి :- యుద్ధము వాంఛనీయము కాని మాట నిజమే. ఈ దేశమునకు యుద్ధ యోగమే యున్న అదెవ్వరు తప్పింపలేరు.

ఉ॥ చెప్పెడివారు లేక యిల చెడ్డది యెవ్వరు లేరు - చెప్పినన్
చప్పున ఆలకింపకయ సర్వవిధంబుల నాశమైన వా
రెప్పుడు గూడ ఇంతెయగు - ఈ నలగాముడు నీతి తప్పినన్
తప్పదు వీరజాతి పతనంబది తప్పదు తప్పదెమ్మొయిన్

బ్రహ్మ :- ఏది యెట్లయిన సామోపాయము మనకవశ్యకరణీయము. నలగామరాజు కడకు రాజ్యమడిగించుటకు రాయబారము పంపుదుము.

మలి :- మరి, రాయబారి యెవరు?

బ్రహ్మ :- ఇంకెవరు, రాచమల్లు బిరుదాంకితుడు మన అలరాజు.

కొమ్మ :- (అదరపడి) ఆఁ అలరాజా!

బ్రహ్మ :- ఏమట్ల దరిపడితివి కొమ్మనా! రాయబారము నడుపుటకు అలరాజుకంటె సమర్థుడెవరు?

మలి :- ఉభయులకు గావలసినవాడలరాజు.

బ్రహ్మ :- అంతేగాదు కోడిపందెములనాడు మధ్యవర్తి అలరాజు.

కొమ్మ :- ఉ॥ నాయుడ! యేమిచెప్పుదును నాకకటా! యిటు రాయబారిగా
మా యలరాజు బంపుటన మానసమూరక జంకునొందెడున్
మాయలు మంత్రిముల్లగది నాయకురాలట - ఏమిచేయునో
ఆయమ రాజ్యతంత్రమె మహా కుటిలంబుగదయ్య బ్రహ్మనా!

బ్రహ్మ :- కొమ్మనా! నీ మాటలు క్షత్రియోతరములుగానున్నవి. నీకు జంకెందులకు? అలరాజు ఆ రాజునకల్లుడుగదా!

కొమ్మ :- ఎంత ఆ రాజునకల్లుడైనను సర్పనామదేయ నాగమ్మ అక్కడున్నది. ఆమెకు మా వారసయెందు దీసెక్కువ. నలగామరాజు తరువాత నరసింగరాజును సింహాసన మెక్కింపవలయునని మక్కువ.

బ్రహ్మ :- కొమ్మనా! లేనిపోని అనుమానములు నీవి. అనవసరముగా కీడును శంకించుచున్నావు. నీవే యిట్లనిన రాయబార మింకెవరొనర్తురు? రాజకార్యము లెవరు తీర్తురు!

మలి :- అలరాజు నేటి సమావేశమునకు కొంచెమాలస్యముగ వత్తునని చెప్పిపంపెనే, మసలుటకేమి కారణము!

గండు :- నూతేండ్లాయువు! అనుకొనుచుండగనే అలరాజు వచ్చుచున్నాడు.

మలి :- రా అలరాజా! నీ కొఱకే చూచుచున్నాము కూర్చుండుము

అల :- (ప్రవేశము) పెద్దలకు నమస్కారములు (కూర్చుండి) అందఱి చూపులు నాపై ప్రాలుచున్నవి. విశేషమేదో యుండును.

బ్రహ్మ :- మరేమియులేదు గురిజాలకు నీవు రాయబారము పోవలయును.

అల :- గురిజాలకు రాయబారము నేను పోవలయునా? పెద్దలిండఱుండ నేనేల మహామంత్రీ!

బ్రహ్మ :- ఎందఱున్ననేమి? మామయ్యతో నీ రాయబారము సుకరము కాగలదని ఆశ.

గీ॥ కోడిపుంజుల రోసాల తోడనె గద
రేగి రోసాలు మీసాలు త్రిప్పినారు
పల్లెనాటి వారను నింద పడగనీక
రాయబారము ఉద్ధుమా రణము లేల?

అలరా :- ఇది మీ ఆజ్ఞగా శిరోధార్యము. కాని, రాయ బారమెంత వరకు సుకరము గావించుకొని వత్తునో ఊహింప లేకున్నాను

బ్రహ్మ :- సందేహింపకు అలరాజా! నీవు వారింటి అల్లుడవు రత్నాల పేరిందేవి నలగామునకు ఏకైక పుత్రిక. విశేషించి, ఆ జనకు ఆమెయే సర్వస్వము. నీవామెకు భర్తవగుట ఆయన హృదయ ములో నీకు స్థానమున్నది. నీమాట కాదనడు. నీముఖము చూచి యైనను కాదు కూడ దనుట కొప్పుకొనడు. అనాటి కుక్కుట ద్యూత మున మధ్యవర్తివి కావున ఎంతైన మాటాడుటకు నీ కవకాశ మున్నది.

అలరా :- సరే పోయిన పని నెరవేరిన అల్లునిమర్యాద దక్కును. లేకున్న.

మలిదే :- శతవిధాల చూడుము! మామయ్యతో ఏకాంతముగా జెప్పుము! భార్యచేతను అత్తచేతను చెప్పింపుము.

అలరా .- ఎందఱుచెప్పిన నాగమ్మ చెప్పినదానికి తిరుగడని నా నమ్మకము కానీ, నా శాయశక్తుల ప్రయత్నించెద. రాయబారము కుదిరిన బాగుగనే యుండును. ఒకవేళ కుదరనప్పుడు నేనేమి చేయవల యునో? ఏమి చెప్పవలయునో? పెద్దలు సెలవీయగోరెద.

బ్రహ్మ :-(గంభీరముగ)అలరాజా! నీ రాయబారమే వ్యర్థమైనచో యుద్ధము తప్పదు. బ్రహ్మనాయుడు కుటిల భూప్రకుటి విక్షేపమున యుద్ధము

క్షేత్రమున విహరించుచు కాలావిలంబుగ సామంతరాగోల విసరు నప్పుడు మీరెవ్వరు నిల్వలేరనుము.

మ॥ రణభూ భాగము హోమకుండముగ - ఉగ్రక్రోధ తామ్రాక్ష వీ
క్షణ మాలాజ్వల లాహుతాగ్ని కణముల్గా - ఆజ్యధారా వ్రసా
రణముల్ వీరగళోద్గత క్షతజధారా పూరముల్గాగ-మా
రణ యాగం బొనరించుహో తగనుసై బ్రహ్మన్నయంచాడుమా!

అలరా :- మలిదేవ మామయ్యా! మరి నీ సందేశ మేమైనయున్నదా?

మలిదే :- అలరాజా! నలగామ రాజెంతైనమాకన్న. ఆయనకు నా వినయ పూర్వక విజ్ఞప్తులుగా —

సీ॥ కోడిపందెములోన - ఓడిపోయిన మేము
అనుకొన్నరీతి రాజ్యంబువీడి,
మండాది మొదలైన మన్నెములందున
మా పరిజనులతో మణగియుండి,
గడువుపెట్టినయట్లు కడగండ్లు పడుచును
ఏడేండ్లవలన యదెల్లగడపి,
గడువు తీరినగాని కలహాలు వలదని
నీ మాట కోసము నిలిచియుండి,
రాయబారము లీలీల - చేయబంపె
తమ్ముడని చూచు టది లెస్స -దానికీవు
కాదు కూడదటన్న సంగంము కలుగు
ఇంపయిన చిత్తమున -చిత్తగింపుమనుము.

బ్రహ్మ:- అలరాజా! రేపే గురజాలకు నీ పయనము.

అలరా:- అట్లనే. రాయ బారము సఫలము గాక తిరిగిరాను.

కొమ్మ:- (ఉలికిపడి తనలో) "రాయబారము సఫలము గాక తిరిగిరాను" ఇందు రాయబారము సఫలముచేసికొనివత్తునని కుమారునిభావము. రాయబారము సఫలముకాదు, తిరిగి రానను భావముగూడస్ఫురించు చున్నది, ఈ సమయమున తిరిగి రానను మాట కుమారునినోట రాగూడనిది.

అలరా:- మరి తోడుగా ఎవరినైన బంపవా!

బహ్మ:- కన్నమదాసు నీతో వచ్చును.
అలరా:- సరేఇక నాకు సెలవు. అందఱికి వందనములు!

(అందఱు ఆలరాజు వంక సాభిప్రాయముగ జూతురు)

(తెరపడును)

అలరా :- (తెరముందుగా ప్రవేశము)

ఉ॥ ఈయెడ దూతకృత్యమొనరింప నియుక్తుడనైతి - నెత్తిపై
మోయగరానిదీ బరువు-ముఖ్యముగా ఉభయప్రజాళికిన్
శ్రేయదమైన కార్యమిది చేసితినేని యశంబుదక్కు నా
కీ యఖిలాంధ్రదేశమున, ఏమగునోగద! రాయబారమున్.

ఉ॥ అల్లుడవీవు - నిన్ను గనియైనను ఆ నలగామరాజు పేర్మి
మెల్లసిరాత్మ దౌచు - ఇడకుండడు రాజ్యమటంచు సంధి సం
ధిల్లక పోవదంచిటుల నెత్తిన బెట్టిరి దౌత్యభారమున్
ఇల్లరి నాగమాంబకడ నాకథ యెట్టుల రక్తిగట్టునో?

కొమ్మ :- (ప్రవేశము) కుమారా! గురిజాలకు రాయబార మేగుచుంటివి.
అక్కడ కనుకలిగి మెలగవలయునుసుమా! రాజకార్య నిర్వహణలో
నీ వాదమఱతువేమో! నాగాంబను, నరసింగుని, ఒక కంట కనిపెట్టి
యుండు. ఒకటి చెప్పుచున్నాను నీ విది మఱువవద్దు.

ఉ॥ అత్తయు కార్యతప్పు - మఱి అక్కడ తక్కినవారలెద్ది యే
నిత్తురయేని తీసికొన నింతయుగూడదు - నాగసాని బల్
జిత్తులమారి యేమయిన - చేసిన చేయగవచ్చు నిన్ను - జా
గ్రత్త సుమా! పరాకున గరాసుల-ఏమఱి యుండబోకుమా!

అలరా :- అట్లనే, నాయనగారి మాటలు నా హృదయ ఫలకమున చెఱగిపో
నీయను.

(పరిక్రమింతురు - తెరపడును)

## అలరాజు : ఆగమనము

(గురిజాల పురోపకంఠము తెరలో గుఱ్ఱపుగిట్టల ధ్వని)

**అలరా 1-** (ప్రవేశము అశ్వావతీర్ణుడై) కన్నమదాసు, అశ్వపరామర్శకు నియుక్తుడై నాడు. (ఎదుట పురమును పరికించుట అభినయించి) అహో! గురిజాల ఎంతగా మారిపోయినది!

శా॥ ఏడేండ్లప్పుడు కోడిపందెములనా డీవీటి కేతెంచితిన్
నేడేతెంచితి రాయబారపు బనిందీర్పంగ - ఏడేండ్లలో -
కూడన్ మేడలు మిద్దెలున్ - పెరిగిపోయెన్ వీథి వీధ్యంతరా
లేడంజూచిన నాకు క్రొత్తయయి యెంతో వింతగా దోచెడున్.

ఏడేండ్ల తరువాత గురిజాలలో కాలుపెట్టుచున్నాను. రాయబారము నిర్వహించ వలసినదిగా బ్రహ్మనాయుడు నన్నే నియమించినాడు. ఈ కార్యనిర్వహణము చాల కష్టమైనది, క్లిష్టమైనది నలగామరాజు నాకు కూతునిచ్చిన మామ, మలిదేవరాజు మేనత్త మగడు. ఈ యిద్దఱు మామలు మారన్నదమ్ములు. అన్నదమ్ముల వ్యవహారములో అయినవారము తలదూర్చుట తప్పే. కోడిపందెము నాటి వ్యవహారములో మధ్యవర్తినగుట నా కిది తప్పనిసరియైనది. ఒక విధముగ నా కిది కలిసివచ్చినది. ఏడేండ్ల యెడబాటు తరువాత పేరమాదేవి పునస్సమాగమము! భార్యను చూడవలయునను ఉత్కంఠతో నా మనసు పరుగెత్తినది. నా మనసు తెలిసిన నా గుఱ్ఱమును మనసుకంటె వేగముగ నన్ను గురిజాల జేరవేసినది. గురిజాలకు వచ్చిన తరువాత నా మనసెందులకో వెనుకటులాగుచున్నది.

ఉ॥ అల్లుడగాన నాదు మొగమారసియైనను మామ (ప్రేమతో
ఉల్లము వల్లవింప - ఇడకుండడు రాజ్యమటంచు సంధి సం
ధిల్లకపోవదంచును మదిం దిటవుంగొని వచ్చినాడ, ఈ
అల్లుని మాట యేమగునొ? అర్థముకానివి రాజకీయముల్.

అవే రాజప్రాసాదాలు ముందుగా కొలువుకూటమునకు బోక దేవి మందిరమునకు బోయెద. పురజనులు నన్ను గుర్తుపట్టినట్లున్నారు తొందరగా దాటిపోవుట మంచిది. (నడుచును)

(తెరపడును)

# పేరమాదేవి మందిరము

(పేరమాదేవి లోపల ఏదో చేయుచుండును)

చెలికత్తె :- (తొందరగావచ్చి) దేవీ దేవీ! పేరమాదేవీ. లోపల ఏమిచేయు చుంటివో తొందరగా ఇటు రావమ్మా!

పేరమా !- (వచ్చి) ఏమిచెలీ! ఎందుకింత ఆత్రము?

చెలిక !- ఆత్రము నాకు గాదు. ఆ సంగతి చెప్పిన, నీకు

పేరమా :- ఆ సంగతేదో చెప్పవే మరి.

చెలి !- ఊఁ ఊఁ చెప్పను.

పేరమా !-అబ్బా! చంపక చెప్పవే. (అవయవ స్పందన మభినయించి) నా అవయవాలదరుచున్నవి!

చెలి !- అవయవాలదిరితే శుభాశుభాలు తెలియజేయునందురు. ఆడవాళ్లకు కుడి శుభము, ఎడమ అశుభము.

పేరమా !- అన్నీ కుడివే అంసచూచుకనయనాదు లింకను అదరుచున్నవి చూడవే

చెలి !- అయితే శుభమే. నే - చెప్పవచ్చినదిగూడ శుభమే.

పేరమా !- అబ్బా! ఏమిటి నీ నానుడు?

చెలి !- ఆయన వచ్చుచున్నాడమ్మా!

పేరమా !- ఆయనెవరే? నీ యిల్లు బంగారముగాను చెప్పవే. ఎవరాయన?

చెలి !- మీ ఆయన!

పేరమా !- (వికసితయై) ఆఁ నిజముగానా? నీవు చూచినావా?

చెలి !- ఆయన ఊరువెలుపల గుఱ్ఱముడిగి వచ్చుచుండగా నా కన్నులతో నేనే చూచితిని.

పేరమా :- నా కలలు ఫలించినవి. (ఆత్రముతో) ఆచారము జలపోలి. పన్నీటితో కాళ్లుకడగాలి. నివాళి పట్టాలి. ఆవన్నీ సిద్ధము చేయవే. పోవే తొందరగా.

చెలి - ఊఁ పోతున్నా

పేరమా !- చెలీ! చెలీ! పోదువుగాని ముందా అద్దమిటు తేవే!

చెలి :- (అద్దము తెచ్చియిచ్చును)

పేరమ్మ :- (అద్దములో చూచుకొని) ఇదేమి నా కాటుకరేక, కుంకుమబొట్టు చెదరినట్లున్నది.

చెలి :- నీ కంటి కట్లగపడుచున్నవేమోగాని, నీ కాటుకరేక, కుంకుమబొట్టు ఏమీ చెక్కుచెదర లేదమ్మా!

పేరమ్మ :- నిజమేనే ఆనందబాష్పాలలో కన్నులు చెదరినట్లున్నవి

చెలి :- ఇప్పుడైనా ఈ కీలుముడీ, ఈ చీరె మార్చుకోరాదా అమ్మా!

పేర :- తప్పుచెలీ! భర్త ప్రవాసములో ఉన్నప్పుడు మగనాలు ఉండ వలసినదింతే. ఇక నీవుపోవే తొందరగా. అన్నీ సిద్ధముచేయవే నా పెండ్లినాడు భర్తగారు లాంచనముగ నా వ్రేలికి పెట్టిన ఆ రత్నాంగుళీయము పెట్టెలో ఉన్నది అదిగూడ తేవే.

చెలి :- (పోవుచు) మరి నీ పెండ్లికి మామగారిచ్చిన ముత్యాలహారమో?

పేర :- ఊ తేవే అది గూడ.

చెలి :- ముత్తైదువకు ముంగర ముఖ్యము. అది గూడ తేనా?

పేర :- ఓసి నీవెక్కడి దానవే! అది తేనా యిదితేనా అని అడుగుచు కూర్చుండిన ఇంతలో ఆయన దిగును. పోయి అన్నీ తేవే.

చెలి :- (పోవును)

పేర :- (కొంచెమాగి) చెలీ! చెలీ! తల వాకిట చెప్పుల చప్పుడు. ఆయన వచ్చినట్లున్నాడు రావే

చెలి :- (లోపల) వచ్చుచున్నానమ్మ! నీ నగల పెట్టె తాళము రాలేదు. పెట్టెమొత్తము మోసికొని వచ్చుచున్నానమ్మా! (అట్లువచ్చును)

పేర :- (గాబరాగ) ముందు కాళ్ళు కడగాలే.

చెలి :- (పెట్టె అవల బెట్టి పరుగునబోయి పళ్లెము, నీళ్ళచెంబు తెచ్చును)

పేర :- చెలీ! ఈ ఆనందములో నన్ను ఒళ్ళు మరవ కుండా చూడవే.

చెలి :- అట్లనేనమ్మా! (అల్లరాజు ప్రవేశము)

పేర :- (భర్తకెదురుగా బోయి, పళ్లెమూ నీళ్ళచెంబు అక్కడుంచి భర్త వంక ఆదేపనిగ జూచుచుండును, తనివి తీరని ఆచూపులతో, ముగ్ధయని ఆ చిరునవ్వులతో అట్టె నిలబడి పోవును)

అల్లరా :- ఏమి చూచుట యిది? పులుకు పులుకున జూచు నీచూపులకు నా ఒల్లు ఝల్లుఝల్లు పడునట్లున్నది. అపు దేవీ!

పేర :- (తేరుకొని) కాళ్ళుకడుగును, కడిగిన నీళ్ళు నెత్తిపై చల్లుకొనును, చెలి సిద్ధము చేసి తెగా నివ్వాళి పట్టును)

అలరా :- (ముందుకు నడువ బోవును)

పేర :- ఉండండి! చెలీ! అడుగులకు మ డు గు లు వఱవవే ఆ పఱచిన మడుగులపై మల్లెలు చల్లవే.

చెలి :- (యదోక్తముగా చేయుచుండును)

అలరా :- అబ్బా! తెమలు నట్లులేదే? అవల కావలసినంత రాజకీయము న్నది.

పేర :- చెలీ! ఆ పూసెజ్జపవరించితివా? అక్కడకాలిమెత్త ఉంచితివా?

చెలి :- ఉంచితినమ్మా!

పేర :- రాయబారము వచ్చితి రన్న మాట!

అలరా :- రాయబారమా? ఎవరు చెప్పిరి?

పేర :- మీరే అవల కావలసినంత రాజకీయమున్నదని ఇప్పుడే గద మీరన్నది. నాథా! మీరు వలసేగిన నాటినుండి దినములు, వారములు నెలలు, సంవత్సరములు లెక్కించుకొనుచున్నాను. కోళ్లపందెమునాడనుకొన్నట్లు వలస గడువేనాడో తీరిపోయినది. ఎప్పటికైన ఆనాటి మధ్యవర్తులే రాయబారముఎత్తురని నమ్మకము. గడువుతీరిననాటినుండి.

ఉ॥ ఈ గురిజాలపై పునకు ఎవ్వరు మేడపి దిక్కునుండి అ
శ్వాగతులై కనంబడిన, అచ్చము మీరనిచూతు మేడపై
భాగమునుండి రేపులుమ మాపులు, మీరలుగామికిన్ మదిన్
వేగుదు - ఈగుదుం దిటవు, వేదురుదన్ వెరపేకి పెచ్చునన్.

అలరా :- అది విప్పిచెప్పనక్కరలేదు దేవీ! ఎడబాటులనాటి ఆ చూపుల లోని అర్థాలు నే గ్రహింపనివికావు. అందాల ఆ చూపులు బందాలు కాగా నా కాళ్లు సాగనివికావు. ఆనాటి దృశ్యము అహర్నిశలు నా కన్నులలో మెదలేది.

పేరమా :- ఆ పరమార్థము అర్థమైనప్పుడు, అంతటి నిర్దయ మీకు-తగదు.

అలరా :- నిర్దయ నాదికాదు ప్రియసీ! భగవంతునిది. సిగ్గు ముసుగుల్లో దోబూచులాడే ఆ క్రొత్తవలపుల తీపులలోనే మనలను దూరముచేసి నాడు యౌవన సామ్రాజ్యలక్ష్మిని మధురభావపుష్పాలతో -పూజించెడి అదను అడవులపాలైనది. మన హృదయాల అలవాలములందు అంకురించిన ఆశాంకురా లణగారినవి.

పేరమా :- పోనీలే నాథా! భగవంతుడింకటన్నైన నిర్దయమూలి మీ దర్శనము కలిగించినాడు ఆ యేడేండ్లు ఏడు నిముసములుగా గడచినను, గడచిపోయినవి కనుక ఖేదపడవలసినది లేదిక.

అలరా:- ఆ వియోగములో నిముసాలు ఏండ్లుగా గడచిపోయేవి.

పేరమా :- ఇప్పుడీ సంయోగములో-

అలరా . ఏండ్లు నిముసాలు

పేరమా :- (సిగ్గునభినయించును)

అలరా:- సిగ్గెందుకు దేవీ! అవునవును అది ఆడవాళ్ళకొక పెట్టనిభూషణము. జీవితములో ఆ అనుభూతి మధురాతిమధురము!

పేరమా :- ఈ మధురానుభూతిలో మఱచితిని, అక్కడ మన వాళ్ళందఱు బాగున్నారా? నన్ను చిన్నప్పుడు చేతుల్లో పెంచిన మా బాబయ్యలు నన్నెత్తి ముద్దులాడిన బ్రహ్మన్న పెదనాన్న, మొన్న మొన్నటి దాక నాతో ఆడుకొన్న బాలచంద్రుడు-ఎట్లున్నారు?

అలరా :- ఉండవలసినట్లే ఉన్నారు.

పేరమా :- అందఱము ఒక్కచోట ఉండవలసినవారము ఈ రాజకుటుంబమిన్ని చీలికలై పోయినది.

అలరా :- పవిత్ర సౌభ్రాత్రతా మాధుర్య పూరితములైన అన్నదమ్ముల హృదయ క్షేత్రాలలో విషబీజాలు నాటినారు.

పేర :- బ్రహ్మనాయుడనిన గురువుగా, దేవుడుగా కొలిచినవాడు మా నాన్న. ఇప్పుడా యన మాట సరిపడదు.

అలరా :- సరిపడదు ఆయనకు నాయకురాలి మాట వెలుగు బాట.

పేర :- నాయకురాలిని నేనేనాడో అర్థము చేసికొన్నాను. ఆమెను గురించిన నా ఉద్దేశము నాన్న గారికి తెలియునది కాదు. కాని, నా మాటెక్కదు.

అలరా :- ఎక్కదుదేవీ! రాజ్య కాంక్ష చాలా చిత్రమైనది అది కన్నకొడుకునైన, అన్నదమ్ములనైన, ఆప్తమిత్రులనైన గొంతులు కోయించును. రాజ్యాల కొఱకు రాజులు కత్తులు దూసికొనుచున్నారు. కుత్తుకలు కోసి కొనుచున్నారు. విస్తృతమైన వారి రాజ్య తృష్ణలో దిక్కులు దిగంతాలు భూనభోంతరాలు చాలవు.

పేర :- ఎందు కింత రాజ్య కాంక్ష? దీని వల్ల అశాంతి తప్ప శాంతికి నిలువ నీడ యుండదే! ఎవరి రాజ్యముతో వారు తృప్తి పడగూడదా?

అలరా :- అది విశ్వశ్రేయమునకు మూలసూత్రము బ్రహ్మనాయుడు దానిని ఆచరించినాడు మీనాన్నకు ఆయన తత్త్వము బోధపడదు. తప్పటడుగు వేసినాడు. ఇప్పుడెట్లు వర్తించునో? ఆనాడు కోడి పందెములో నన్ను మధ్యవర్తిగా ఎన్నుకొని, అనుకొన్నవి, వ్రాసికొన్నవి ఎంతవరకు పాటించునో మరి.

పేర :- అనుకొన్న తీరుగా మాచెర్ల వారి కీయడా?

అలరా :- ఇచ్చిన ఉభయ తారకమే. ఈయకున్న ఉభయోన్మూలన మేయగునో? మరేమగునో దైవనిర్ణయము.

పేరమా :- అదుగో! నాన్నగారు వచ్చుచున్నారు.

నలగా :- (ప్రవేశము) అల్లుడా! రాచమల్లూ! ఎన్నాళ్ల కగపడుచున్నావయ్యా!

అలరా :- నమస్కారము మామయ్యా!

నలగా :- మేలగు! ఈ యేడేండ్లు నా కన్నులలోనే మెదలుచున్నావు. పసుపుగుడ్డలతో బ్రహ్మముళ్లువేసికొన్న మీ ఆలుమగల్లు (మ్రొక్క) వచ్చిన నాటి దృశ్యము నన్ను పులకితుని జేసివేసినది. నాకు చాల మంది అల్లుళ్లూ, చాలమంది కూతుళ్లులేరు ఒకే ఒక కూతురు. ఒకే ఒక అల్లుడు. ఈ ఒకేజంటలో నా సర్వస్వము రాశీభూతమైయున్నది. మీ ఆలుమగల్లు నా కళ్లముందిట్లే ఉండిపోవాలి.

అల :- నేనిక్కడ ఉండిపోవుటకు రాలేదు మామయ్యా! రాజకీయపు వ్యవహారముగా వచ్చితిని.

నలగా :- రాజకీయపు వ్యవహారముగావచ్చినా, మఱే వ్యవహారముగా వచ్చినా నీవు మా యింటి అల్లుడివి. ముందుగా నీ రాక తెలియలేదుగాని, తెలిసిన రాజలాంఛనాలతో ఎదురుకోలు మహోత్సవానికి ఏర్పాటులుచేసి యుండెడివాడను.

అలరా :- ఈ మర్యాదలకేమిలే మామయ్యా! నే వచ్చిన పని నెరవేరినచాలు వేయి మర్యాదలు పొందినట్లు.

నలగా :- అర్థమైనది రాచమల్లూ! కానీ, రాయబారిగా నీవు రాగూడదు.

అలరా :- ఏమిటి మామయ్యా! నీవనునది?

నలగా :- నేననునది రాయబారివిగా నీవు రాగూడదని (అటునిటుచూచి) ఇక్కడెవ్వరులేరు: నా అంతరంగిక విషయము నీ ముందు పొక్క

చున్నాను. పేరమాదేవి నా యేకైక పుత్రిక. పుత్రికయైనను పుత్రుడైనను నాకదే. నీ వామె భర్తవు. నా అనంతరము పలనాటి రాజ్యమెల్లం దే. నీ కొఱకే యీ రాజ్యవిస్తరణ. నీ కోసమే నా ప్రాకులాట.

అలరా!- నిలుపుమామయ్యా! నీదోరణి రాకరాకవచ్చిన అల్లుని జూచుటతో ఆనందావేశములో ఏదో అనివేయుచున్నావు. నాకు మాత్రము నీ తరువాత నీ పలనాటి రాజ్యము సంక్రమింపవలయునని లేదు

నరగా:- నీకు గాకుండ నా పలనాటి రాజ్యములో చేర్చుకొన్న మాచెర్ల కాదుగద మాలపల్లెయయిన మలిదేవులకీయవలయునని నాకులేదు.

అల:- మలి దేవులకు మాచెర్ల ఎందుకీయవో తేల్చుకొనెద, సభ కేర్పాటు చేయించుము.

నరగా!- అట్లనే ముందు భోజనముగానీ ఏదో నవ్వులాటకంటిని. అదిగో. ఇక్కడున్న ప్లేడుండి నీ భార్య నీ స్నాన భోజనాదుల కేర్పాటుచేసి, మన మేదో మాటాడుకొనుచుండ నిలబడి యెదురు చూచుచున్నది. మీ అత్తయును, నీ కోసము ఉత్కంఠపడుచున్నది పోదముపద.

(వెళ్లుదురు)

(తెరపడును)

## రాయబారము

(నరసింగరాజు ఒంటరిగా కూర్చుండియుండును)

నాయు :- (ప్రవేశము) యువరాజా! నరసింగరాజా! నీ వొక్కడవే ఉన్నావు?

నరసి !- దిక్కుతోచక నాగాంబా!

నాయు !- అల్లుడుగారు రాయబారులై వచ్చినారటగదా!

నర !- వచ్చినారు నాగాంబా! వచ్చినారల్లుడుగారు.

నాయ :- అదొకవిధముగా ఉన్నావు?

నర !- మామూలుగా లేనా? నాలో మార్పేమీలేదే?

నాయ :- ఉన్నదున్నది. నీ మనోభావాలలోమార్పు. ముఖదర్పణములో కొట్టవచ్చినట్లు కనపట్టుచున్నది. రాక రాక ఏడేండ్లకు వచ్చినా

డల్లుడు. ఆనందోత్సాహాలతో వెల్లివిరియవలసినవాడవు. అలరాజన్న నీకు సరిపడదా?

నర :- (పలుకడు)

నాయ :- అలరాజుపట్ల నీకీర్ష్యయా?

నర :- నాకేమీర్ష్య

నాయ :- మరి ద్వేషమా?

నర :- ద్వేషముకాదు రోషముకాదు

నాయ :- ఇదీ కాకపోతే జుగుప్సయా? కోపమా?

నర :- కాదు కాదు ఒక్కొక్కటికానేకాదు. వీటన్నిటి యేకరూపమేదో అది. అలరాజులు! రాజులలోకెల్ల నెలరాజులు! భావి పలనాటి రాజులు!

నాయ :- పైకిపొక్కుచున్నావు నరసింగరాజా!

నర :- నీముందు పొక్కకున్న నాకు తారకమేది నాయకురాలా!

నాయ :- నీ వింకను రాజనీతిశాస్త్రములో గుణింతాలలోనే ఉన్నావు.

నర :- ఏమిటి నాగాంబా నీ వనునది.

నాయ :- నీ హృద్గతభావము, పైకి ప్రస్ఫుటించుచున్నది అదిప్రమాదము. గంభీరతాముద్ర అవసరము. అల్లుని రాకకు ఆనందమభినయించు.

నర :- ఆ అభినయము కుదురుట లేదు నాగాంబా! ఎంత తెచ్చిపెట్టు కొందుమన్నను ఆ ఆనందతేక అలరాజుపై కాకతో చెరిగిపోవు చున్నది.

నాయ :- అట్లయితే మలిదేవులు మాచెర్లకు వచ్చి పడు మాటనిజము.

నర :- మలిదేవులు మాచెర్లకు వచ్చి పడుటయే! వారిని దాని పొలిమేరలకు రానీయము. ఇదినిజము.

నాయ :- అది నిజమైన, నీవు నిజముగా చాలమారాలి.

నర - నే నేమి మారాలి నాగాంబా!

నాయ - యువరాజా! అలరాజుపట్ల అప్యాయత లేకపోయినా ఉన్నట్లు నటించు. కడుపులో లేకపోయినా కౌగిలింపులలో కనిపించు. రాయబారపు సభలో జాగ్రత్తగా వ్యవహరించు. అవిగో! వందిమాగధుల కైవారాలు!

(తెరలో వందిమాగధులు) జయ జయ శ్రీమన్మహా మండలేశ్వర శిరస్స్పృశిత పాదపీఠా! మైలమాంబా గర్భపయః పారావార సుధా కరా! అనుగురాట్సూనూజాగ్రేసరా! అఖండ పలనాటి రాజ్యసింహాసన

ఖాసమానా! వీరకామేంద్ర బిరుద విభ్రాజమానా! జయీభవ!
దిగ్విజయీభవ.

నలగా :- (సింహాసనముపై ఆసీనుడగును) నాగాంబా! మహామంత్రిణీ?
అట్లనే నిలబడితివేమి? కూర్చుండుము. తమ్ముడా కూర్చుండుము.

నాయ :- ప్రభూ! దేవరవారి అల్లుడు బాచమల్లు రాయబారిగా గురిజాలకు
వేంచేయుట నాకెంతో సంతోషముగానున్నది. ఏడేండ్ల తరువాత
ఆయన సమాగమము. వీరమేడపినుండి అశ్వారూఢులై వచ్చుట
వలన ఎంతో అలసియుందురు. మజ్జన భోజనాదులకు ఉచితరీతిని
ఏర్పాట్లు చేసియుందురని తలంచెద. దూరగమనము బాగుగ
విశ్రాంతి తీసికోనిండు.

నలగా :- విశ్రాంతి యిప్పుడు కాదట భోజనమైనది. తాంబూలము వేసి
కొనుచున్నాడు. ఇప్పుడే వచ్చును. నాగాంబా! మా అల్లుడు
మరల మాకు ఏడేండ్లకు కనపడినాడు. మాకు నేడెంతో పండుగగ
ఉన్నది. మా శారీరక మానసికామయములెల్ల తీరిపోయినట్లున్నవి.
నేడెంతో సుదినము!

నాయ :- పేరమాదేవి ప్రఫుల్లముఖారవిందము నేడు మనందరి కన్నులకు
ఆనందము కలిగించును. నేడెంతైన సుదినము మహారాజా!

అల :- (ప్రవేశము)

నలగా :- రా అలరాజా! ఇటువచ్చి ఈ పీఠముపై కూర్చుండుము.

అలరా :- (కూర్చుండును)

నాయ :- అలరాజా! ఎన్నాళ్లకు నిన్ను చూడగల్గితిమి! నెలరాజువంటి
నీ రాకవల్ల మా కన్నులెంతో చల్లబడినవి. మా మనసులును చల్ల
బడినవి.

అలరా :- ఇంత మీ చలువకు సంతోషించుచున్నాను నాగాంబా! ఏమి!
చినమామా! అట్లు చూచుచుంటివి?

నర :- (తడవుకొనుచు) ఆఁ ఏమిలేదు, అల్లునిలో వచ్చినమార్పును చూచు
చుంటిని.

అలరా :- మారిపోతినా?

నర :- చాల.

అలరా :- నా కంటికి నీవును మారినట్లే కన్పడుచున్నావు చినమామా!

నాయ :- మార్పులు సహజమేలే అలరాజా!

అలరా :- మాడుగుల వీరారెడ్డి, చింతపల్లిరెడ్డి వీరందఱేరి మామయ్యా!

నల:- మనలోనూనము వ్యవహరించుకొనుట మంచిదని వారందఱిని పిలిపించలేదు. నాయకురాలుచాలు.

అల!- మహామంత్రిణిగదా! ఎవరున్నను లేకున్నను నాయకురాలున్న చాలు.

నల!- అల్లుడా! సభాముఖమున అడుగవచ్చునని అక్కడి మనవారిని గూర్చి కుశలములడుగనైతిని. వీరమేడపిలో అందఱు బాగుండిరా?

శా॥ మా తమ్ముల్ మలిదేవులెల్ల సుఖులే? మమ్ముం బితృప్రాయుడై
ప్రేమం బెంచిన బ్రహ్మనాయునికిమేలే? అవ్వ శీలమ్మ కున్
జ్యోతిష్మల్ శతమాన మాయువనిరే? చందురుండు నిస్తంద్రుడై
నీతో నేస్తములాడువాడె? శుభమౌనే! బావ కొమ్మన్నకున్?

అలరా !- అందఱు బాగుగనే ఉన్నారు మామయ్యా!

నలగా !- గండువారికిని శీలమువారికిని బాలచందురుని స్వైర ప్రవృత్తివల్ల ఏవో పొరసందు లేర్పడినవని వింటిమి నిజమేనా?

అలరా !- బాలచందురునివల్ల ఏర్పడిన వారి కలతలు స్థిరముకావు. ఎప్పటికైన వారొకటి కాక మానరు.

నాయ !- ఇచ్చుకొన్నవారు, పుచ్చుకొన్నవారు ఒకటిగాక రెండయ్యెదరా!

అలరా :- బాలచందురుడట్లు విశృంఖలా ప్రవృత్తిలో బడిపోవుటకు, ఇక్కడ గురిజాలలోనే కుటిలతంత్రము జరిగినదని అనుకొనుచున్నారు.

నాయ .- (ఉలికిపడి తనలోవచ్చిన భావవికారమును కప్పిపుచ్చుకొనును)

అలరా !- పాపము! ఎవరు పోసినారోకాని వారి కాపురములో నిప్పులు పోసినారు.

నాయ !- రాయబారులు విషయాంతరమున బడుచున్నారు.

అలరా !- విషయాంతరము నాదికాదు మామయ్యది. ఒకటితీసిన రెండు వచ్చునుగదా?

నలగా !- ఏదో అనుకొంటిమి. అదిపోనిండు. అల్లుడా! రాయబారము సాగించుము.

అలరా !- రాయబారమునకు ముందు ధర్మశాస్త్రమును ప్రస్తావించుచున్నాము.

శా॥ ధర్మంబేగద! ఈ సమస్త జగదాధారంబు - నిక్కంబు త
ధర్మంబెవ్వడుతప్పు? వానికి అనర్థంబుల్ ఘటిల్లున్ యశో
నైర్మల్యంబును మాయు-మాయును సిరుల్ నాశంబగున్ సర్వమున్
"ధర్మోవర్ధతి" అన్న సూక్తి మఱువంగారాదుగా యేరికిన్?

నాయ :- నీ రాయబారమునకుముందు ధర్మచింతనము సముచితముగానే ఉన్నది

నలగా:- అలరాజా! మలిదేవరాజు మాతో జరుపుమన్న రాయబారమేమని?

అల :- రాయబారమేమని అడుగుచున్నావా? మహారాజా! మలిదేవరాజు వినయపూర్వకముగ చేసికొన్న విజ్ఞప్తులు ముందు వినుడు.

సీ॥ "కోడి పందెములోన - ఓడి పోయిన మేము-
అనుకొన్న రీతి రాజ్యంబు వీడి,
మండాది మొదలైన మన్నెములందున
మా పరిజనులతో మణగియుండి,
గడువు పెట్టినయట్లు కడగండ్లు పడచును
ఏడేండ్ల వలస యదెల్లగడిపి,
గడువు తీరినగాని కలహాలు వలదని
నీ మాటకోసమే నిలిచి యుండి,
రాయభారము లీలీల - చేయబంపె
తమ్ముడని చూచుటది లెస్స - దానికీవు
కాదు కూడదటన్న సంగరము కలుగు
ఇంపయినచిత్తమున - చిత్తగింపుమనుము"

నల :- వింటివా నాగాంబా! మాతమ్ముని విజ్ఞప్తులు?

నాయ :- వింటిని వింటిని, ఇవి విజ్ఞప్తులమట కంటె ఆజ్ఞప్తులనుట మంచిది, రాయబారము కుదిరితే సరి, లేకున్న రణము తప్పదని.

అల :- మామయ్యా! నాకు తోచినది చెప్పుచున్నాను.

గీ॥ ఒక్క నెత్తురు పంచుకొం చుదయమైన
అన్నదమ్ములు మీరు గదయ్య! మామ!
తల్లులే వేరుగాని మీ తండ్రి యొకడ
మీరు మీరును కత్తులునూరనేల?

నాయ :- ఇందు కత్తులు నూరుచున్నవారెవరు రాచమల్లూ!

అల !- కత్తులు నూఱకున్న మరి వారి మాచెర్ల వారి కిచ్చివేయుడు!

నాయ :- మాచెర్ల వారికేల యీయవలయును?

అల :- ఏడేండ్ల వలన గడిపిరి గదా!

నాయ :- ఏడేండ్ల వలస గడపగనే వారికి మాచెర్ల నీయవలయునా?

అల !- నాగాంబా! ఆనాటి కోడిపందెపు వ్యవహారములో నేను మధ్యవర్తిని

నాయ :- ఎవరు కాదన్నారు?

అల :- నాగాంబా! చమత్కారముగానున్నది. కోడిపందెములో రాజ్యము లొడ్డుకొని, ఓడిపోయినవారు రాజ్యము విడిచిపెట్టి ఏడేండ్లు వలస గడపి వచ్చిన వారి రాజ్యము వారికీయవలయుననిగదా! నియమము.

నాయ - నియమములకేమి లెమ్ము.

అల !- అట్లనుచుంటివేమి నాగాంబా! ఊరకనోటిమాటలేకాదు వ్రాసుకొన్న పత్రిలున్నవి.

నాయి :- (నవ్వి) పత్రిలు! వీటిని పాటించినప్పుడు గదా!

అల !- పాటింపక నియమము తప్పుదురా? నియమోల్లంఘనము చేయుదురా?

నాయ :- అలరాజా! నియమము నింత నిగ్గదీయుచున్నావు. అలుగురాజుల పెద్దకొడుకు నలగాములకు తప్ప మలిదేవులకు రాజ్యార్హత యేనియమము ననుసరించి యున్నది?

అల :- మరి మాచెర్లకు మలిదేవుడెట్లు రాజయ్యెను?

నాయ !- అది బ్రహ్మనాయుడు చేసినపని. అదంతా ఆయిన కుట్ర.

అల !- ఆఁ ఏమంటివి నాగాంబా! బ్రహ్మనాయుడు కుట్రచేయువాడే! కుట్ర యెవరిదో లోకమున్నది.

నరసి !- బ్రహ్మనాయుల కుట్రకాక యేమందువు రాచమల్లూ! మాచెర్ల మలిదేవుల కైనప్పుడు మరి మాకో? మేముమాత్రిము అలుగురాజా కొడుకులము కామా?

నాయ !- అలరాజా! దీనికి నీవేమి చెప్పుదవు?

అల !- మరి, నరసింగులు కూడ ఏదో కొంత తీసికొనక పోయినారా? ఒక వేళ నలగాముల అనంతరము పలనాటి సింహాసనము మెక్కవలయునని ఉన్నదేమో?

నాయ :- అలరాజా! ఆ యోగము వరసింగులకా?

అల :- ఏమో యువరాజులు గదా!

నల :- అల్లుడా! అఖండ పలనాటి రాజ్యమును అన్నదమ్ములము పంచుకొని అనుభవింపపలయునన్న మూడుముక్కలు కావలసి వచ్చును రాజ్యములు ప్రజాపాలనమున కేర్పడినవి కాని పంచుకొనుటకుగాదు. కనుకనే రాజ్యాధికారము జ్యేష్ఠునిదనినారు.

అల :- అట్లయినప్పుడు మలిదేవులకు మాచెర్ల ఏలయిచ్చినారు?

నాయ :- మరల మొదటికి వచ్చుచున్నారు. అదేగదా బ్రహ్మనాయుడు చేసినపని.

నల:- అలరాజా! నేమ పొరబడితిని. పితృతుల్యుడు, గురుతుల్యుడు అయిన బ్రహ్మన్న వచ్చి, మాచెర్లను మలిదేవుల కిచ్చునట్లుచేసి, "దీనితో వీరవిద్యాదేవి కుమారులు వేఱుపోయిరు, కుటుంబ కలహములు తీరు" నని నచ్చజెప్పి యింత చేసినాడు. అదిగాక పలనాటి రాజ్యము మా తల్లి మైలమాదేవికి అరణముగా వచ్చిన రాజ్యము గదా! ఇందులో మాచెర్లను చీల్చి పొరపాటున ఆనాటి పరిస్థితులను బట్టి జాఱవిడుచుకొనుట జరిగినది.

అల :- ఈ ఆలోచన ముందే యుండవలసినది.

నాయ :- నిజమే. నలగామరాజు దూరదృష్టిలేక మాచెర్లను జాఱవిడచినాడు. అసలు బ్రహ్మనాయుడు, మలిదేవులకు రాజ్యమడుగ వచ్చుటలో ఏమి న్యాయమున్నది? సద్యస్కాల పరిష్కృతికి జేయు పనులు ఉత్తరోత్తర క్లిష్టములకు దారితీయునని ఊహింపవలదా. మహామంత్రి? ఇదంతయును ఆయన కావలయునని చేసిన మోసము.గాక యేమగును?

అల :- నాయకురాలా! బ్రహ్మనాయుని అపార్థము చేసికొనుచున్నావు. ఈ పలనాటి రాజ్యాభివృద్ధి ఆయన చేతిమీదుగ జరిగినది. దేశము కోసము ఆయన పడినశ్రమ లోకవిదితము. ఏదో కుటుంబ కలహ నివారణకు అట్లుచేయవలసి చేసినాడు. ఎవరి కన్నులు మూయలేదు. పోనీ, మంత్రిణీ పదమందుంటివిగదా! నీవట్లుజరుగకుండ చూడక పోతివా? నీకును మలిదేవులు వేఱైపోవుటయే యుక్తమని అప్పటికి తోచియుండును.

నాయ :- అలరాజా! ఆనాటి రాజ్యవిభాగము ఏఉద్దేశముతో జరిగినను, ఎవరి తెలివితక్కువతో జరిగినను, తరువాత రాబోవు క్లిష్టసమస్యలకు దారి చూపినది. భూరమాదేవి పుత్రులగు నరసింగరాయాదులకుగూడ కొంత సమాధానము చెప్పవలసిన స్థితి యేర్పడినది. ఇట్లువలనా దొకరు మాచెర్లొకరు, గురిజాలొకరు తీసికొన్నప్పుడు దేశము చీలికలు పేలికలగుచుండలేదా? అనాడు పొరపాటున పోగొట్టుకున్న మాచెర్లను కోడిపందెములో గెల్చుకొంటిమి. అఖండ పలనాటి రాజ్య పునః ప్రతిష్ఠాపనము' బ్రహ్మనాయుడు చేసిన దానికి ప్రతీకారము'

అల :- నీ రాజ్యతంత్రమింత కుటిలమా నాగాంబా!

నాయ :- రాజ్యతంత్ర మెప్పుడును కుటిలమే అలరాజా!

అల:- అవి అకుటిలముగా ఏలయుండరాదు? బ్రహ్మనాయుని అకుటిలరాజ్యతంత్రములో శ్రేయోరాజ్య స్థాపనమున్నది నాగాంబా!

నాయ :- అని మీరనుకొనుటయే గాని చరిత్రలో లేదు. ఇతిహాసాలలో లేదు. ఎక్కడ లేని శ్రేయోరాజ్యస్థాపనము క్రొత్తగా ఏటించి తేగలడా' బ్రహ్మనాయుడు! అభావము! అసంభవము!

అల :- దీనికేమి చెప్పెదవు నాగాంబా! భారత మహాసంగ్రామానికి కౌరవ పాండవుల జ్ఞాతివిద్వేషము కారణము గాదా?

నాయ :- కాదని యెవరందురు?

అల :- అట్లయినప్పుడు పలనాటి రాజ్యవంశములో ఈ జ్ఞాతివిద్వేషమేల?

నాయ.- ఈ జ్ఞాతి కలహాంకురమునకు బీజారోపణము బ్రహ్మనాయునిదే.

అల :- ఇది సోపపత్తికముగా నిరూపింతువా? మహామంత్రిణీ!

నాయ :- నిరూపింతును. మహాభారత యుద్ధానికి బీజము పాండవులకు ఇంద్రప్రస్థము కట్టబెట్టుట, తాత్కాలికావసరములకు చేయువని యేదైనా ఉత్తరోత్తర ఫలితాలకు హేతుభూతమగును. ఇంద్రప్రస్థము పాండవులకి బట్టియే శకుని మాయాద్యూత మేర్పడినది. అదే తరువాత ఆమహారక్తపాతమునకు దారి తీసినది. అష్టాదశాక్షౌహిణీ నరిమితవాహినీ నిర్మూలనము! అట్లే, మలిదేవులకు మాచెర్ల నిచ్చుట పొరపాటున పోగొట్టుకున్న రాజ్యము లాగుకొనుటకే కుక్కుటద్యూతము! తరువాత విషయము నేచెప్పనక్కరలేదు.

అల !- ఈ రాయబారపు పర్యవసానము గూడ చెప్పనక్కరలేదిక. రణము తప్పదన్నమాట! రక్తపాతమాగదన్న మాట!

నల .- అల్లుడా! రణము, రక్తపాతము మేము కావలయునని కోరుకొనుట లేదు. ఈ విపరిణామానికెవరేమి చేయుదురు?

అల !- ఇంతకు మలిదేవులకు మాచెర్ల నీయనట్లేగా మామా! కంఠోక్తిగ చెప్పుము.

నల !- ఇచ్చుటకు వీలు లేదు ఈయము.

నర - ముమ్మాటికీ ఈయము. అలరాజా!

ఉ॥ నచ్చని మాటలేటికి? రణంబున మమ్ముల నోహటించి, దా
లిచ్చి పరిగ్రహించుట కరం బుచితంబనియందు, ఊరకీ
బచ్చులమారి యిచ్చకపు వర్తనముల్గొని రాయబారులై
వచ్చిన మాత్ర రాజ్యము విభాగముగా-ఒకరించి యిత్తుమే?

అల !- రాయబారము వ్యర్థమైనది. యుద్ధమే సిద్ధమైనది. నా ప్రియోజకత్వమాసించిన బ్రహ్మనాదులకేమి చెప్పుదును?

నల !- అల్లుడా! దీనికి నీవు కష్టపడవద్దు. నీ విధి నీవు నిర్వహించితివి. అది నెరవేరలేదని నీవు కించపడనేల?

అల !- అల్లుడని నేచెప్పిన విందుపని వారెంతగనో ఆశించినారు మామా

నల!- అలరాజా! రాజకీయములు మొగమోటములతో పరిష్కారములుకావు

అల - రానున్న రక్తపాతమపుడే కన్నులకు కట్టినట్లగ పడుచున్నది. ఇది చే జేతుల తెచ్చుకొనుచున్నామేమో మామయ్యా! నేచెప్పవలసినది చెప్పుచున్నాము.

శా॥ కట్టా! నెత్తుటదోగు నేలకొలకై కయ్యంబులంబూని, మీ
చుట్టాలుం జెలికాండ్రునుం భటజనస్తోమంబు నాశంబుగా
బెట్టల్ తెచ్చికొనంగ పాల్పడితి రిప్పీ! మేలి సౌభ్రాత్రత న్
మిట్టాడంగను మీకు వారలతునుస్ మేలెంతయుంగల్గదే?

చం॥ కరి తినివేసినట్టి వెలగపండువలె కోశము వట్టిపోవు - ని
ప్పు రగులుకొన్న కాఱడవి పోలిన సేనలు మాసిపోవు - అ
బ్బురముగ గెల్పులచ్చి మెలపుంబలె నిల్కడగాంచబోదు సం
గరము కరంబు భీకరము గాదొకో? నీ మది యోజసేయుమా!

చం॥ సిడిముడితోడ - కుంతమును జేకొని బ్రహ్మన నీదు సేనపై
బడి నెఱజోదులన్ భటుల వ్రక్కలు ముక్కలుగాగజేయు న
ప్పుడు - మఱి బాలచంద్రు -ఆసి పుత్రిక నీ భట రక్తసిక్తమై
ఉడుకులు క్రిక్కినప్పుడును - ఊకొను వారెవరయ్య సంధికిన్,

చం॥ కడకపు డంతలేసి ఒలగంబులువోయినమీద నేలపై
బడియును వీరలెల్ల ఇరువాగుల కూల్గిన మీద - తత్తరం
పడుచును సంధి సంధియని పర్విడివచ్చిన మేలు లేదహో!
కడకొని యోజచేసి దిగగాదగు యుద్ధపుమాయ రొంపిలో.

నలగా!- అలరాజా! యుద్ధము మేము తెచ్చిపెట్టినదిగా భావించి యింత, చెప్పుచున్నావు. రాజ్యార్హత లేనివారు రాజ్యము కోరుచున్నారు. రాజ్యమీకున్న రణము తప్పదనుచున్నారు. నిజానికి వారి మూలము ననే దేశానికీయుద్ధోపద్రవము. ఇంత వారికిచెప్పి యుద్ధము మాన్పలేవా?

నాయు!- మహారాజా! ఈ రక్తపాతమాగదు. మనకు చెప్పవచ్చినారే కాని అర్హతలేని మీకి రాజ్యదాహ మేలయని చెప్పరీ రాయబారులు. మీ యింటి అల్లుడయ్యు వారికే త్రిప్పి పెట్టజూచుచున్నాడు. పొసగని పని. అలరాజా! వారికి రాజ్యకాంక్ష యింతున్నది. యుద్ధములో గెల్చి మాచెర్లయేమి? పలనాడెల్ల పుచ్చుకొందనుము. అంతే గానీ
మ॥ ఇటు సూత్ర్యండటు తోపగా నయిన గానీ, మేము మాచెర్లని
ఇచ్చుటయే మాత్రము సంభవింపదు. రణక్షోణి తలం బందు ని
ల్గుటకై నం దెగియింతు, మెల్ల ఒలము ల్గొంచిప్పుడే యెత్తి పో
రుటకున్ రండను వీరవిద్యల కుమారుల్ వీరులేద్మైనచో.

నరసిం!- అలరాజా! వీరమ్మన్యులైన వీరమేడపి వారితో నేనిట్లంటిననుము

గీ॥ బిచ్చమడిగినయట్లు రాలచ్చి నడుగు
కంటె మరి శౌర్య వీర్యము ల్గలిగె నేని
కదనమున మమ్ముఁ గజయించి కైకొనుడను -
ఒక్క మాచెర్ల కాదు మా - ఉర్వియెల్ల

అల!- మామా! వీరమేడపి కిప్పుడే నా శిరోగమనము.

నలగా!- (చేతులుపట్టుకొని)

ఉ॥ అల్లుడ యింత కాలమునకై యిటువచ్చితి రాకరాక నీ
వెల్లి చనంగ రాదె యిపుడేటికి? అన్నెలరాజు రాకకై
ఉల్లసి తోత్పలంబు వలె ఉన్నది పేరిమి దేవి - ఆమెతో
వెళ్లగ బుచ్చి యీదినము వీలును బట్టియొనర్చ గాదగున్

అలరా :- సరే. అట్లనే చేయుదును.

(నలగామరాజు నమసరించి పోవును, నాయకురాలి నమసరించి నరసింగరాజు పోవును.)

(తెరపడును)

దృశ్యము : ఏకాంతమందిరము

(నలగామరాజుతో అలరాజు మంతనము)

అల- ఉ॥ అన్నవు నీవు తమ్ములుగదా! మలిదేవులు వారికేలకో
మున్నను కొన్న చందమున భూమి నొసంగక రాచపాడి నిన్
మన్ననబుచ్చివైచి, నియమంబులు తప్పియు-కోరి కోరి యీ
తిన్నని పల్లెనాడునకు-తెచ్చెదవో పరిశయింబు భూవరా!

కర్ణునినమ్ముకొన్న దుర్యోధనునివలె, నాయకురాలిని నమ్ముకొని యుద్ధమునకు దిగుచున్నావు. కుటిల భ్రూకుటీ విక్షేపముతో బ్రహ్మనాయుడు సామంతరాగోం విసరునప్పుడు నాయకురాలు నిల్వదు, మఱెవ్వరూ నిలువరు.

మ। రణభూభాగము హోమకుండముగ ఉగ్రక్రోధ తామ్రాక్ష వీ
క్షణ మాలావళు లాహుతాగ్నికణముల్గా- అజ్యధారా ప్రసా
రణముల్ వీరగళోద్గతక్షతజధారా పూరముల్గాగ మా
రణయాగంబొనరించు హోతగనునై బ్రహ్మన్న నిక్కంబుగా.

నలగా :- ఓహో! బ్రహ్మనాయుడు మా రణయజ్ఞహోతయగువాడా? అదే చూచెద.

అల:- బాలచంద్రుడు సామాన్యుడుగాడు అతడెంతయైన బ్రహ్మనాయుని బిడ్డ వానితో నా స్వీయానుభూతి గలదు.

ఉ॥ ఏటికి-ఇన్ని చెప్ప? వచియించెద నీ కొక మాట వాని పొ
ట్టేటిని మించలేక యిగిలించెను నా సవరాలగోడి - అ
మ్మెటి మగండు సుతయిగమీటిన జాలును దాని గిట్టలన్
కూటువయీకలెల్లనలుగుం తొలగున్నిజమీవ చూడుమా!

నలగా :- పొట్టేటి రౌతు అంత గట్టివాడా? చూతము వానిపస.

అల :- మామా!

సీ॥ అన్న పెద్దన్నయే స్గంతవా డె సరేగి
తుక్కుగా మీ సేన త్రొక్కగలడు

నలగా :- అన్న పెద్దన్న, కాదన్న, అలుగురాజుల పెంపుడు కొడుకు అత్తవారింట గూర్చున్నాడు. తమ్ముడు బ్రహ్మన్నవైపు వచ్చునుకాబోలు!

అల :- గండుకన్నమనీడు గండువాడెంతయు
గుండె నెత్తురులను పిండగలడు

నలగా :- గండువాడో, బెండువాడో, చూతముగద.

అల :- శీలమ్మ తల్లికి చిన్న బిడ్డండు పే
ర్నీడున కీడగు వాడెవండు?

నలగా :- పేర్నీడునొక పెద్దజేసిచెప్పుచుంటివా అలరాజా! వీని పీచమణచువారున్నారు.

అల — బ్రహ్మనాయుని పెంపువాడు కన్నమదాసు
గురుని కెక్కిన శిష్యకుండువాడు

నలగా :- మాలకన్నమని జెప్పుచుంటివా? మాడుగుల వీరారెడ్డి వాని మాడుపెచ్చు లేవదీయువాడున్నాడు.

గీ॥ అరువదార్వురు నాయకు లదియుగాక
గట్టివారలు కుమ్మరపట్టి దొట్టి
చిట్టి వీరులు కాసెలు గట్టి రేపు
అలమునదూకి పోరాటమాడ గలరు.

నలగా :- అడవలసినదే బొంగరాలు. ఈ పిల్ల వీరులనుగూడ లెక్కగట్టి చెప్పుచుంటివే రాచమల్లూ!

అల :- ఒక్కమాట మామయ్యా!

శా॥ ఏదీ వేల్పుల మడంచి బ్రహ్మననుగానీ బాలునింగాని బా
హాదర్పంబుదలిర్ప - తాకగల వీరాగ్రేసరుండెవ్వడో
నీదౌ సైన్యమునందు ఒక్కనినిగానీ చూపుమా వీరకే
శీ దుర్వారులువారు తండ్రికొడుకుల్ వేవేల వాపిర్వగన్.

అల :- అలరాజా! నీవు నన్ను భయపెట్ట జూచుచున్నట్లున్నది. నేనేమి భయపడను. నీవు వర్ణించిచెప్పుచున్న కాదనాది బాలవీరపర్యంతము వారొకయెత్తు. నాయకురాలొకయెత్తు.

ఉ॥ ఆ విధి బాదనాదిక మహా ప్రతియోధ తరంగ సంగత
ప్రావృతమై- అగాధమయి భాసిలు యుద్ధపయోధిమండి నన్
తా వెరవూని ఒడ్డునకు-తప్పక చేర్చగజాలు మచ్చమూ
నావికురాలు నిక్కముగ నాయకు రాలనినీ వెఱుంగుమా!
నీవు యుద్ధమున మా పక్షమందుండ వలసినవాడవు.
ప్రవాసమాదిగ వారినే అనుసరించుచున్నావు.

అలరా!- మామయ్యా! యుద్ధమున నా పాత్రయుండదు.

ఉ॥ వారును మీరు నాకయిన వారలుకావున, వారిపక్షమే
పోరుట గాని మీవయిపు పోరుటగాని యొకింతయేనియే
పొరదు ముందు చూడ నుయియట్లును వెన్కగొయ్యియట్లునా
తీరదియుండె- పాలుగొనదీరదు వాల్గొని పోరనేనెటున్.

శా॥ మా మా! ఈరుధిరప్రవాహ మెటులో మాన్పంగలేనైతి సం
గ్రామంబే నిజమయ్యె, దేశమునకుం గావింప లేనైతి సు
స్థేమ క్షేమము, లెంత వ్యర్థుడను? జ్ఞాతి ద్వేషవహ్నిచ్ఛటా
దూమజ్వాలలు జాతిఆహుతియగున్ దుర్వారఘోరం బుగన్.

నలగా!- అల్లుడా! ఇక నీవీమాట లెత్తవద్దు. పేరమాదేవి ఎదురుచూచు
చుండును పోదముపద. (నడుతురు)

(తెరపడును)

దృశ్యము ! నరసింగరాజు ఏకాంతగృహము

నరసి :- (ప్రవేశము వికల హృదయముతో)

ఉ॥ అన్న-అనంతరంబు ప్రభువయ్యెద నే బలనాటి కంచుమన్
మున్ననుకొంటి మింటికిని పూన్చి పునాదులు వేసి కట్టితిన్
తిన్నగ తిన్నగా నిటులుతీయని ఆసల పేరి మేడలన్
అన్నియు గూలిపోయినవి హా! అలరాయిమహానిలంబునన్
అలరాజు భావి పలనాటి రాజ్యప్రతినిధియట! నల
గామరాజు ఏకైకపుత్రిక రత్నాల పేరిందేవికి పతియైనందున
అతనికే రాజ్యము సంక్రమించునట! అన్నగారి నోట యీ మాట
పొక్కినదట! మురిపెము లొలికించు కూతు నల్లునింజూచికొని పులి
కించి పలికినాడట! వేగువింటిని.

నాయ :- (అంతలోవచ్చి) వింటివా యువరాజా! మఱి యేమనుకొంటివి?
నరసిం:- పలనాటి సింహాసనము నాకు దక్కదనుకొంటిని.
నాయ:- దక్కదు! ఎటుల దక్కదో చూచెదం.
నరసిం:- ఏమి చూచెదవు నాగాంబా!
నాయ:- తెరవు చూచెద చూపెదనీకు తెరవు
నరసిం:- నీవు చూపు ఆ తెరవులో నరసింగుని ప్రస్థానము నిరాటంకముగ సాగిపోవుటకు నిష్కంటకము గావింతువా? నాగాంబా!
నాయ:- కావింతును.
నరం :- ఏమి కావింతువు?
నాయ:- అల రాజు హత్య.
నర :- ఆ రాజును హత్య చేయుదువా?
నాయ :- రాజును కాదు అలరాజును.
నర :- అలరాజు హత్యయే అదివద్దునాగాంబా! అలరాజుమాయింటిఅల్లుడు. వానిని హత్య చేయవద్దునాగాంబా! అతడు మా ముద్దుల పేరిందేవి భర్త. పేరిందేవి మాఅన్నగారికి ఒక్క గానొక్కకూతురు. అలరాజు హత్యజరిగిన పేరిందేవి ఉండదు. సహగమించును. పసుపు కుంకుమలతో ఆ పలనాటిలక్ష్మి చితాగ్నిలో బుగ్గికారాదు. పేరునకు నలగామరాజుకూతురే గాని, పెరిగినది నాచేతులలోనే. ఆమెను పెంచినదినేనేనాయకురాలా! కన్నమరులన్నా పెంచినమరులు మిన్న
నాయ :- (నవ్వి) బాగున్నవి నీమరులు! ఈ మరులలో తగులుకొన్న వీ కిరులే.
నర :- ఇంకేదైన అపాయములేని ఉపాయము చూడలేవా? మహా మంత్రిణీ!
నాయ :- నాయకురాలి రాజనీతి మహాకౌటిల్యము యువరాజా! ఈ కుటిల నీతి, కూతురని, అల్లుడని, కొడుకని, తండ్రియని, అన్నయని చూడనీయదు ఇది మంచి అవకాశము. వంటయింటి కుందేలు వలె వచ్చినాడలరాజు. ఈ అవకాశము జారిపోయిన, నీచేతిలోనికి రానున్న పలనాటి రాజ్యాధికారము జారిపోవును.
నర -: జారిపోరాదు నాయకురాలా! ఆ అధికారము నా చేతినుండి జారి పోరాదు. అందుకు నీవేది చేయుమన్న అదిచేయుదును. ఎట్లునడువ మన్న అట్లునడుతును.

నాయ :- అట్లయిన ఎటువంటి రాజ్యలక్ష్మి నీ కరగత మైనట్లే.

నర :- నీ హత్యాలోచనకు ముహూర్త మెప్పుడు నాగాంబా!

నాయ :- నేడే నేటిసాయంకాలవేళ. సూర్యుని అస్తమయము అలరాజు అస్తమయము! అన్ని ఏర్పాట్లుచేసితిని.

నర :- అప్పుడే ఏర్పాట్లు గూడ చేసితివా? నీవ్రిగతికి తిరుగులేదు. వివరములడుగ వచ్చునా?

నాయ :- అడుగవచ్చునా అనయేల? అడుగకుండగనే చెప్పెద. నేటి సాయంకాలవేళకు ముందే, అలరాజు వీరమేడపి పయనమగుచున్నాడు. కన్నమదాసు తోడున్నాడు. ఇరువురు గుఱ్ఱములెక్కి పోవుదురు. చెర్లగుడి పాడువడ్డ ఆగుదురు.

నర :- ఆఁ అక్కడే ఆగుదురా? ఎవరు చెప్పినారది.

నాయ :- ఎవరు చెప్పనక్కరలేదు. అది నా ఊహించిన ఊహ. అక్కడి కొక పూజారిని నిన్నమొన్నే ముందే పంపితిని.

నర :- పూజారేమి చేయును నాగాంబా!

నాయ :- ఏమిచేయునా? పిలుపునుబట్టి పూలసజ్జతో అలరాజు దగ్గరకి బోవును.

నర :- పూలసజ్జలో ఏమున్నది

నాయ :- ఉన్నదొక పూవు అది అలిక పరిమళ విలసితము, విషకలితము, అది అలరాజున కిచ్చును

నర :- ఆపూలో విషము పెట్టితివా! దానితో అలరాజు -

నాయ :- చచ్చును.

నర :- చచ్చుటకు పూవెవరైనా తిందురా?

నాయ :- పూలు తిందురా యొక్కడైనా? వాసన చూతురు. ఆ వాసనలతో విషము నాసికా పుటముల గుండ లలోకు వ్యాపించును. దానితో మరణించును.

నర :- (చకితుడై) మరణించునా? నా సుకుమారుడా! అయ్యో! నా రాజ్యపుత్రలోభ మహాభూతానికి నాకుమారుల్లను బలియిచ్చెదవా మహా మంత్రిణీ!

నాయ :- దానితో గాని నీకా భూతము వశపడదు. పేరమాంబ సైతము బలికావలసినదే భర్తృమరణముతో ఆమె సహగమనము! చితాగ్ని

జ్వాలా మాలలలో నలగామునకు ఏకైక పుత్రిక దహనము. దిట
ముగా ఉండుము యువరాజా! దిగులుపడకుము! దిగజారిపోకుము!

నర :- (భయముతో గొంతు బొంగురుపడి)

ఉ॥ నాకు భయంబు గల్గెడిని నాయకురాల! మహారహస్య, మె
ట్లి కఠిణీయ మీవుగుటి యుంచగ గుంటివొ? కైటసద్దచో
లోకుల నోళ్ళలోబడి విలోలమునై మరి పాశపడ్డ తా
టాకుల కొంపపై బడిన అగ్గివిధంబున ప్రాకిపోవదే?

నాయ :- ఇది నాకు చెప్పవలయునా? ఈ రహస్యము మనిద్దరిలోనే యుండవలయును. మూడవ వ్యక్తి పూజారి. వాని వల్ల ప్రమాద మున్నది. వానికిట్లున్న అంశములో ముందు కొంతయే యిచ్చితిని. మిగిలిన దాని కోసము వచ్చును. ఆ వచ్చినప్పుడు.

నర :- వచ్చినప్పుడు ఏమి చేయుదువు?

నాయ :- వాని తల తీసివేయుదును.

నర :- భళి భళీ నాగాంబా! మన హత్యా రహస్యమందిర ద్వార బంధనమునకు మంచిపదక మిది.

నాయ :- ఇంకను విను అలరాజుహత్య బ్రహ్మనాయుడే చేయించెనని నలగామరాజు నమ్మునట్లుచేసెదను.

నర :- అదెట్లు సాధ్యము? అలరాజు హత్యబ్రహ్మనాయుడు చేయించినా డన్న అన్ననమ్మునా?

నాయ :- పిచ్చివాడా! అదే నాయకురాలి కౌటిల్యము. "నలగామరాజు తరువాత పలనాటి రాజ్యాధికారిణి పేరమాదేవి యగును, ఆమె భర్త యైనందున అలరాజే రాజప్రతినిధియగును, అలరాజు రాజైనచో మన కేముండు" నని తలచి, బ్రహ్మనాయుడు మామీద బడి పోవునని గురిజాలకు రాయబారిగా బంపి తిరిగి వచ్చుచుండగా కన్నమదాసుచేత చంపించినాడని చెప్పినచో నమ్మడా మీ అన్న.

నర :- నమ్మును. నమ్మితీరును. అబ్బా! నీ రాజతంత్రి మద్భుతము. రాజనీతియందు వేయిమంది కౌటిల్యులును నీకు శిష్యులు కాదగి నారు. ఈ శక్తి నీ వెట్లుసంపాదించితివి నాగమదేవీ!

నాయ :- ఇందు నాశక్తియేమున్నది? సర్వశక్తిసమన్వితుడైన ఆ మహా శివునిశక్తి!

గీ॥ స్వామి కృపవల్ల గనయెత్తు సాగి పోవు
చచ్చియే తీరు నలరాజు, సహగమనము
చేయుట నిజంబు పేరాంబ, సిద్ధమింక
నీదె పలనాటి రాజ్యంబు నీదె నీదె.

నర - ధన్యవాదములు నాగాంబా!

(తెరపడును)

## చెర్లగుడిపాడు

అలరాజు మహాప్రస్థానము :-

ప్రొద్దుగ్రుంకువేళ : గుఱ్ఱముల గిట్టలధ్వని

ప్రవేశము :- గుఱ్ఱములుదిగి, అలరాజు , కన్నమదాసు

అలరా :- కన్నమదాసూ! నాయకురాలిప్రభావము నలగామరాజు నందెంత ప్రతిఫలించినది! ఆయన యింత రాజ్యలోబుడగునని నేననుకొనలేదు అల్లుడను నామాటవినునని బ్రహ్మనాయుడు మామయ్య యెంతో ఆశించినాడు. రాయబారము వృధాప్రయాసలతో భారమైనది. రక్తపాత మొప్పుకొనని వారికి రణము తప్పలేదు

కన్నమ - రణమే రానీ అలరాజుగారు! కన్నమదాసు కత్తికాకలు చవిచూపెద నాగమ్మకు యుద్ధమనగా అపరాత్రివేళ మంద పోటుజరిపి లంకన్నను పొడిపించుట అనుకొన్నదేమో!

అలరా !- కాదు కపటపు కోడిపందెములనుకొన్నది.

కన్నమ :- ఎప్పటికైన ఆమె అంతుకనే తేల్చెదను.

గీ॥ నే నొకండనె చాలుదు నీలకంఠు
డడ్డు పడిన సరే నాగమాంబను చెవి
పట్టి శ్రీ బ్రహ్మనాయుల పాదయుగళి
పైన వేయుదు - పూజాప్రసూనముగను.

అలరా !- అంతపని చేసియే తీరుదువు. కన్నమదాసు! నా రాయబారము వ్యర్థమై పోయినది. నాయకులకు నేనేమిచెప్పుదును? మొగము చెల్లకున్నది. చెర్లగుడిపాడునుండి అప్పుడే మేడపికి రాజాలను. ఎందులకో మనసు వెనకకులాగుచున్నది. ముందుగ నీవు పోయి

రాయబారపు వైఫల్యము మనవారికి చెప్పము. మనస్థానమునకు తోడు తపనుని చండాంశువుల తాప మింకను తగ్గలేదు. అదిగాక అశ్వధావనమున అలసట నొందితిని కొంచెము సేపీ తటాక తీర తరు చ్ఛాయల సేద దీర్చుకొందును. నీవేగి గుఱ్ఱములకు నీళ్లు త్రాగింపుము.

కన్నమ :- అట్లనే (వెళ్లును)

అలరా :- ఏడేండ్లకు భార్యాముఖవీక్షణము కలుగగా నా దౌత్యవైఫల్యముతో మనసు వైకల్యమునొంది, ఆమె సంప్రార్థనము త్రోసి పుచ్చితిని. పాపమామె యేమను కొనుచున్నదో? ఎంత చిన్నబోయినదో? ఎంత బాధపడుచున్నదో? ఆమెస్థితి తలచుకొన్న, ఇట్లేల చేసితినాయని అనిపించుచున్నది.

ఉ॥ ఎండిన మోడు మాఁకు చిగురింతలు గాగ చిరప్రవాసమం
దుండి, వియోగయోగమునఁదియయూడగ మా ఉభయానురాగముల్
పెండి సుమించు నంచితుల వేగిరమెంతయు పొందివచ్చితిన్
దండుగమారి దౌత్యమిటు నా కుతుకమ్మును వమ్ముచేసెగా.

పూజారి :- (ప్రవేశించి) ఓహో! అలరాజు గారా? ఎన్నాళ్ళకు మీ దర్శన భాగ్యము! మీ తండ్రి కొమ్మరాజు గారు బాగున్నారా?

అల :- ఎవరు నీవు? నన్నెరుగుదువా? మా నాయనగారి కుశలమడుగుచున్నావే? వారితో నీకు పరిచయమున్నదా?

పూజారి :- మాది కల్యాణపురము. విపత్సమయమున మా కుటుంబమునకు మీ నాన్నగారు చేసిన సాయము మఱువరానిది.

అల :- నీవు కల్యాణపురవాసివా? మాకు కల్యాణ పుర రాజ్యము పోయి చాలకాలమైనది!

పూజారి :- రాజ్యము పోయిన తరువాత మీరు పలనాడు వచ్చితిరి. నేనును ఇంచు మించుగా ఆ రోజులలోనే చెర్లగుడిపాడు బ్రతుకు తెరువునకు వచ్చితిని.

అల :- నిన్ను మా తండ్రిగారెఱుగుదురేమో కాని, నేనెఱుగను.

పూజారి :- గురిజాలలో మీ పెండ్లి జరిగి నప్పుడు, ఏదోపనిమీద నేనచ్చటికి వచ్చితిని. అప్పుడు మీ నాన్నగారితో కలిసికొంటిని. మీరు నన్నెఱుగరేమో కాని, నేను మిమ్మెఱుగుదును.

అలి :- (పరికించి) ఏమిటిది పూలసజ్జయా?

పూజారి :- నేను పూజారిని. పూజకు పూలు తీసుకొని పోవుచున్నాను ఇదిగో! గులాబి. ఇది మీకు నా యిచ్చు కానుక. మీపై నా కున్న ఆప్యాయతకు లాంఛనము. తక్కిన పూలు దేవపూజకు. ఇదిగో, తీసికొండు.

అలి :- అక్కఱలేదు. దేవపూజ కుద్దేశితము గా లేదే?

పూజారి :- అనుమానింపకుడు! దీని సుగంధాఘ్రాణము రసైక్యము నొందించును. ఇది నా ప్రేమపూర్వకోపాయనము. కాదనగూడదు

అలి :- (పూవును తీసికొనును)

పూజారి :- నాకు మీరిక కనపడరు. నమస్కారము! పోయెద (వెళ్లును)

అలి :- ఈ పూవెంత అందముగానున్నది? దీని సుగంధాఘ్రాణముచే న- ఘ్రాణేంద్రియము తొందరించుచున్నది! (పూవు వాసనచూచి క్రమముగా వికారించుట అభినయించును) ఇదేమి? దీనిని మూర్కొనినంతనే సుగంధముతో ఏదో ఒక వికారము సంధానితమై నాసాపుటములనుండి తలకెగబ్రాకుచున్నది? ఏమిది? తల తిరుగుచున్నది మేను సొరుగుచున్నది! (పూవు క్రిందవైచి) కన్నమదాసు! కన్నమదాసూ! (సొరిగిసొరిగి నేల కొరగుచుండ)

కన్నమ :- (పరుగున వచ్చి) ఏమిటిది అలిరాజుగారు! అయ్యో! అయ్యో! ఏమిట్లు కళ్లు తేలవేయుచున్నారు. (పట్టుకొనును)

అలి :- పండబెట్టుము. కన్నమదాసూ,

కన్నమ :- (తిన్నగా పరుండబెట్టి) అయ్యో! అయ్యో! ఏమిట్లు [illegible] ప్పాయమున్నారు ఏమైనది బాబు!

అలి :- విషప్రయోగమైనది! కన్నమదాసు! అదిగో! ఆపూవు వాసన చూచి యిట్లయిపోతిని.

కన్నమ :- ఎక్కడిదీ పూవు? ఇక్కడికెట్లు వచ్చినది? ఎవరు తెచ్చిరి?

అలి :- ఎవడో! మాతండ్రినెరిగినవాడట! నాయాప్యాయతగా - పురస్కరించి కానుకగా-తీసికొండని- పూవిచ్చి-పోయినాడు-

కన్నమ :- అయ్యయ్యో! దీనిని వాసనచూచితిరా దొరా! అది నాయకురాలి ప్రయోగము! మోసమైనది. నేను లేకుండ జూచి, దుర్మార్గుడెవడో

మీకెచ్చుకోయినాడు చీల్చి చెండాడెదను వాడేడీ? ఎక్కడ దాగినాడు? (కత్తి దూసి రెండడుగులు వేయును)

అల:- వదుష్టుడే పారి పోయినాడు. నీకు దొరకడు కన్నమదాసూ! పొరపాటు జరిగినది. నేను గురిజాలకు వచ్చునప్పుడు, "అల్లుయ్యా, కార్య తప్ప ఇతరులేది ఇచ్చినా తీసికోవద్దు" ని మా తండ్రిగారు మరి మరి చెప్పినారు. మఱచిపోతిని కన్నమదాసూ!

కన్నమ:- ఇదంతా నా యేమరిపాటు దొరా! నే దగ్గరున్న ఇది జరిగేదికాదు. అయ్యో! నా బుద్ధి యిగ్గోసినా? ఇంతలో గుర్జాలకు నీళ్లు త్రాగించబోతి నేల?

అలరా:- అబ్బా! బాధ భరింపలేను కన్నమదాసూ! నేను బ్రతుకను కన్నమదాసూ! ఇప్పుడు దెబ్బలలో ఇది ఘోరవిషప్రయోగము కన్నమదాసు,

కన్నమ:- (గుండెబాదుకొనుచు) అయ్యో! నేనెంత ప్రమత్తుడనై నిన్ను నాగమరాలి మాయావలయమునకు జిక్కించితిని. నా స్వామి బ్రహ్మనాయునికేమిచెప్పుదును? గురిజాలకు వచ్చునప్పుడిద్దఱము గుఱ్ఱములెక్కి వచ్చితిమి. తిరిగి మేడపికి ఒక్కడినె పోలేను. ఈ కత్తితో పొడిచికొనిచచ్చెద (కత్తి నెత్తును)

అలరా:- కన్నమదాసూ! వద్దు వద్దు. అపనిచేయకు. మా చెల్లె చెన్నమ్మ నాన! నీస్వామి బ్రహ్మన్న పాదమాన! నీవు మేడపికిపో. కత్తితో పొడిచికొని చావవద్దు. నేను చచ్చుట నిజము. నీవును చచ్చిన మేడపిలో నా సంగతి మనవాళ్ళకెవరు చెప్పుదురు? కన్నమదాసూ! నీ కత్తిదించు! (బాధాతిశయముతో)

నా రాయబారము - విఫలమైన సంగతి- మా మామలు మల్లి దేవులకో - ఒప్పిమ్మన్న మహామంత్రితో - చెప్పు - కన్నమదాసూ! నాయకురాలు నాగమ్మవల్ల - నాకు గల్గిన దుర్గతి - మనవారందరితో చెప్పు కన్నమదాసూ! - నాపై ఎంతో ఆశపెట్టుకొనియున్న మా నాయన గారికి - నా కడసారి మొక్కులందించు - కన్నమదాసూ! బావ బావ - యని కలవరించు - బాలనాయునికి - నా బిరుదు లివెల్ల నేనిచ్చుచుంటినని - యిచ్చివేయి కన్నమదాసూ-అలరాజు పగ తీర్చుడని అలువ దాలుగుచు నాయకులముందుగ్గడించు - కన్నమదాసూ! కన్నమదాసూ! ముమ్ముందు నామరణవార్త - నా రత్నాల దేవికి - నీవేపోయి చెప్పు - విషము తలకెగ బ్రాకినది -

గుండె గడియారమాగిపోవు చున్నది — నేనిక బ్రతుకను దాసూ!
- కన్నమదాసూ! కన్నులు - మూసుకొని - పోవుచున్నవి -
అయ్యో! తల్లి దండ్రులారా! మీ ఏకైక పుత్రుని - దుర్మరణ
వార్త విని - మీరేమగుదురోగదా! హా! దేవీ నా రత్నాల పేరిందేవీ!
నీవు నాతో సహగమింతువు కాబోలు! హా శివ శివా! (మరణించును)

కన్న:- (దుఃఖాతిశయముతో) అయ్యో! రాచమల్లుదొరా! మాకు లేకుండ పోయితివా! (శవముపైబడి యేడ్చును)

(తెరపడును)

## సహగమనము

దృశ్యము: గురిజాల: పేరమాంబ మందిరము

(సమయము: అర్ధరాత్రి: ప్రవేశము. పేరమాంబ, పాన్పుపై చేరగిల కూర్చొని, శూన్యహృదయముతో, శూన్యాకాశము లోనికి గవాక్షము నుండి చూచుచు)

పేర:- గీ॥ మబ్బు గుబ్బాలపై నెక్కి మరలి చూడ
కొక్కెరల్ పోకగా పోదువెక్కడి కిటు?
నిలువగదవోయి నెలరాజ! నిముసమైన
ఒరిగి పోవు నీవంతనాల ఓడ లేమి?

చెలి:- (కన్నులు నలుపు కొనుచు వచ్చి) ఇంకా నిద్రపోలేదా అమ్మా! నిశిరాత్రి దాటిపోయినది పడుకో అమ్మా!

పేర:- పడుకొన్నను నిద్రరావటములేదే! ఎంత మసలినా కన్నుమూత పడేటట్టులేదు. నేనేమి చేయునే లక్ష్మీ!

చెలి:- చెరవేకి పడుచున్నావమ్మా! పాపము! ఆయన వచ్చినాడాయె, పోయినాడాయె.

పేర:- నా రాజు, వచ్చుటకు, పోవుటకు నేను మేడపైకెక్కి రోజు రోజు మేడపై వైపు ఎదురుచూచినంత చేయులేదే!

చెలి:- ఏడేండ్లకు వచ్చినాడాయె - ఏడు రోజులైన ఉండలేదాయె.

పేర:- ఏడురోజులుకాదే లక్ష్మీ! ఏడు గడియలైన ఆయనతో ఉండినది లేదుగదే!

చెలి!- అంత తీరనిరాజకీయా లేమివచ్చినవో? ఆదార కాలు నిలుపకుండ పోవుటకు?

పేర:- భోజనమైన చేయులేదే! రాయబారమాడబోవుటకు ముందు ఇంతేమి భుజించినాడో? మరలలేదాయె

చెలి:- అదేమైన అలిగి నాడేమోనమ్మా!

పేర·- అలిగేదేమిటే! ఎంతాశతో వచ్చినాడో అంత నిరాశకలిగిందాయనకు.

చెలి:- అదేమైన రాజకీయమా అమ్మా!

పేర - రాయబారము వచ్చినారంటిని గాదటే! అల్లుడని, అయన చెప్పిన వినుమని మలిదేవరాజు బాబయ్య పంపినాడే!

చెలి - మలిదేవుల బాబయ్యకు మాచెర్ల ఇచ్చినారా అమ్మా!

పేర:- ఇచ్చిన, ఇక లేనిదేమున్నదే! ఈయలేదు కనుకనే, ఆయన ఎంతో కష్టముతో మొగమింతచేసుకొని పోయినాడు ప్రతికూలినా భంగ పడినా- వినలేదే లక్ష్మి!

చెలి !- అదాసంగతి? అర్థమయింది. అల్లుడు రాకరాక వచ్చి నందులకు, ఆయనకు చేయు మరియాద —

పేర ·- (నోరుమూసి) ఊరుకోవే లక్ష్మీ! గోడలకు చెవులుండునే!

చెలి !- ఎందుకమ్మా భయము? నాన్నగారి తరువాత సింహాసనమెక్క వలసిన దానవు నీకీపాటి స్వతంత్రము లేకుండ బోయినదన నా కేడ్పువచ్చుచున్నది

పేర !- నా కోసము నీ వెందుకు లక్ష్మీ! ఏడ్పుట,

(కోళ్ళుకూయును)

చెలి :- అదిగో! కోళ్ళు గూడ కూయుచున్నవి. ఇక నైన పడుకో దేవీ!

పేర :- కన్ను మూత పడునట్లులేదే! ఒడ లెల్ల వేడెక్కి పోయినది. కళ్ల నీళ్ళు కాగిపోవుచున్నవి గుండె యెండుచున్నది. నాకిది నిర్నిద్ర యేనే! నా కోసము నీ కెందుకే జాగరణ? నీవు పరుండు పోవే!

చెలి !- నీవు పరుండనిదే నేను పరుండనమ్మా!

పేర !- అయితే పరుండెదను, నీవుపోవే! (పరుండును)

(చెలి వెళ్లి అవలపరుండును, ఏదోనిద్ర! ఆ నిద్రలో కలలు! కలవరింతలు! విషాదవీణాస్వరంతో నలగామరాజేడ్పుచున్నట్లుకల)

(నేపథ్యమున)

సీ॥ పల్లకి యెత్తరా? పలనాటి లక్ష్మికి
పతితోడి కడసారి పయనమునకు
పసుపు కుంకుమతోడి పచ్చిముత్తైదువ
పసుపాడ నిచ్చిరా పసదు లొలుక
కాటుక కన్నీరు కాగులు నిండారు
తుడుచుకో నీయరా? తొందరేల?
చితిజేరు నందాక చెలులు తోడుండరా?
ఏకాకి యిగునె? నా యేక పుత్రి
మగని శవము తోనె మంటలలోనికి
త్రోయుదురొకో? సంప్రదాయ మిద్ది
తప్పగూడనిదటె దగ్ధమై పోవునే?
పేరుమాసి తల్లి పేరమాంబ!

పేర :- (ఉలికి పడి లేచును) చెలీ చెలీ! లక్ష్మీ! లక్ష్మీ!

చెలి :- (అదరి పడి లేచును) ఏమిటమ్మా! కలవరించుచున్నావా?

పేర :- నాయన గారేడ్చుచున్నారు గదే!

చెలి!- నాయనగారా? వారిక్కడలేనేలేరుగదమ్మా! ఏడ్చుచున్నారందువేమి?

పేర :- నేలపై బడి పొర్లాడుచూ ఏడ్చుచున్నారు గదే లక్ష్మీ!

చెలి :- ఎవ్వరూ ఏడ్చిన సందడే లేదు ఒక వేళ కలయేమోనమ్మా!

పేర :- కలయేమోనా? అంతా నిజముగానే ఉన్నదే లక్ష్మీ! నాకేమో భయముగా ఉన్నదే! నా రాజునకేదో జరిగి యుండునే లక్ష్మీ మా నాయనగారి యేడ్పులో వినరైనవలుక్కలు చెప్పగూడదే లక్ష్మీ! అమంగళము - ఎట్లుచ్చరింతునే లక్ష్మీ! (ఏడ్చును)

చెలి :- ఊరుకోతల్లి! రాత్రెల్ల నిద్రలేనందున ఏదో కునుకుపట్టియుండును. పట్టకపట్టిన కునుకులో అటువంటి కలలే వచ్చుచుండును. మనసు కలతలో కలవరింతలు! అమంగళముకాదు, ముటేమియుగాదు. తెల్లవారవచ్చినది

పేర :- తెల్లవారితే ఏదో దుర్వార్త! ఏదో అమంగళము! ఏదో అవర్థకము తప్పదే లక్ష్మీ! అన్నీ జరిగిపట్లే చెప్పగూడదుగాని చెప్పుచున్నాను. వినవే లక్ష్మీ! ఆ కల అంతా నా సహగమనాన్ని సూచించుచున్నదే లక్ష్మీ! (ఏడ్చుచు పక్క పైన పడిపోవును)

చెలి :- అయ్యో! నా బంగారు దొరసాని! ఇదేమి ఘోరమమ్మా!
(పేరమాంబను పట్టుకొని యేడ్చుచుండును) (తెరపడును)

దృశ్యము 1 గురిజాల పురాభ్యంతరము

సమయము: వేకువాత

గంగిరెడ్డి:- (ప్రవేశము) ఏంమాయ కాల మొచ్చిందిరా బాబు! సంద మామలాంటి ఆదొర నిన్న సందేలప్పుడు గుఱ్ఱమెక్కి మోతుంటే శేనుకాడుండి చూశానాయె. తెల్లారేటప్పటి కల్లా యిదేంటివార్త! పూరంతా మోగి మోతుంటేను. (పరికించి) యారు సెపుమ యిటొత్తున్నాడు? వోరి మారంగులే? ఏంరా రంగులూ! యాడనుంచొ త్తున్నావు? యాందికత?

రంగిరెడ్డి - మాచెర్ల నించి నిన్న సందేలప్పుడు సెర్లగుడి పాడొచ్చానాయె సెర్లగుడిపాడు నించి యిప్పుడొత్తున్నా.

గంగి:- తెలారేటప్పటి కల్ల దిగేశావు! యేంది సమాచారం?

రంగి:- వోరేయ్ గంగులు! పూళ్లో యెట్టాగుంది యిసయం?

గంగి:- యాం యిసయమంట?

రంగి:- మా రాజుగోరల్లుడు లేడు అలరాజులుంగారు-

గంగి:- ఆఁ అలరాజులుంగోరు నిన్న సందేలప్పుడు గురిజాలనుంచి యెల్లి పోయాడాయె

రంగి:- యెల్లి పోయాడు సరేరా గంగులు! ఆయన్ని గురించి యేదన్నా యిసయం పొక్కిందాంట వూళ్లో.

గంగి - యాం యిసయం ఉండంది కాఒట్టి పొక్కటానికి వూళ్లో. రాయ బేరం వొచ్చాడాయె, పోయాడాయె యిదీ యిసయం

రంగి:- వో రెట్టిమొగమా! ఆయన్ని సంపేశారురా సెర్లగుడి పాడులో-

గంగి:- వోరిరంగులూ! యీ యిసమయం నీకన్నా ముందుగుండానే పరు గెత్తుకొనొచ్చి వూళ్లోపడ్డదిరా యెట్టినాయాల! ఆయన కలేబరం తెల్లారగట్టె మోసుకొచ్చేశారంటగా రాజుగోరింటి కాడికి?

రంగి:- యారు సంపేరని అనుకొంటున్నారురా గంగులూ!

గంగి:- ఆ యిసయం ఎత్త మాకసి పికెమీరికొత్తది.

రంగి:- యీడ యారున్నారని బయం.

గంగి:- నాయకురాలమ్మ, నరసింగయ్య కలిసి సేసిన పనిలాగుందిరా గంగులూ.

రంగి:- బెమ్మనాయుడయ్య సంపించాడని మోగుతుందేంటిరా?

గంగి :- పాముమ్మసామాన్యంరాలుకాదోసి! ఆమె సేయించింది. బెమ్మయ్య మీనికి మలిపేసిం, యిదీ రహస్యం!

రంగి :- యారో గడ్డితినే నాయాళ్లనాల్పిందే బెమ్మనాయుడెందుకు సేత్తాడురా యీ పని

గంగి :- మా తల్లి యిపె పాముమ్మ మయమేరోయ్? ముమ్మాటికి యీమెచ్చింది నిండు కావరం కొండయిందా? కోళ్లపందేలు మొగిచ్చిందా? బెమ్మయ్య నోడిచ్చిందా? ఆళ్లని మాసెల్లనించి యెల్ల గొట్టించిందా? రాయబేరంవాత్తె రాసమల్లున్ని యీ పనిసేయిచ్చింది. యెంతకైనావుందిరోయ్!

రంగి :- సొలిచ్చిక కత మన కేంటొచ్చింది. తేలేనాటికి తేలకేంపోదు.

గంగి:- నిజం నిదానం అన్నారు పెద్దోళ్ళు

రంగి :- నీళ్ళు పల్ల మెరుగు నిజం దేముడెరుగు! మనకెందుకీ నడాన.

గంగి :- నిజం గూడ శారుల్లుంటారు. గొంతు నులిమేత్తారు బాబోయ్!

రంగి :- పాముమ్మ మా సెడ్డది

(నేపథ్యమున రోదనధ్వనులు)

యాందిరా గంగులూ! గోల

గంగి :- యేంటుంటుంది, రాజు గోరింటి కాడి గోల! ఒకటే గీగా.

రంగి :- రాజు గోరేడుత్తున్నాడు రోయ్! ఇను ఇను!

(నేపథ్యమున)

సీ॥ పల్లకీ యెత్తరా పలనాటి లక్ష్మికి
పతితోడి తడసారి పయనమునకు
పసుపు కుంకుమ తోడి పచ్చి ముత్తైదువ
పసుపాడ నిచ్చిరా పసడు లొలుక
కాటుక కన్నీరు కాగులు నిండారు
తుడుచు కో నీయరా తొంటేదల
చితిజేరు నందాక చెలులు తోడుండరా
ఏకాకి యగునె నా యేక పుత్రి
మగని శవము తోనె మంటలలోనికి _
తోత్రియుడు రొకొ? సంప్రదాయ మిద్ది
తప్పు గూడని దటె! దగ్ధమైపోవునే
పేరు మాసి తల్లి పేరమాంబ,

గంగి :- పాపం! పేరమ్మదేయి సాగమనం సేయాలి కామోసు! యెంత గోరం! నిండు పాణి మంటల్లోమాడి, కాలి బూడిదై పోతుంది కామాలి!

రంగి :- అది సూడరా గంగులూ! యీరంగమేత్తున్నారు, పేరమ్మగోరిని వల్లకీమీన మోసుకొత్తుండారు. యెనకసూడు యెనక, బండెడు పొసుపు! బండెడు కుంకం! అయిగయిగో! గందంసెక్కలు బండిమీ నొత్తున్నాయి.

గంగి :- యిది సూడలేంరా రంగులూ! బంగారంలాంటి ఆ అమ్మగోరు నుప్పుల్లో దూకి సిటసిటాకాలి నుస్సైపోతుంటే నాను సూడలేనురా రంగులు! నాను రా నాడకి. నువ్వుపో.

రంగి :- వోరిగంగులూ! నా యెనకాల రారోసి! నా బుజం వట్టుకొనుండు! నీ కేం బయంలే యిట్టాంటిది యిగెప్పుడు సూత్తాం.

గంగి :- అది గద్దో! పేరమ్మదేయి సాగమనానికి సాగివొత్తుందామె. యెనక మారాజు నలగాముఅంగోరు కళ్ల నీళ్ళు తుడుచుకొంటు యేడ్పు ముద్దగా వొత్తున్నాడు.

రంగి :- వొరద్గోరోయ్‌గంగులు! ఆయెన యెనుకనే పాపమ్మతల్లి వొత్తుంది రోయ్!

గంగి :- అదుగడ్డోరోయ్ రంగులూ! ఆయెనకనే సూడు నరసింగయ్య కల్లబొల్లి యేడుపు మొగంతో వొత్తున్నాడు. యింకోరోరో బందుగు లొత్తున్నారు.

రంగి :- అటు సూడరోయ్ గంగులూ! మహారాణిగోరు! అబ్బా సూడ!లేంరా ఆ అమ్మని. తీరా కూతురు నిప్పులో దూకి కాలి పోతుంటే అతల్లి సూచి బ్రతుకు తుందాంట!

గంగి :- గుండెల్లో జల్లుమంటుంది నాను సూడలేనీ దుశ్శ్యం.

రంగి :- వోరేయ్‌గంగులూ! నీగ్గాని భయమేత్తుంటే నాబుజంపట్టుకొని సిన్నంగా రా-

(అట్లునడచిపోదురు)

(తెరవడును)

## పేరిందేవి సహగమనము

దృశ్యము : గురిజాల శ్మశానము

(నేపథ్యమున విషాద వీణాస్వరంతో)

సీ॥ రాజ్యలోభులదెంత రాకాసిగుండెయో
అల్లుని ప్రాణాలె ఆర్పినారు
వంచనాపరులేమి యెంచిరో? కూతురి
పసుపు కుంకుమ కీడు పఱచినారు
కుట్రదారులదెంత కుచ్చితపు తనంబొ?
నమ్మినరాజునే కృమ్మినారు
స్వార్థపరులదేటి పథకమో? పలనాటి
పసిడిగద్దియకెత్తు వైచినారు
రాణి యెదమీద - కుంపటి రగులజేసి
కడుపు శోకపు నీళులు కాచినారు
పాయసాన్నపు యవ్వంపు బంతిలోన
పాడునెత్తురు లిడినారు! పాపమతులు!

నలగామ !- (ప్రవేశము) (పొంగిపొరలు దుఃఖముతో కుంగిపోవుచు)

సీ॥ పలనాటిరాజ్యవు పసిడిగద్దియమీద
ఏలికసానియై యెక్కనంటి
కూతురేయైనను కొడుకుగా భావించి
గగనాన మేడలు గట్టుచుంటి
అసమాన బలశాలి అలరాజునకు - కుల
మెక్కించు కోరిక నిచ్చుకొంటి
నలగామరాజేంద్రు కులమేడు తరములు
తరియించు నంచును తలచియుంటి
అనుగురాయని ముద్దుల మనుమరాలు
మైలమాదేవి మా తల్లి మారురూపు
నాదు తనయ నిప్పులలోన బూదిగాగ -
చూడగానుంటి! నేనెంత గోడుగంటి!

సీ॥ నను గన్నతల్లి రత్నాలపేరిందేవి
లేని పల్నాడింక లేదు నాకు
నా రాజ్యమునకు – పునాది నాదు దుహిత
లేని రాజ్యంబింకలేదు నాకు
నా కోరికల మార్కు నకు పాదు పుత్రిక
లేని కోరిక యిక లేదు నాకు
నా ప్రాణమునకు ప్రాణమ్ము రత్నాలమ్మ
లేని జీవిత మింక లేదు నాకు
ఎవరికోసమింక – ఈ రాజ్యవిస్తృతి
ఏకపుత్రిగూడ – యేగు దివికి
ఏమి చూచుకొనుచు – ఏను జీవించెద
ఎటుల బ్రతుకువాడ – ఇంకమీద.

నాయ :– (ప్రవేశము) మహారాజా! దుఃఖింపకు! ధైర్యమవలంబించి కర్తవ్యమూహించు! పోవువారితో మనము పోలేముగదా. శోకాలే రూపుతాల్చి నట్లయినావు. ఎంత యేడ్చిన ఏమి ఫలము? భావి పల్నాటి రాజ్యప్రతినిధి అలరాజిట్లయి పోవునని ఎవ్వరనుకొనినారు? సర్వము దైవ ప్రేరణ! మనమూరక నిమిత్తమాత్రులము. పలనాటి రాజ్యపు బంగారుపీర మెక్కవలసిన అదృష్టలక్ష్మి పేరమాదేవి చితాగ్ని జ్వాలల్లో బూదిగా బోవుచున్నది. ఆమె సహగమన మనివార్యము! అదృష్టరేఖలు చెరగి పోయినవి! ఎవరేమి చేయుదురు. ఏజన్మలోనో తండ్రి పుత్రికల కెడజేసియుందువు. అది యీ జన్మలో ఇట్లంటుకొన్నది ప్రారబ్దమెవరు తప్పింతురు? దుఃఖము దిగమ్రింగుకొని స్థైర్యముగ నుండుము, ధైర్యమ అవలంబింపుము! ఊరడిల్లుము మహారాజా! కంటితడి తుడుచుకో ప్రభూ!

నర – (ప్రవేశము) అన్నగారి దుఃఖము చూడలేకున్నాను నాగాంబా! తండ్రిపోయినప్పుడైన మా కిట్లనిపించలేదు. పలనాటిరాజ్య సర్వస్వముగా భావించిన రత్నాలదేవి సహగమన మెవ్వరూహింపలేదు గదా నాగమదేవీ! ఆమె పసుపు కుంకుమలు పాడైనవి. ఆమె వల్లపూసల సౌరు నట్టేటిలో గలసిపోయినది. ఆమె గాజు మట్టెల శోభ వట్టిపోయినది. మేమీ దుఃఖమెట్లు మఱతుము మహామంత్రిణీ!

**పేర 1**- (సహగమనాను రూప వేషముతో - ప్రవేశము) నాన్నా! నమస్కారము! నా తుది మ్రొక్కిది. నేనిక నీ కగపడను నాన్నా! ఈ దృశ్యమాన ప్రపంచములో నేనదృశ్యను కాబోవుచున్నాను నాపతి దైవము దేవలోకమున నాకై యెదురు చూచుచుండును. భౌతిక జీవిత మెల్ల ఎడబాటులతోనే గడచిపోయినది. పారలౌకిక జీవిత మెడబాటుల తోనేల? నా భర్తృకళేబరముతో గందపు చెక్కలు పేర్చిన చితిలో దూకి, భౌతిక దేహము త్యజించి, దివ్యదేహముతో దివియందు నా దేవుని గలిసి కొందును. నా శరీరపు చితా భస్మ రేణువులెన్ని సంఖ్యలనుండునో అన్ని దివ్యవర్షములు దివ్య సుఖములు మేమను భవింతుము నాకై మీరెవ్వరూ దుఃఖింపవద్దు. తెలుగునాట పలనాటి చరిత్రలో మా దంపతుల జీవిత ఘట్టము విషాద వీణాతంత్రులు మీటినది. అది చదువుకొని పాఠకు అశ్రు సిక్త నయనులయ్యెదరు. వారి సానుభూతి మాకు దివ్యానుభూతి! స్వార్థపరుల దురాశాభూతానికి మాదంపతుల బలి. రాజ్యలోభుల రాతిగుండెలు మా అసువుల కెసరు పెట్టినవి! మాకు గాకుండ తామే బావుకొన వలయునని పాపాలకు పాల్పడిన ఆ కులపాంసనులకు, ఆ వంచకులకు, ఆ కుట్రదారులకు, ఈ రాజ్యము దక్కదు-దక్కదు. దక్కదు పలనాటిరాజ్య మాసించిన ప్రలోభులకు ప్రేత రాజ్యము తప్పదు - తప్పదు - తప్పదు. సతీ శాపాక్షరాలకు వంశనాశనమై పోవుదురుగాక! ఆరని నా యెదలోని, సొదచే అణగారి హతమై పోవుదురు గాక! నాగాంబా! మహామంత్రిణీ! నీకు నా వందనములమ్మా! చిననాన్నా! నరసింగరాజా! నీకు నా నమస్కారములయ్యా? తండ్రీ! నన్ను మఱచిపో. ఇక సెలవు. (వెళ్లును)

(నేపథ్యమున విషాద ద్విపద గానము)

పతిదేవతామణీ! వరపుణ్యశీల!
నుతమతీ! గుణవతీ! కృతమహాసుకృతి!
చందమామనుగూడి శశిరేఖబోలె
అందాల మొయిలుతో - అమిరించు రీతి
చితిదూకి బూదిగాజేసి నీ తనువు
పతి తోడ గమియించు స్వర్గంపు దెరువు

పసుపు కుంకుమతోడి వచ్చి ముత్తైదు!
పసమించు నీ బొట్టు పాడు గాదమ్మ!
తుడుచుకో మా తల్లి! తుడుచుకో కనులు
ముడుచుకో కీల్మడి ముద్దుగా కురులు
చిన్నారి చేర్చుక్క - చెడిగిపో నీకు
కమ్మల కాటుక కడిగిపో నీకు
కాళ్ల మట్టెల శోభ కళ హెచ్చు నీకు
నల్లపూసలపేరు నాజూకు నీకు
తాటంకయుగళంబు ధగ ధగ మెఱయు
గాటంపు జులు గల గల మెఱయు
చితి దూకుచుంటివి క్షితిలోన నిన్ను
పతి యెవ్వరే తల్లి! పతిభక్తశీల!
భౌతికంబుగ సౌఖ్యపడలేదు నీవు
నాతిరో! పొందవే! నాకసౌఖ్యంబు
తెలుగమ్మ నిన్ను జూచి పులకించిపోవు
తెలుగుజాతికి నీవు దివ్యదీపికవు
మంగళంబగుత! సుమంగళీ! నీకు
మంగళంబో మంగళాంగీ! శుభాంగి!!

(తెరలో హాహాకారములు)

పేల :- పోయినది! నా తల్లి చితాగ్నిలో బుగ్గయైపోయినది. (దుఃఖించును)

రాయ.- నరసింగరాజా! మహారాజుగారినిపట్టుకొను! పాపము! కన్నకడుపు గదా! పేరమాదేవి అగ్నిగుండమున దూకినది. ఆ దృశ్యము మహారాజుచూడలేదు అదిగో! మూర్ఛవచ్చుచున్నట్లున్నది పట్టుకో! నేను మహారాణి దగ్గరకు బోయెద. (వెళ్లును)

పర :- ఊరడిల్లుము మన్నయ్యా! అమ్మాయి మహాపుణ్యాత్మురాలు! భౌతిక సుఖము అశాశ్వతములని భర్తతో దేవలోకమున శాశ్వతసుఖ సామ్రాజ్యములేలబోవుచున్నది ఈమె మూలమున పుట్టినింటివైపు, మెట్టినింటివైపు ఏడేడు పదునాల్గు తరాలవారూ తరింతురు ఆమె చనిపోయినను పలనాడేమి, మన తెలుగు నాడెల్ల పాతివ్రత్యసంధ్యల చిరస్మరణీయయగును.

నల :- తమ్ముడా! నరసింగరాజా! ఎవరు పుణ్యము గట్టుకొనిరో కాని అల్లుని హత్యచేసి నా ఒక్కగానొక్క కూతురిని నిప్పుల పాలు చేసినారు పేరిందేవి పోవుటతో నా సర్వస్వమూ పోయినది

మ॥ అకటా! నా తరువాత రాజయి సముద్యల్లీల - పల్నాటి నే
లుకొనంజాలినవాడు నాయనగుటల్లుండీల్గె - అయ్యేక పు
త్రిక కుండాగ్నుల బుగ్గిలోగలిసె - ఏరింజూచు కొంచీధరన్
పరికట వ్రికిృయి నేలువాడ? ఇకనేలా రాజ్యమున్ గీజ్యమున్.

నర :- అన్నయ్యా! ఇక్కడెండగా నున్నది. ఆ చెట్టు క్రిందికి పోదము పద.

నల :- పేరిందేవి పేరంటాండ్రిలో గలిసిపోయినది. నా నెత్తిపై గొడుగే పోయినది. నిలువ నీడలేదు. ఇక చెట్టునీడయేగతి! (వెళ్లుదురు)

(నేపథ్యమున శాంతిపారము)

ఆ॥ వె॥ పూల విసము పెట్టి పొలియించినారుగా
రాచమల్లునకట! రాజ్యతృష్ణ
అతని ఆత్మశాంతి యగునేమొ రేపు యు
ద్ధమున వీరరక్త తర్పణమున

(తెరపడును)



# పలనాటి వీరభారతము

## వీరపతనము

### యుద్ధనిశ్చయము

దృశ్యము : వీరమేడపిలో తగిన ఆసనములపై

మలిదేవరాజు, బ్రహ్మనాయుడు, గండుకన్నమనీడు, కన్నమదాసు

మలి .- (నిర్విణ్ణతాస్థితి) ఎట్టి అవాంఛనీయస్థితి! రాయబారిగా బోయిన రాచమల్లిట్లు దుర్మరణము పాలగునని ఊహింపమైతిమిగదా!

బ్రహ్మ !- అల్లుడుగదా! అతడు చెప్పిన విందురని ఆశించినాము. అసువులు తీయుటకే పాల్పడినారు చివరకి

గండు :- రాజ్యలోభ మెట్టి రాక్షసత్వమునకు పాల్పఱచినది!

మలి :- పాపము! కొమ్మరాజు బావ అలరాయని రాయబారిగా బంపుట కెంతో అనుమానించినాడు.

బ్రహ్మ .- ఎంతో నచ్చజెప్పి కుమారుని బంపుట కొప్పించితిమి. కొమ్మన్ననీ.

మలి !- ఈ హత్యాకాండ నలగాములకు దెలియునందురా?

బ్రహ్మ :- తెలిసియుండదు. లోకమున ఏ మామయైన అల్లుని జంపుకొనునా? నలగామునకు పుత్రసంతానము లేవందున, పుత్రుడైనను పుత్రికయైనను ఆ రత్నాలపేరిందేవియే తన తరువాత ఆమెనే పలనాటి సింహాసనమునకు మహారాజ్ఞిగా జేయువలయునని తహ తహ అప్పుడలరాజు రాజ ప్రతినిధి ఇవి ఆయన హృదయ మాగాణమున అంకురించిన భావాంకురాలు వాటికే ఆలవాలములు సవరించి, తీగెలు పారించి, నవలు తొడిగించుటకెంతో ప్రోదిచేసి కొనుచున్నాడు ఇది, ఆయన ఆత్మగతమైన మధురభావాల పడుగు పేకల అల్లిక ఆ అల్లికల వల్లిక లిట్లు త్రెంపివేసినారు దుర్మార్గులు.

మలి :- నలగాముని తరువాత పలనాటి రాజ్యాధికారము నరసింగునకు కట్టి పెట్టవలయునని వానిని ఆశాసౌధముల కెక్కించుచున్నది గదా! నాగమ్మ.

బ్రహ్మ !- గురిజాలలో ఇట్టివిషభావము లుత్పన్నము లగుటకే నాగమ్మయే కారణము. నలగాముని ఆత్మగత విషయము పసికట్టి. అలరాజు

నంత మొందించిన పేరమాంబయున్ను పెనిమిటితో సహగమించి కట్టెబొగ్గుపాలో బుగ్గియై పోవును నలసింగునకు రాజ్యాధికారము దక్కునని యింతచేసినది

మలి!- పాపము! పేరమాంబ మంటలలో మాడి పోయినది గదా!

ఉ॥ అన్న కొమార్తె యంచు అధి కాధికమౌ అనురాగమాధురీ
స్విన్నత ఎత్తి పెంచితిమి చేతులలోన! చితాగ్నులందునన్
మన్నయి పోయెనే అకట! మాయలమారిది నాగసాని తా
నిన్ని- అనర్థకంబులకు హేతువుగా నిటు దాపురించెనే!

కన్న!- నాయకురాలి కుటిలతంత్రము వింటిరా? అలరాజు నిట్లు చెర్లగుడి పొడున మనమే చంపితిమని మనపై అభాండము కల్పించినది.

బ్రహ్మ:- అభాండములకేమిలే పలనాటి మనపై ఈసెక్కించుట కిదంతా. అలరాజు హత్యానిర్ధయునకు లోకము లేదా!

మలి:- కన్నమదాసూ! చెర్లగుడిపొడున అలరాజు హత్యాసంఘటన జరుగు నప్పుడు నీ వక్కడుండియుండవు

కన్న:- ఉండిన ఇది జరుగునా ప్రభూ! నన్ను గుఱ్ఱములకు నీళ్లు త్రాగింపుమని అలరాజు, తానొక చెట్టు నీడను గూర్చుండినాడు,

మలి:- ఆ వ్యవధిలో ఇది జరిగియుండును?

బ్రహ్మ:- దీనిని బట్టిచూడ ఎవరో యీపనికి అక్కడ కాచుకొని యున్నట్లు తోచుచున్నది

మలి!- కన్నదాసు నీవు గుఱ్ఱములకు నీళ్లుత్రాగించి వచ్చునప్పటికే అలరాజు హతుడై యుండెనా?

కన్న:- హతుడు కాలేదు కాని. హతుడు కానై యుండి, "కన్నమదాసూ! కన్నమదాసూ" అని బిగ్గరగా అఱచినాడు ఆ అఱపున కదిలివడి ఒక్కపరుగున పోతిని, నే పోవునప్పటికే అలరాజు సోలుచు నేలపై బడిపోవుచున్నాడు అప్పుడు చేతులతో తిన్నగా పరుండజెట్టితిని. తనకు, విషప్రయోగము జరిగినదని, అక్కడనే పడియున్న ఒక పూవును చూపి, వాసన చూచి యిట యితినని చెప్పినాడు

మలి!- ఆ పూవులోవిషము పెట్టినదికాబోలు! ఆ పూవెట్లువచ్చినదో?

కన్న:- ఆ ప్రశ్న అలరాజు గారిని వేసితిని, "ఎవరో, అపరిచితవ్యక్తివచ్చి మా తండ్రి గారికి పరిచితుడనని, ఏవేవో గాధలు త్రవ్వి, కానుకగా, ఆ పూవిచ్చిపోయినా"డని చెప్పినాడు.

బ్రహ్మ:- ఎంతపని జరిగినది! వాడెవడోకాదు నాగాంబ పంపినవాడు. రాయబారము కుదరకుండ జేయుటయే గాక, రాచమల్లు నిట్లుపొట్టను బెట్టుకొన్నది.

మలి:- స్వార్థపరుల రాజ్య ప్రలోభమునకు అలరాజు, ప్రతిబంధకముగ నున్నాడు కాబోలు!

బ్రహ్మ :- చెప్పలేదా? మలిదేవా! అలరాజు హత్యతో పేరమాంబ సహగమించుననీ అవిచ్ఛిన్నముగా పలనాటి రాజ్యాధికారము నరసింగునకే సంక్రమింపజేయవలయుననీ, నాగాంబ కడుపులో కుట్రలు గూడు కట్టికొన్నవని

గండు :- ఈ హత్యాకాండ గురిజాలలోనే జరుగవలసినది. కాని. అక్కడ జరిగినచో మన మీద బెట్టుటకు వీలుండదు ఏమయినను, నాగాంబ రాజుగార అల్లుని జంపించి, రాజ తనూజను వెంటలపాలు జేసినది గదా! ఎంత రాజద్రోహమిది?

మలి :- నాగమ్మ, పేరమ్మపై యీసుగలది.

బ్రహ్మ:- అవును తన మంత్రిత్వాధికారమును ఆమె యీసడించునదిగదా!

గండు :- ఆ చితాగ్ని జ్వాలాజాలలలో పేరమాంబ మాడి మసియగుచుండగా చూచినగాని నాగమ్మ కన్నులు చల్లబడలేదు కాబోలు!

మలి :- నాగాంబ హృదయమెంత శిలాసదృశ్యము! తోడి ఆడుది బూడిద కాగోరినదే!

బ్రహ్మ :- కన్నమదాసూ! తరువాత ఏమి జరిగినదో చెప్పవైతివి.

కన్న :- కత్తిదూసి, అలగాజున కా వూవిచ్చిన దుర్మార్గుడెవడో చీల్చి వేయవలయు ననుకొంటినిగాని, "వాడప్పుడే పోయినాడు నీకు దొరక"డని చెప్పినా డలరాజు

బ్రహ్మ :- లంచమున కాశించి, ఆ దుర్మార్గుడీ పాపమున కొడిగట్టినాడు కాని, వాడు మాత్రము బ్రతికియుండుననియా?

గండు :- బ్రతికి యుండిన రహస్యము బయటపడుననీ, నాగాంబ, వాని తల తీసివేసియే యుండును.

మలి :- తరువాత చెప్పుము కన్నమదాసూ!

కన్న :- ఇది యంతయు నా యేమరిపాటు వల్ల జరిగినదని, నా పరిమత్తతకు తిట్టుకొనుచు, ఆ దూసిన కత్తితో పొడుచుకొని చావవలయు ననుకొంటిని.

మలి :- ఆఁ అదేమి పని కన్నమదాసూ!

కన్న :- అలరాజు, ఆనలు పెట్టి, అది జరుగకుండ జేసినాడు. కాని, లేకున్న నేను గూడ మీకు కనపడకుండ పోయెడివాడను ప్రభూ!

బ్రహ్మ :- నాయనా కన్నమదాసూ! అలరాజునకు జరిగిన దుస్సంఘటనచే అట్లనే అనిపించును కాని, చచ్చి సాధించునదేమున్నది? తరువాత చెప్పుము! అలరాజేమైన చెప్పెనా?

కన్న :- చెప్పినాడు. మరణవేదనతో ఊపిరి బిగబట్టుకొని, చెప్పవలసిన దెల్ల చెప్పినాడు

మలి :- ఏమి చెప్పినాడు? చెప్పు దాసూ! చెప్పు!

కన్న :- ఏమి చెప్పుదును ప్రభూ! గొంతు బొంగురుపడుచున్నది. (పొర్లి వచ్చు దుఃఖమును మ్రింగుకొనుచు)

సీ॥ రాయబారము కుదరకపోయెనంచు మీ
యెల్లరితో వచియింపుమనియె
నాగమ్మ వల్ల తనకయిన దుస్థితి
తప్పక మీ తోడ జెప్పుమనియె
కన్నతండ్రి దలచి కన్నీళ్లు గార్చుచు
ఇవె తుది మ్రొక్కులందీయుమనియె
నా బిరుదులివెల్ల నను బావయని కల్వ
రించు ఐతమ పట్టి కీయుమనియె
ఆజి వీరిగెడపి అలరాజు పగను
తీర్పుడని మరి మరి మీకు దెల్పుమనియె
తల్లి చెల్లమ్మ దలపోసి గొల్లుమనియె
పేరమాంబ దలచుకొనుచు భోరుమనియె.

శివస్మరణముతో చివరి శ్వాస విడిచినాడు

బ్రహ్మ :- శివభక్తులకది మహాప్రస్థాన సమయోచితము!

మలి :- (కన్నులు తుడుచుకొనుచు) హృదయ విదారకముగనున్నది అలరాజు చావు!

బ్రహ్మ :- పలనాటి రాజ్యపతనమునకిది గొడ్డలిపెట్టు! అలరాజు హత్యా సంఘటనము! అశనిపాతము!

సీ॥ కట్టెబొగ్గులకని కల్పవృక్షమ్మును
గొడ్డలితో - కొట్టుకొన్నయట్లు
ఆరగింపగబోవు - అమృతభాండంబును
కోరి బ్రద్దలుచేసి కొన్నయట్లు
వసదుగా గట్టిన బంగరు మేడను
స్వయముగా - అగ్గిపాల్సలిపినట్లు
శ్రమియించి నేసిన సన్న దువ్వలువను
కణిక నిప్పుల మూటగట్టినట్లు
భావి పలనాటి రాజ్యపు ప్రతినిధియగు
రాజు నల్లురి జంపిరి రాచమల్లు
రాజ్యలోభపు కైపు కన్నాక్రమికొనగ
పాప మతు లెంతటి పనికి పాలుపడిరి!

గండు :- కొమ్మరాజు, కొడుకు దుర్మరణవార్త వినగనే, కుప్పగూలి పోయి నాడు. తన దురదృష్టమునకు గుండెలు బాదుకొనుచు రోదించినాడు. పాపము! రాజ్యము పోయిన దానికితోడు కొడుకు కూడ పోయినాడు గదా!

మలి :- అలరాజు దుర్మరణమునకు దుఃఖమాపు కోలేకున్నాను.

గీ॥ రాజ్యమడుగుట కని పోయి రాచమల్లు
డిట్టి, దుర్మృతి పాలయ్యెనే? కట కట!
కొమ్మరాజు మోమెటు చూతు-కమిలిపోవు
చెల్లమాదేవి కేమని చెప్పుదుమిక.

బ్రహ్మ :- అలరాజు తల్లి దండ్రుల నోదార్పుట కష్టముగా నున్నది. వారికి మా బాలచంద్రుని ఇల్లడగా - ఇచ్చుచున్నానని సభాముఖమున వెల్లడి చేయుచున్నాను మలిదేవా!

మలి :- అదుగో! కొమ్మరాజు! అలరాజు మరణమునకేడ్చి యేడ్చి, ఏడ్పు దిగద్రావి - కోపముతో - దుర్మార్గుల నఱుకుదునని పలుకుచు వచ్చుచున్నాడు

(కొమ్మరాజు తెరలోనుండి)

శా॥ సింహంబెట్లు క్రుధా క్షుధావ్యధితమై చీల్చున్ మదేభంబులన్
రంహ స్ఫూర్తిని, ఘోర సంగరమునన్ లంఘించి నేనట్టులే
సంహారక్రియ చూపువాడను సురల్ సంభ్రాంతులై చూడగా
అంహ స్స్వాంతుల జీల్చివేయుదు-ఎవండడ్డంబు నా దారిలో

(కత్తి దూసి పరవళ్ళు త్రొక్కుచుండును)

మలి :- బావా! శాంతింపుము శాంతింపుము! ఇది యుద్ధభూమి కాదు.

బ్రహ్మ :- బొమ్మరాజా! నీ ఖడ్గముపసంహరించి ఇటువచ్చి కూర్చుండుము.

బొమ్మ - ఇంకా యుద్ధనిర్ణయము కాలేదా? బ్రహ్మనా? అలరాజు పగదీర్చు కొనుటకు యుద్ధమున కేగుట దెప్పుడిక?

మలి - ఇప్పుడే బావా! అలరాజు పగ తీర్పకె ట్లుందుము!

బ్రహ్మ :- పలనాటి పాపపర్వతము బ్రద్దలైనది కన్నమదాసూ! యుద్ధమునకు సేనా సమీకరణము!

కన్న - సర్వము సంసిద్ధము. యుద్ధమెప్పుడాయని ఎదురు చూచుచున్నారు వీరులు కత్తులు నూరుచున్నారు - కత్తులు తీయుటకు కోరిక పడుచున్నారు. యుద్ధ ముహూర్తమున కెదురుచూచుచున్నారు. పలనాటి ప్రళయమునకొక ధూమకేతువుగా దాపురించిన నాయకురాలి నాగమ్మపై కసి పట్టలేకున్నారు దేశప్రజలు. ఆ పంపు నామ దేయుపై నా కరవాల గారుడము ఔత్కుల్లార్చుచున్నది

గీ॥ ఆడుదానిని - చంప మీ రాజ్ఞయిడరు
కాని, నాగాంబ తల దీసి కత్తి మొనకు
గ్రుచ్చి కొంచు ఊరేగనే? తెచ్చి మీ ప
దాల ముందుంచనే? గురుదక్షిణగను.

గంధ :- నీ వెంతకైన సమర్థుడవు కన్నమదాసూ! ఈ యుద్ధమున సర్వసేనా నాయకత్వము నీదే. నేను పెద్దవాడనయితిని. వెనుకటి వలె నిర్వహింపలేను.

బ్రహ్మ :- కన్నమనీడు బావా! నీ సమ్మతిపై అట్లనే చేయుదుము. మలిదేవా! కన్నమదాసు ప్రధాన సేనా నాయకుడుగా - కన్నమనీడుప సేనా నాయకుడుగా నుండును.

మలి :- అట్లనే మహామంత్రీ!

బ్రహ్మ :- రక్తపాత మొప్పుకొనని వారికి రణము తప్పలేదు. పలనాటి దేశమునకు రక్త తర్పణము జరుగ వలయును కాబోలు! రేపే రేపు ఏలువాత రణప్రస్థానము! కార్యము పూడి కదన భూమికి సేనలతో తరలి పోదము. కన్నమదాసూ! నిన్ను రణవిద్యలో నాయంత వానిగా జేసితిని. అది లోకమునకు జూప వలసిన తరుణమిది.

కన్న :- ఉబ్బొంగి పోవుచున్నాను.

ఉ॥ నన్నొక మాలవానిని జనంబులు మెచ్చగ - చేరదీసి మీ
కన్న కుమారు చందమున గౌరవమొప్పగ బెంచి విద్దెలో
మిన్నగ జేసినందులకు మీ యశముల్ దిశ లెల్ల బ్రాకగా
నన్నిడి కొందు నర్పణగ నా దొరకున్ గురుదేవు లానతిన్.

బ్రహ్మ :- మలిదేవా! మాయన్న బాదన్నకు, మనమిత్రరాజు లందరికీ
నేడే కార్యముపూడికి సేనలతో తోడ్పడ రండని ఆహ్వానము
లంపుము

మలి :- అట్లనే. మహామంత్రీ!

(తెరపడును)

## ఐతమ్మ : కల

దృశ్యము ! ఐతమ్మమందిరము
ప్రవేశము! ఐతమాంబ కూర్చొని ఏదో ధ్యానముగ

ఐత! - చం॥ ప్రళయమిదేమొ ముంచుకొని వచ్చె - ఇదెంతటి దుర్నివారమో
దళములతోడ నాయకులు తర్లిరి కత్తులదూసి, వీర ని
ర్దళనముతో - త్రిలింగభువి రక్తనదుల్ ప్రవహింపజేతువా?
కళవళమేల పెట్టెదవు కావుము దేశము చెన్నకేశవా!

వీరమేడపిలో వీరులుగా పనికివచ్చు మగవాళ్లందరూ
కారెముపూడి కదనానికి కదలిపోయినారు. "నలగురన్నదమ్ము
లకు బాలచంద్రుడొక్కడు, శీలమువారివంశాంకురము. వానికి
యుద్ధముసంగతి తెలియనీవద్దు"ని, ఆయనచెప్పిపోయినాడు అదెట్లు
సాధ్యమో తెలియకన్నది. రాత్రి నిద్దురపట్టనేలేదు. ఏదో కునుకుపట్టి
నది. ఏదో కల! అదెట్టి పాడుకల' యుద్ధభూతము! భయంకర ప్రళ
యనాట్యము' ఆమె యినుపపాదాలక్రింద - ఎందరో వీరులు, వీరా
ధివీరులు, యోధులు, యోధానుయోధులు, నలి నలియైనజ్జు నజ్జయి
పోవుచున్నారు. దీర్ఘజిహ్వతో రక్తముత్రాగుచున్నది. ఆమెరక్తదా
హమారలేదు మా బాలనాయునిగూడ ఆహరింతుననుచున్నది. ఆ
మహాభూతానికి వాని బలికానీరాదు. వాడు, మాకొక్కగానొక్కడు,

ఎన్నో నోములు నోచి, చెట్టుకు పుట్టకు మొక్కి, మా చెర్ల చెన్నయ్య అనుగ్రహాన కన్నబిడ్డవాడు ఈ మహా మారణాధ్వరములో వాని నాహుతి కానీయను కడుపుతీపి మాట అటుంచి, వంశాంకురమును నిలబెట్టుకొనుట వాంఛనీయము! ఈ విషయమున లోకులు నన్ను పార్థము చేసికొందురు! ఒడిపోసుకొందురు!

(తెరలో) అమ్మా- అమ్మా-

ఎవరు? మా బాలచంద్రుడే

బాల :- (పరుగునవచ్చి మోకాళ్లమీదవంగి) అమ్మా! నన్ను దీవించు!

అయిత :- (గాబరాగ) అబ్బాయి! ఏమిటిది? ఎందుకిప్పుడు దీవెన?

బాల :- క్షమించు తల్లీ! ఇంతకాలము నా కన్నులకు గంతకట్టినట్లయినది అజ్ఞానాంధకారములో అక్షినిమీలనమైనది ఇప్పుడు నా కన్నులు విచ్చినవి. నాకామె వెలుగుబాట చూపినది.

అయిత :- ఎవరామె? ఏమి వెలుగుబాట?

బాల :- కోమటి అన్నమ్మ నాకు జ్ఞానోదయ మొనర్చినదమ్మా! అది సుప్త జాతికి అరుణోదయము! నన్ను దీవించి యుద్ధానికిబంపమ్మా!

అయిత :- (గుండె గుభేలుమన) ఏమి యుద్ధమురా నాయనా? ఎక్కడ యుద్ధము? ఎవరితోరా యుద్ధము?

బాల :- ఇంకను దాచిపెట్టెదవేలమ్మా, కారెముపూడి యుద్ధము సంగతి నాకు తెలియకుండ జేసినారు. వీరమేడపిలో మొలతాడున్న మగవాడెల్ల సేనాపతి కన్నమదాసు పిలుపందుకొని, సైన్యముతో గలసిపోయినాడట! బొంగరాలవాడు సంగరాలకేలయని నాకు, నా వీర సోదరులకు వీరతాంబూలమైన పంపలేదు.

అయిత :- ఇదంతా నీ కెవరు చెప్పినారురా?

బాల :- అన్నమ్మయే చెప్పినది, కాఱు చీకటిలో కొట్టుకొను నా కామె గురువుగా కర్తవ్యోపదేశ మొనర్చినది. నాకు జ్ఞానోదయమైనదమ్మా! రేపు సూర్యోదయమునకే నేనూ, నా సహచరులూ కారెముపూడి చేరాలి. దీవించి నన్ను పంపమ్మా!

అయిత :- అర్భకుడవు నీ కెందుకురా యుద్ధము?

బాల :- నీవన్నట్లు అర్భకుడనే యింతదాక. ఇప్పుడు శత్రుగర్వ నిర్భేదకుడను

ఉ॥ అర్భకుడంచు - ఎంచదగునా? నను శాత్రవ కుంభిలోక సిం
హార్భకుడంచు - ఎంచక, రవంత అనుజ్ఞ ఒసంగితేని, ఆ
విర్భవకోపవహ్ని - అరివీరుల క్రమ్మగజేసి, నీవు నన్
గర్భభరంబు నోర్చుకొని కన్న ఋణంబును తీర్చెదంగదే!

అయి !- వద్దురా యనా! నీకు యుద్ధమువద్దు. యుద్ధము మహాభయం
కరము!

బాల :- ఇదేమిటమ్మా! నీవు నాకు చెప్పవలసిన దిదేనా? మాతృదాస్య
విముక్తికి, దేవతలజయించి అమృతము తేబోవు గరుత్మంతుని వినత
దీవించి పంపినట్లు నన్ను దీవించి పంపవలసిన దానవు, నీ విట్లను
చుంటి వేమమ్మా!

అయిత,- (స్వగతము) ఇప్పుడేమిచేయుదును? నాకేమీ పాలుపోవుటలేదు?

చం॥ కులమున కొక్కడే కొడుకు - కోరిన కోర్కెలు, నోచినట్టి నో
ములు ఫలియించి పిడొకడు పుట్టెను మా, కొకగాని ఒక్క యీ
నలుసును గూడ మిత్తికిపనా కదనాలకు బంపి; యేమనన్
వలయును వాడికత్తి మొనపై పడకల్గద వీరధర్మముల్.

బాల :- ఏదో ఆలోచించుచున్నావు? ఆలోచనలకిది అదనా తల్లీ!

అయిత!_ (తడబడుచు) పోనీ, అబ్బాయీ! ఇట్లుచేసికో! ఎవతె మధుర
స్నేహము నిన్ను వశగతుని జేసికొని, చిన్ననాడు తాళిగట్టిన
ముద్దుల మాంచాలను సైతము మఱపింపజేసినదో? ఆ సాని నబ్బా
యిని నీ యింటికే తెచ్చుకొని ఆమెతో విలాసముగా కాలముపుచ్చు?

బాల:- ఛీ ఛీ మరల ఆ రొంపిలో నన్ను దింపవలయు ననుకొన్న దేవుని
వల్లగూడకాదు ఇంతకాలముగ గ్రహము వలె పట్టుకొన్న ఆ వేశ్యా
గ్రహము అన్నమ్మ మంత్రముతో నన్ను వదిలిపోయినది. ఇప్పుడీ
చంద్రుడు తేజోనిస్తంద్రుడు, యశశ్చంద్రుడనై విశాలాంధ్రా
వనిలో వెలిగిపోగలడు చీకటి తెరపోయి నాకిదొక వెలుగుతెర.

అయి:- నాయనా బాలచంద్రా! నిన్ను మహావీరునిగా జేయవలయునని
మీ నాయన నీకెంతో పట్టుదలతో రణవిద్య నేర్ప జూచినాడు. కాని,
నీ వ్యాసంగములో అదినీకు సరిగా ఒంటబట్టలేదాయె. ఇప్పుడే
మంతమించిపోయినది? ఇంకను రణవిద్యలో బాగుగా ఆరితేరు! నీవు
యుద్ధాలుచేసి విజయాలు సాధించటానికి అవకాశాలు రావా?

బాల:- ఉడుకునెత్తురు పెల్లుబికి పోటు ఈ అవకాశము అన్నిప్పుడెల్ల వచ్చునా తల్లీ! ఇది వీరులకు మహావకాశము, విజయలక్ష్మీ కటాక్షము కోసము వీరులు తమ శౌర్య వీర్య ధైర్య సాహసాలనే అంకితము చేయుదురు. కీర్తికొఱకు మేన లొద్దుదురు, అహమహమికతో వీరులు ముందుకురుకు సమయమిది. ఈ సమయము మరి రాదమ్మా!

ఉ॥ కట్టడు వీడటంచు- అనుకోలవె ముందు తరాలలోన నీ
కట్టడి పేరునే తెలుగు కట్టడి చెప్పుకొనంగ- వైరులన్
గొట్టెదరీతి- కుత్తుకలు కోసియు గుట్టలువైతునమ్మ! నీ
వెట్టితనంబు మాని నను వేగమ దీవెనలిచ్చి పంపుమా!

అయిత:- ఇవి కట్టతనపుమాటలు కాక యుద్ధమున ఏమనుకొంటివిరా? పెండ్లి యనుకొంటివా?

బాల - యుద్ధము నిజముగా వీరులకు పెండ్లియేనమ్మా!

ఉ॥ పెండ్లికిబోవు నట్లయగు వీరులకున్ రణమన్న- ఇంటిలో
పెండ్లము సైతము న్విడిచిపెట్టి గమింతు జయాంగనామణిం
బెండ్లియొనర్చుకొంటకయి వీర కులోచితమిద్దియేగదే!
పెండ్లికి బంపునట్టులగ వేడుకతోడను నన్ను బంపవే!

అయి!-నీవు జయలక్ష్మితో తిరిగివచ్చిననాడు ఆ విజయోత్సవము నవలోకించి, ఆనంద బాష్పాలతో నిన్నభిషేకింతును. ఆ అదృష్టము ఐకెమ్మ కుండునా?

బాల:- శంకించుచున్నావా అమ్మా! నీ హృదయపూర్వకముగ నన్నాశీర్వదించిపంపు! విజయలక్ష్మితో తిరిగివచ్చి, తప్పక, నీ పాదాభివందనము చేసికొందును.

అయి!- యుద్ధము వీరులకు ప్రాణగొడ్డము రానాయనా! అది వీరులను గన్న తల్లులందరికి కడుపుకోత. ఈ మాయ యుద్ధము మాన్పవలయునని, రక్తపాతము రాకుండచేయువలయునని, మీ నాన్న శతవిధాల ప్రయత్నించినాడు సాధ్యము కాలేదు

బాల!- అలరాజుబావ హత్యతో యుద్ధమనివార్యమైనదమ్మా! అలరాజు తన బిరుదములెల్ల నాకే యిచ్చినాడు. ఆయన పగ తీర్చుటకు నరసింగుని తలతీయ ప్రతిజ్ఞపట్టినాడను. నా ప్రతిన చెల్లించుకొందునమ్మా!

అయి :- అమ్మయొయ్యో! నరసింగుని తల దీయుటయే! వానితో నీవు యుద్ధము చేయు పాటివాడవే?

బాల :- బ్రహ్మన్న భార్యవే! ఎందుకమ్మా నీ కింత భయము! నీ స్వభావము నా కర్థముకావటములేదు. లోకమున ఏ తల్లులైనా తమ సంతానము తామరతంపరగా విస్తరిల్లి భూమిమీద వేయికాలాలపాటు మనాలని కోరుకొందురు. వంశాభివృద్ధి యెవరికి వాంచనీయముకాదు?

బాల :- ఇవి సామాన్యుల వాంఛలు! వీరమాతలు కాగోరు ఏ తల్లులైనా తమ కన్న బిడ్డలను దేశ స్వాతంత్ర్యము కోసము త్యాగము చేయుదురు శరీరాలుపోయినా వారు కోరునది కీర్తి. అది ఆకల్పాంత సుస్థిరము.

అయి :- వీరమాత కావలయునను కోరిక నాకు మాత్రము లేకపోయినదా? పరిస్థితులు నన్ను త్యాగముపైపు మొగ్గనిచ్చుటలేదు. కాని కన్న సంతానము కత్తికోతలపాలు చేయుట? మధుర పుత్రప్రేమతో మనసు త్రొక్కిసలాట!

బాల :- మహామంత్రిగారి భార్యవుగా నీ వట్లనదగినదికాదు. ఏకైక పుత్రుడనని నన్నింటిలోనే ఉండమమచున్నావు. యుద్ధావసరమున ప్రభువాజ్ఞకు తమ ఏకైక పుత్రులను సైతము కదనరంగాని కంపిన కన్నతల్లులెందరుండరు? కొత్తకాపురపు తీరుతీయముల కొల్లలాడే కోడెకాండ్రెంతమంది యుద్ధాని కేగలేదు.

అయి :- ఈనగాచినక్కల పాలుజేసినట్లు కన్నకొడుకులను యుద్ధభూతము వాత పడవేయుచున్నారు. కట్టుకొన్న మగలను కత్తికెఱగావించుకొనుచున్నారు. కన్నకొడుకులనూ, కట్టుకొన్న మగలనూ కోల్పోయిన అనాధ స్త్రీల ఆక్రందనాలతో ఈ దేశమేమి కావలసియున్నదో?

బాల :- ఏమగును? పలనాటి వీరుల పౌరుష ప్రఖ్యాతులతో ఈ దేశ మితర దేశాలకు మకుటాయమానమగును. చరిత్రకారులు వీర జీవితములు స్వర్ణాక్షరాలతో ఉల్లేఖింతురు. కవులు, వీరగాధలు కావ్యాలు వ్రాయుదురు. డోలు కత్తుల ఝణ ఝణలతో, జోళ్ల ధణ ధణలతో పంబకతలవారు పల్లుకొఱుకు కొనుచు కతలు చెప్పుచుండ శ్రోతలు చెవులప్పగించి విందురు. వీరపూజలనాడు ముత్తైదువలు నీరాజనా

లిత్తురు. మనము పోయినా మన గాదలు తరతరాలుగా తెలుగునాట చెప్పుకొందురు

అయి :- నీ మనసిట్లు పరుగులు తీయుచున్నది. నా మన సట్లు తిరుగుడు పడుచున్నది. మానరాగి పుమతతో మనసు తొక్కిసలాడుచున్నది. మీ నాన్నలు పలుగురన్నదమ్ములకు నీవొక్కడవు. నీవు గూడ యుద్ధాని కేగిన మన చెర్ల పద్మనాయకవంశము మీ నాన్నలతో - నీతో -

బాల :- సరి పోవునని నీ భయముః

అయి :- అవును నాయనా! ఇప్పుడు నీకు యుద్ధగండము! ఈ గండము తప్పిన నీకు పూర్ణాయుర్దాయము.

బాల :- (నవ్వి)

ఉ॥ ఇస్సిరో! ఏలయిట్లు భ్రమించెదవమ్మ! చిరంబె దేహికా
యుస్సు? వృథా వ్యథలిట్లడిచి, ఊర్జిత కీర్తికి మేన లొడ్డుటే
లెస్సగిదమ్మ! దాగినను మృత్యువు తప్పనటమ్మ! ఈ యెడల్
తుస్సన బోయినన్ యశము దుర్లభమే గదవమ్మ! చెప్పుమా.

మాణిక్యమును రోసి గాజుపూస కాసించినట్లు, నీడి బుగ్గవలె ఎప్పుడో మాసి మంటిలో గలిసిపోవు దేహముపై మోహము వహించి శాశ్వత కీర్తులు పాడుచేసికొనవలయునా?

అయి :- వద్దు నాయనా! శాశ్వత కీర్తులు పాడుచేసుకోవద్దు దేశానికీ, వంశానికీ శాశ్వతకీర్తులు సంపాదించు కాని,

బాల :- ఇంకను నీ మనసు తెగలేదా? అమ్మా! ఎంత దురదృష్టమిది?

అయి .- దురదృష్టమే నిజముగ. త్యాగరాగాలకు నా మనసులో ద్వంద్వ యుద్ధము. బాహ్యాంభ్యంతరాలలో అంతా యుద్ధమే. ఈ యుద్ధములో అందఱు చత్తురు.

బాల :- ఈ చావు మంచిదమ్మా!

ఉ॥ యుద్ధము నందుచచ్చుటయొ? యోగమునందున మేనువాయుటో?
ఇద్దర రెండు చావులె రహించును స్వర్గద మోక్షదంబులై
బుద్ధిసుధా! సుతత తలపోయుపు కుక్కల నక్కలట్లు నం
బద్ధపు చావు చావ మతిమర్త్యునకుం బరమార్థమేమిటే?

అయి :- నీ విట్లను చున్నావు. వీరాధివీరులు, యోధాను యోధులు యుద్ధమున వీరశయనమందినప్పుడు దేశము నిర్వీర్యమైపోదా? తెలుగుదేశమున శాంతిభద్రతలకు నిలువనీడయుండునా? హత శేష ప్రజానీకము వరుల క్రింద బానిసతన మనుభవింపదా? విశ్వకల్యాణమునకు నిర్యుద్ధమే శరణ్యముకాదా?

బాల :- మరల మొదటికి వచ్చుచున్నావమ్మా! నిర్యుద్ధభావముతో నాయనగారెంతో ప్రాకులాడినారు. ఈ వాదముతో వారు మాచెర్ల నీయక పోయినను మేడపిలోనే కాలము వెళ్లబుచ్చెడి వారేమో. కాని, అల రాజు దుర్మరణముతో యుద్ధమనివార్యమై పోయినది. దేవతలు దిగి వచ్చినను ఈ యుదయాగదు వీర కీర్తులకు వీరు లెగబడుచున్నారు. నీ విదివరకే వీరపత్నివి. వీరమాతృత్వముగూడ పొందుము. నీ త్యాగానికి నిఖిలాంధ్రులు నీరాజనాలిత్తురు. బాలచంద్రుని గాదలు పారాలు చెప్పునాడు ఒడి పిల్లల లేత నెత్తురుడుకుబారును. వీరజాతి మరల రూపొందును

అయి :- మహాప్రళయము తరువాత పునస్సృష్టి!

బాల - స్థిమిత హృదయముతో ఇకనైన నన్ను దీవింతువా అమ్మా!

అయి :- (నిట్టూర్చి) దీవింతును. కాని, నా దీవెనకు ముందు నీ వొకటి చేయవలయును.

బాల :- (సంతోషముతో) నీ వేది చేయుమన్న అది చేయుదును చెప్పు తల్లీ! చెప్పు.

అయి :- పాపము! మాంచాల, సిగ్గుతెరల దోబూచులలో నిన్ను పెండ్లి పీటలమీద ఏమి చూచినదో? నాటికి నేటికి నీ కామె మాటయే లేదాయె.

బాల : క్షమించు తల్లీ! అది నా పొరపాటు! మేమిద్దఱము పూవు తీవెలట్లు మీ కన్నుల కానందము చేకూర్చలేకపోతిమి. గతజలసేతుబంధనము! దానికి నేనిప్పుడేమి చేయుదును?

అయి :- యుద్ధమున కేగుచున్నావు ఇప్పుడైన నీ వామెను చూచి మరిపో, తల్లి దీవెనతో ఆలి దీవెనగూడ పొందాలి. వీరవంశాచారమిది. పోయెదవా నాయనా! కోడలు మాంచాల నిప్పుడైన చూడబోయెదవా? పలుకవేరా?

ఉ॥ నీ ప్రియురాలి దీవనము నీ కిడుకా విజయేందిరా విశే
ష ప్రియసంగమంబును, రసరప్రసంబుగ ఆమె చేతితో
దీప్రనిటాల భాగమున దిద్దిన మేల్తిలకంబు వీర రే
ఖా ప్రచురంబునై వెలుగు గాంచునురా! యువవీరశేఖరా!

బాల :- (మొగము త్రిప్పుకొనును)

అయి:- ఉ॥ కోడలిమాట యెత్తగనె గొంకుచు మోమును త్రిప్పె దేలరా?
ఏడుపువచ్చు నీ స్థితికి, ఎప్పటి మాటలు? మీకు - పెండ్లియే
నాడుర యయ్యె! ఆనడి దినాలను వచ్చితి సానితోడనే
కోడలి కాపురంబు చెడగొట్టిరి నీ కెవరేమి చెప్పిరో?

బాల :- క్షమించమ్మా! నే నక్కడికి పోలేను.

అయి:- పోలేవా? వీరతిలకమిచ్చుటకైనా నోచుకోలేదా? కోడలు మాంచాల!

బాల :- ఇంతకాలము నే నామెకు మహాపచారము చేసితిని యుద్ధానికి బోవుచు, ఇప్పుడు నేనే మొగము పెట్టుకొని, ఆమెచే వీర వీరతిలక మందుకో పోదును? నాకు మొగము చెల్లదమ్మా!

అయి :- మొగము చెల్లదా? ఆమెకు నీ వొనర్చిన అపచారమిటులే నిలిచి పోవును అది నీకు మచ్చ, నీ వీర జీవితానికి కళంకము తెచ్చు కోకు నాయనా?

బాల :- ఇంతకాలముగ ఆమె మొగమైన చూడక, మాటైన యెత్తక, ఇప్పుడు దీవెన లిమ్మని పోవుటేమి యుక్తము? అనాదృతయైన ఆమె నన్నాదరించునా?

అయి :- తప్పక ఆదరించును. నీ రాక ఆమెకు నెలరా జురాక! నీ కోసము నిరీక్షలు సలిపి నిరాశతో నిట్టూర్చనిరోజు లేదామెకు. ఆమె నిరాశా పథములో ఆశాజ్యోతులు వెలిగించు! ఆనంద పరిధులందించు! నా మాట కాదనకు!

బాల :- కాదనను తల్లీ! నీ మాట కాదనను. కాని, మనసు వెనుకకు లాగు చున్నది. ఆమె యింటివైపు కాళ్లు సాగుటెట్లు? అలవాటులేనిపని. అందుచేమను కొందురో?

అయి :- అన్నిటికితలొగ్గు! మనసు బిగ్గబట్టు! మాంచాల యింటికిప్పుడే పో!

బాల :- పోనీ, ముందు నీవుపోయి, అచ్చటివాళ్లకు చెప్పలేవా అమ్మా

అయి :- సరే ముందు నేనే పోయెద నీవు సిద్ధముగనుండుము!

బాల :- అట్లనే

అయి :- (నడుచును) (తెరపడును)

## విష్కంభము

### దృశ్యము - బొంగరాలాడినచోటు

పరివేశము : కట్టివేసినట్లక్కడ ఒక్కడుగా అనపోతన

అనపోతు :- (నిర్ఘాంతపోవుచు) ఎంత చేసింది బొంగరాలాట! ఈ బొంగరమూ, ఈ త్రాడూ ఇక్కడే పడియున్నవి. చెర చెర త్రాడుచుట్టి చెన్నయ్య బాలుడు బొంగరము నేలమీదికి విసరివేసినప్పుడు, ఆ దెబ్బకు చిదురుపలైన యీ శిలాఖండాలు! ఔడిసిన బొంగరపు ములికి కాలికి గుచ్చుకోగా నీళ్లు తీసికొనిపోవు అన్నమ్మ కెవ్వన కేకపెట్టి బొంటిమీది కడవ జారవిడువగా క్రిందపడి బ్రద్దలైన యీ కడవ పెంకులు? హెచ్చరించు చున్నట్లున్నవి బొంగరపు ముల్లు దిగబడి యిక్కడనే కాటినది కడవెడునెత్తురు ఆ కాటిన నెత్తుటితో బాలచంద్రుని మేన వేడినెత్తురు పాటినది. అన్నమ్మ తిట్టిన తిట్లు బాలచంద్రుని కన్నులు విప్పినట్లయినవి. ఈ త్రాడూ బొంగరమూ ఇక్కడనే పారవైచి, ఒకే పోకగా ఎవరికీ ఏమీ చెప్పకుండనే పోయినాడు. అందఱూ పోయినారు కట్టివేసినట్లు నేనొక్కడనే యిక్కడున్నాను. కోమటి అన్నమ్మ అన్నమాటలు ఇప్పటికీ చెవుల్లో ప్రతిధ్వనించుచున్నవి.

(కొంచెము దూరములో చాకలి చందూ, మంగలి మల్లూ)

మం. మల్లు :- ఓరేయ్ సందూ! బావనోళ్ల సిన్నోడిక్కడే వున్నాడేందిరా?

చా చందు :- అదేందిరామల్లూ! గుడ్లుఱిమి సూత్తున్నాడు?

మల్లు :- బయమేత్తుందసి! అనపోతన్నకి అసలే మా కోపం.

చందు :- పలకరిచ్చురా మల్లూ!

మల్లు :- నువ్వుపలకరిచ్చురా సందూ!

అనపో.- ఎమిటిరా! అట్లుచూచుచున్నారు? నేనేం దయ్యాన్నా? భూతాన్నా? రండి! దగ్గరికి

చందు, మల్లు :- (తిన్నగా జరిగి వత్తురు)

అన :- మన బాలనాయుడేమంటున్నాడు? బొంగరాలాడుకోటానికి రాడా?

చందు :- రాడు. రాడు.

అన :- మరి గోలీలాడుకోటానికో?

మల్లు :- రానే రాడు.

అన :- బిలిగుడాటకో?

చందు :- ఊఁ ఊఁ,

అన :- ఇప్పటికి కదిరించన్నమాట తిక్క. అతణ్ణుంచి అందలమూ చెడి పోయాం. కులాల వేరయినా, అందరం అన్నదమ్ముల్లాగున్నాం. మనల్ని మహావీరుల్ని చేయాలని బ్రహ్మనాయుడు బాబచ్చు పట్టుపట్టి కత్తిసాములూ, కర్రసాములూ నేర్పించాడు. సాములు నేర్చిన మనం సోముగల్లాగ తయారయ్యాం.

మల్లు :- తయారయ్యాం ఆడోళ్ళని సావగొట్టటానికి.

చందు :- ఇద్దాలు సేసే యీడులో బొంగరాలాడుకొంటున్నాం.

అన :- ఇదంతా ఆ బాలచంద్రుడి మూలాన్నే. కొసకు వీరతాంబూలమైనా పంపేడా మనకు సేనాపతి కన్నమదాసు?

మల్లు :- మనల్ని వీరుళ్ళజాబితాలోంచి తీసేసినట్టే

చందు :- మనల్ని పనికిరాని బడవలకింద జమకట్టినట్టే.

అన :- ఇంతకు బాలచంద్రుడేమంటున్నాడు?

మల్లు :- ఇద్దానికి సిద్ధంకావాల్సిందే నన్నాడు.

చందు :- బావలు, కాపులు, కమ్మలు, కమ్మరులు, కుమ్మరులు, దొమ్మరులు సాలీలు, కమసాలీలు-పాకనాటితెడ్లు, పంటరెడ్లు, చాకళ్లు, మంగళ్లు, మాలలూ, మాదిగలూ, సావకూళ్లుతినే అష్టాది కులాల వాళ్లల్లో కుర్ర, అందరినీ కూడగట్టుకొని రమ్మన్నాడు. రేపొద్దున్నే కారెంపూడికి పెయాణమని సెప్పి సెలవుకోసం పోతున్నాడు.

అన :- అయితమ్మగారింటికా?

మల్లు :- అయితమ్మగోరి సెలవయిందిగా

అన :- మరెక్కడికి?

చందు :- మాంచాలమ్మగోరింటికి

అన .- (ఆశ్చర్యంగా) ఆఁ నిజంగానే?

మల్లు :- నిజంగానే.

అన :- మొగం చెల్లుతుందా? అక్కడికె పోవటానికి?
చందు :- సెల్లకే. వాళ్లమ్మగోరివి పంపిచ్చాడుముందు.
అన :- కట్టుతున్న నేరానికి ఇప్పుడు సేవలూ, దీవెనలూ పొందటానికి పనికివచ్చిందన్నమాట భార్య ఈ గుణం ముందే ఉంటే యెంత బాగుండేది?
మల్లు :- నువ్వేనంటగా వాళ్లిద్దటికి కొట్టుండనేసింది.
చందు :- మాఁవాలమ్మ, దొప్పసెవ్వల్లి, దోనె కడుపుది, దూడ పెదవుల్లి అని సెప్పింది నువ్వేనంటగా.
అన :- నేనా? మీ కెవరు చెప్పేరు?
మల్లు :- ఆ బాలనాయుడే.
అన :- నేను చెప్పినన్నాడా బాలనాయుడు? సాని సబ్బాయి కాదూ?
చందు :- ఆఁ అదే ఆబిడ సెప్పిందానికి నువ్వు నిజమే నన్నావంట.
అన :- ఎవరు చెప్పినా - తన కళ్లేమయ్యాయట? ఏదో నటసానికంటె నిజమే ననుకొన్నాడా? ఇప్పుడా గొడవ తేలేదికాదు ఇంతకు నన్నుగురించి యేమన్నాడు?
మల్లు :- ఇద్దానికి వత్తాడా అడగమన్నాడు.
అన :- ఆఁ ఎందుకట్లడగమన్నాడు?
మల్లు :- నువ్వు సెప్పరా సందూ!
చందు :- నువ్వు బాపనోళ్లబ్బాయివి. ఇద్దమంటె యేందనుకొన్నావు అనపోతన్నా!
అన :- చాకిరేవులనుకొన్నా - తలలు గొరగటాలనుకొన్నా.
చందు :- చాకిరేవులో? పగోళ్ల పెళ్లాల తాళ్లు తెంచే రేవులో? సూత్తావుగా.
మల్లు :- తలకాయలు గొరగటాలో? తరగటాలో? సూత్తావుగా.
అన :- ఇక నేనేనా తీసివేసింది ఈ యుద్ధంలో బాలచంద్రుడికంటె నాది పై చేయి అనిపించనా:

(చందూ మల్లూ ఒకరి నొకరు చూచుకొంటారు)

అన :- కారెంపూడికి రేపేగా ప్రయాణం?
చందు :- రేపే.

అన :- కుమ్మరపట్టి యేడీ?

మల్లు :- కుమ్మరవట్టి దట్టీ కట్టించు కొంటున్నాడంట?

అన :- కమసాలి చందరయ్యో?

చందు :- కత్తికి సాన పట్టిత్తున్నాడంట సాన.

అన :- కపులబ్బాయి సూర్నిడో?

మల్లు :- సూర్నిడు - సురకత్తికి పటాకత్తికి పదును పెట్టు కొంటున్నాడంట.

అన :- వెలమ దోర్ని డేమంటున్నాడు.

చందు :- డొక్క సించి డోలుకడతా నంటున్నాడు నాగమ్మని.

అన :- సరే. మనంగూడ డాలు డవాజీ, కత్తీకటారి బయటికి తీద్దాం పదండి!

(ముందుకుబోయి కొంచెము వెనుకకు తగ్గి) అనుమానంగా ఉన్నది. బాలచందురుడు మాంచాలింటికిబోయి తొందరగా తెమలి వచ్చునా? కొంపముంచి అక్కడే దిగబడి పోడుగా.

మల్లు :- అదేంమాట మనల్నందరినీ మొగిచ్చి ఆ పనిసేత్తాడా?

చందు :- ఆ పని పేత్తె నిలవదీసి, నిగ్గదీసి అడిగేత్తాం.

మల్లు :- సెవి పట్టుకొని లాక్కొని పోతాం.

అన :- పరే పదండి - (ముందుకు నడుచును)

చందు :- (వెనుక అర్థవంతంగా ఒకళ్లొకళ్లు సైగచేసికొందురు)

(తెరపడును)



# మగువ మాంచాల

దృశ్యము : మాంచాల మందిరము

(ప్రవేశము :- మాంచాల నిరీక్షణ, సెజ్జపై చేరగిల కూర్చుని)

మాంచా :- ఉ॥ నాదుకలల్ ఫలించునొకొ? నా కగుపించునొ? యెందమావితో
స్వాదుసుధాంబుపూరములు, జన్మములో-ఇకనాకు భర్తకున్
లేదనుకొంటి, నిక్కముగ లేమలలోన సమాన గౌరవ
శ్రీదయివారగా - తెనుగు సీమను నేనొక వెల్గుగాంతునా?
అత్తమాటలు ఉత్తమాటలు కావుగా? ఎన్నడురాని ఐతమ్మత్త వచ్చి, ఈ చల్లనివేళ తీయని కబురు చెప్పిపోయినది. మాంచాలా మనఃకుముదినీ వికాసం! ఈ చంద్రోదయంతో బాల చంద్రోదయం! చెలీ! ఆయనరాక కనిపెట్టి ఉండవే. దారులెల్ల పూల తోరణాలు కట్టవే! పన్నీటి కలాపి చల్లవే! రతనాల ముగ్గు లేయవే! మల్లెలూ మొల్లలూ క్రుమ్మరించవే!
(తెరలో) అలాగేనమ్మా! అన్ని చేయుచున్నానమ్మా!
ఆయన రూపురేక లెంతగనో మారి ఉండాలి!
ఉ॥ ఏండ్లు గతించె-పూండ్లు గతియించెను-పీటలమీద-ఎప్పుడో
పెండ్లితటిన్ - పరస్పరము వీక్షణమాలలు నల్ల కల్వ పూ
చెండ్లుగ గ్రుచ్చి-ఆడితిమి, సిగ్గది నన్ను తలెత్తనీయ దా
పెండ్లికొమారు-పోల్చుకొన వీలగునో? మఱి వీలుకాదొగా?

చెలి :- (ప్రవేశించి) అమ్మా! నీవు చెప్పినట్లే ఆయన వచ్చు దారులందు పూల తోరణాలు కట్టినాము, పన్నీటి కల్లాపి చల్లినాము. రత్నాల ముగ్గులేసినాము, మల్లెలూ మొల్లలూ ఒత్తుగా పోసినాము.

మాంచా :- పోసితివా చెలీ! మఱచిపోదువేమో? ఆయన వచ్చునప్పుడు అడుగులకు మడుగులు పఱవవే! కాళ్లు కడుగుటకు బంగరు చెంబుతో నీళ్లు సిద్ధముగ నుంచివే! ఆచారాలు, మర్యాదలు జరుపుటలో ఏ లోటు రాకుండ కనిపెట్టి ఉండవే!

చెలి :- అట్లనే నమ్మా! నీ వింకను అలంకరించుకొనేలేదు.

మాంచా :- మనసు పరవశంగా ఉన్నది. నా అలంకరణలో పొరపాట్లు జరుగునేమో? నీవు దగ్గరుండవే!

చెలి :- నిజమే. నడుమునకు పెట్టుకొనే ఒడ్డాణం మెడకు, ముక్కునకు పెట్టుకొనే బులాకి చెవికి పెట్టుకోవచ్చు.

మాంచా :- (నవ్వి) అట్లు జరుగకుండ కనిపెట్టి ఉండవే!

చెలి :- సరే. మొదలుపెట్టు నీ చీర సింగారింపులు.

మాంచా :- ఏ చీర కట్టుకోనే? ఈ చీరలలో ఏది కట్టుకోనో తోచకున్నది.

చెలి :- తోచక అట్టె కూర్చుంటే ఇంతలో ఆయన దిగుతాడు. చీరె సింగారించే సరికి ఊరు కొల్లవోయినట్లవుతుంది.

మాంచా :- ఈ చీరెలందు అన్నీ నచ్చినట్లే ఉండ నచ్చుటయులేదే! మామూలుగా ఇప్పుడు కట్టుకొన్న చీరె చాలనిపించుచున్నది. నా నాధునకు నా అందము అకృత్రిమంగా కనపడాలి.

చెలి :- నీ అందము కృత్రిమం కానక్కరలేదు. నీ అందమే నీకు పెట్టని సొమ్ము. ఏ చీర కట్టుకొన్నా, ఏ నగ పెట్టుకొన్నా అతికిపోతుంది.

మాంచా :- నాకీ మేలిముసుగొక్కటి చాలు! ఇది కళాదేవతకు నీరాజనం! బంగారు జలతారుతో దేవాంగుల మామయ్యకు చెప్పి నా కొరకు ప్రత్యేకముగ నేయించినాడు మా నాన్న. (మేలిముసుగు వేసుకొని) చెప్పు చెలీ! ఇప్పుడు నే నెట్లున్నానో చెప్పు!

చెలి :- రూపుదాల్చిన కళా సర్వస్వంగా ఉన్నావు. మెడ బోసిగానున్నది. ఈ ముత్యాలహారం వేసుకో (వేయును)

మాంచా :- మఱచితిని. ఆనాడు పెండ్లి పీటలమీద ఆయన స్వయముగ నా వ్రేలికి తొడిగిన రత్నాంగుళీయముతేవే!

చెలి :- అది నీవు పెట్టుకోవటమేలేదు. ఏ పెట్టెలో అడుగునబడి పోయినదో

మాంచా :- నా పెట్టెలో చూడు! ఇదిగో తాళం!

చెలి :- (తీసుకొనిపోవును)

మాంచా :- అది మామగారు ప్రేమతోచేయించిన ఉంగరం! బాలనాయుని పేరు చెక్కిన ఉంగరం! దేవులాటకు వ్యవధిచాలదేమో?

చెలి :- (పరుగునవచ్చి) దొరికినది ఉంగరం! ఏ వ్రేలికి పెట్టను? ఇప్పుడు పట్టునా? ఎప్పుడో చిన్నప్పుడు చేయించినది.

మాంచా :- అది ఎప్పటికైనా ఏదో వ్రేలికి సరిపోవునట్లు మామయ చేయించినాడుగదే?

చెలి :- (వ్రేలికిపెట్టి) అమ్మయ్యా! సరిపోయినది వ్రేలికి. అందాలరాణి వైన నిన్నింత అన్యాయం చేసిన ఆ బాలనాయని—

మాంచా :- (నోరుమూసి) తప్పు తప్పు అయన్నేమీ అనకే.

చెలి :- నీ సహన శీలానికి కోటి నమస్కారాలు! నీ సుగుణం స్త్రీజాతికెల్ల గర్వకారణం!

మాంచా : పొగడ్తలు చాలించు. ఇప్పుడు చెప్పు నా అందం ఆయనకు సరిపోవునా అని.

చెలి :- ఎందుకు సరిపోదు? నీ అందము ఆయనకొక బంధముగా సరిపోవును. యుద్ధానికి బోవచ్చు, ఆచారాలకు వచ్చు. ఆయనిక్కడే ఆగి పోవచ్చు.

మాంచా :- ఆగిపోరాదు చెలీ! ఒకవేళ అత్తగారికది వాంచనీయమే కావచ్చు ఆ విషయములో నేను కొంత స్వతంత్రించక తప్పదు, (అలికిడివిని) దూరాన పొట్టేటిగిట్టల చప్పుడు చెలీ! చూడవే!

చెలి :- (అటు ముందుకుపోయి చూచి వికాసముగ) వచ్చుచున్నాడమ్మా!

మాంచా - (ఆనందాతిశయముతో) వచ్చుచున్నాడు! రవల పావల జోడు వాడు! రతిరాజసుందరుడు! పొట్టేటి వాహనము దిగివచ్చుచున్నాడు!

ఉ॥ వచ్చలు తాపిసట్టి పిడిబాకొకటున్నది కాసెకట్టులో
అచ్చపువీరరేఖ యెసలారెడు - ఆకటి పార్శ్వమందునన్
మెచ్చులుగుల్కు వాలదిగో! మేలిమి బంగరుటాలు తాలదే!
హెచ్చిన వెల్మపౌరుషమదే కనుపట్టును, మీసకట్టులో,
చెలీ! ఎదురుకోలీయాలి. ఇప్పుడు నన్ను విడిచి పెట్టేవుసుమా!
బాలచంద్రున కెదురు పోవును పరస్పరావలోకనము నేపధ్యమున)
గీ॥ పులుకు పులుకున జూచుచు - పువ్వుబోడి
నిలువబడి పోయినది కొన్ని నిముసములుగ
ఎంత చూచిన తృప్తి జనింపదేమొ?
చూచుచున్నది చూపులో - చూపుగలిపి.

బాల:- ఉండు మాంచాలా! అట్లనే పులుకు పులుకున జూచుచు నా ముందుండిపో. స్నిగ్ధ మధుర మంజుల మోహనములైన ఆ చూపుల

నుండి రస ఝురులు పొర్లి వచ్చుచున్నవి. రసప్లావితుడనై పుల
కించి పోవుచున్నాను. చూడు దేవీ! నన్నట్లనే చూడు!

(ఇంతలో చెలి పళ్లెము పన్నీటి చెంబు తెచ్చి అచ్చట పెట్టును)

(నేపథ్యమున)

గీ॥ చెలియ తెచ్చిన పన్నీటి చెంబుపుచ్చి
ఒడయుని పదాలు పళ్లెమందిడగజేసి
కడగుచున్నది గాజులు గల్లుమనగ
పిల్ల వీరుని గుండెలు జల్లుమనగ.

బాల :- కుడిపాదమేల కడిగి ఊరకుంటివేమి దేవీ!

మాంచా :- ఎడమ పాదము సాని సబ్బాయిది. కుడిది నాది,

బాల :- ఉ॥ నా హృదయేశ్వరీ సయిపు! నా అపరాధము - పిన్ననాటనూ
ద్వాహమునాడి నిన్ను, పొరపాటున నే వెలి చాలియందు దు
ర్మోహముపూని నిన్ భువన మోహన రూపిణి త్రోసిపుచ్చితిన్
ద్రోహము చేసితిన్ ప్రథమ దోషముగాగొని నన్ను సైచుమా.

మాంచా :- ఎంతమాట! ఇట్లనగూడదు. అట్లనే నిలబడ వేల ఈ మెత్తపై
కూర్చుండక.

బాల :- (మెత్త దగ్గరకు నడుచుచుండ)

చెలి :- (అడుగులకు మడుగులు పఱచుచుండును)

బాల :- (మడుగులపై నడుచుచు) పశ్చాత్తాపము నన్ను-కాల్చివేయు
చున్నది మాంచాల! హృదయము నజ్జునజ్జుగా బాధపడుచున్నాను.

మాంచా :- బాధపడవద్దు నాథా! మీకు పశ్చాత్తాపము కలిగినది అంతేచాలు.
అనుభవించక పోయినా సర్వసౌఖ్యాలు నాకనుభవించినట్లుగనే తృప్తి
కలుగుచున్నది. ఇది చాలు మాంచాలకు. నేడు నాకు,పసుపుపారాణి
నాడున్నట్లున్నది.

బాల :- నీది గంభీరహృదయము దేవి పైకి పొక్కలేకున్నావు, ఈ దీర్ఘ
కాల విశ్లేషములో నీవెంత వేగిపోయితివో నాకిప్పుడర్థమయింది.
మంగళసూత్రముకట్టి మఱచిపోయాను మాంచాలా! నన్ను
మన్నించు.

మాంచా :- తప్పు తప్పు! అనవద్దు. (కన్నీరునించుచు) మాంచాల
జాతక చక్రములో పాపగ్రహాల పరిభ్రమణం! భర్తృసౌఖ్యము

రిత్తయైనది. అది నా దురదృష్టము. కాదు, నే నొకవిధముగా మహా దృష్టవంతురాలనే ఇప్పుడైనా వీరాచారానుసరణగా నాచే వీరతిలకము పెట్టించుకొనుటకు నా దగ్గరికి వచ్చితివి. నీవు మహా వీరుడవు. నేను వీరపత్నిని. ఇది చాలు మాంచాలకు. నా అదృష్టము ఆంధ్రభూమిలో ఏ స్త్రీకిలేదు. నిండుమనస్సుతో నీ ఫాలభాగాన వీరతిలకముదిద్దెదను, అది నీ వీరరేఖా ప్రచురితము నాధా!

బాల :- యుద్ధమున కిప్పుడే పోము మాంచాల! ఈ రాత్రి నన్నిక్కడనే యుండనీ.

మాంచా :- అట్లు చేయగూడదు. అది మాంచాల జీవితానికి కళంకం. లోకులభార్యలు, తమ భర్తలను దేశ స్వాతంత్ర్యము కోసము యుద్ధానికి బంపగా - ఆచారాలు పొందటానికి వచ్చిన మగని మలుపుకొని, మాంచాల యింట నిలుపుకొన్నదని దూషింతురు. ఆ పనిచేయవద్దు. వెంటనే రక్తతిలకస్వీకారమొనర్చి రణరంగమున కురుకు.

బాల :- ఇంతకాలముగ పెడదారులబడి నీకు దూరమైతిని. ఇంటికివచ్చిన నన్నిప్పుడే పొమ్మను చుంటివా మాంచాలా!

మాంచా :- (కన్నీరు తుడుచుకొనుచు) నీ మనసు నా కర్థమయినది. కాని అది తప్పు పని. రణ ప్రస్థానమునకు ముందది అశుభప్రదము. మనసు మార్చుకో నాధా!

బాల :- మార్చుకోలేను అది నా కసాధ్యము మాంచాలా? నా కోర్కె చెల్లించు అశుభమని అడ్డు చెప్పకు!

మాంచా :- ఆ మాట చెప్పవద్దు క్షణిక సౌఖ్యము! మాంచాల జీవిత కుసుమ మిట్లే పరిమళించనీ, నిన్ను బ్రతిమాలుకొందు, ప్రార్థింతును, పాదాలు పట్టుకొందును.

బాల :- నిన్ను బ్రతిమాలుదును - ప్రార్థింతును - పాదాలు....

మాంచా :- అఁ అఁ అపచారము? మహాపచారము!

ఉ॥ నా పతి దైవమా! వినుము! నాదగు విన్నపమింత - నీదు ని
చ్చాపడిపూర్తి కాదనగజాలను గాని, రణాలకేగు చీ
యోపగ రాని నీదు నిలుపోపమికే శిపుడేమి చేయనో
తోపగలేదు నాధ! దరిదోపగలేదు రవంత తాళుమా!

(తెరలో) మాంచాలా! మాంచాలా?

ఎందులకో అమ్మ పిలుచుచున్నది.

బాల :- వద్దు, పోవద్దు దేవీ!

మాంచా :- ఇప్పుడే వత్తునుగా. (వెళ్లును)

బాల :- వెళ్లినది మాంచాల!

(నేపథ్యమున యథోక్తాభినయము)

గీ॥ తమకమును నిల్పుకోలేక తహతహపడు
బాలనాయని మనసదే పరుగిడెడిని
కడచు నిముషాలు నిముషాలుగావు వాని
కవి యగుయుగాలు! నిజము మహాయుగాలు!

బాల :- మాంచాల యింకను రాలేదేమి? అబ్బా! యెంతసేపయినది. ఆమె యెడముగా నిముషమైన నిలువలేను. ఈ కాలచక్రపరిభ్రమణంలో నాకు నిముషాలు యుగాలుగా, మహాయుగాలుగా తోచుచున్నవి. మాంచాల రాలేదింకా.

మాంచా :- ఇదిగో వచ్చితిని నాథా!

బాల :- వచ్చితివా దేవీ! అట్లు దూరముగ నిలబడితివేమి? దగ్గరకి రాగూడదా? పొద్దుపోవుచున్నది ఈ రాత్రి మధురరాత్రిగా పరిణమించునదింకెప్పుడు? చూడు! ఈ పూసెజ్జ మనల నాహ్వానించుచున్నది. దీని ముత్యాల జాలరుల కాంతులు నీ చెక్కుటద్దాలలో ప్రతిబింబితములగుచున్నవి. అందమైన నీ ముత్యాలహారము . ..

(హారము పట్టుకొనబోవ మాంచాల అవలకు పోవుటతో తెగిన ముత్యాలెల్ల చెల్లచెదరుగ బడిపోవును.)

మాంచా :- అయ్యో నా ముత్యాలహారము పెరిగినది.

బాల :- పెరిగినదిముత్యాలహారము! కామాతురుని ఆ తురపాటు! పొరపాటు జరిగిపోయినది. నొచ్చుకొనకుమాంచాలా! నీవేమీ అనుకోకుదేవీ!

మాంచా :- అపశకునము నాథా!

బాల :- కాదు దేవీ! ఇది చేజేతుల చేసికొన్నది. అవశకునము కాదిది.

మాంచా:- అపశకునము కాదన్న మాత్రమున అనుమానము పోదు. దోష పరిహారార్థము కాలవ్యవధి. ఈ చెదరిన ముత్యాలెల్ల చేర్చి మరల హారము కూర్చాలి. హారము ముగియునిదే నన్ను ముట్టరాదు.

బాల :- ముట్టరాదని ఒట్టు పెట్టుచుంటివా దేవీ! ముత్యాలహారము పూర్తి యగుటదెప్పటికి? ఈ లోపల తెల్లవారిన అంతా వృధ. నిశిరాత్రి దాటిపోయినది. (కోళ్లు కూయును) అదిగో! కోడికూత అరుణోదయానికే అనుచరులు ప్రస్తావభేరి వేయుదురు. అందుకోవాలి. చెదరిన మనస్సుతో ఈ చెదరిన ముత్యాలేరి ఈ వణికిపోవు చేతులతో హారము గుచ్చుటెట్లు మాంచాలా!

మాంచా :- అంతా దైవప్రేరణ! హారము పెరుగుటతో నా మనసునకెంతో తరుగుపడినట్లయినది. చెల్లా చెదరులైన ముత్యాలవలె నా ఆనందము చెదరిపోయినది. హారము లేనందున నా అందమెంత తగ్గినది!

బాల :- నీ అందము తగ్గరాదు మాంచాలా! ముత్యాలహారము గుచ్చి నీ మెడలో వేయుదును. అప్పుడు ముద్దొకటీయువా?

మాంచా :- (చిరునవ్వుతో తల యూపును)

బాల :- (హారముగుచ్చుటకు ప్రయత్నించి తుదరక) దేవీ! నేనీ హారము గుచ్చలేను. చేతగానివని. పోనీ, నీవు గుచ్చు! ముత్యాలొక్కొక్కటియేరి నీ కందించెద.

మాంచా :- అట్లనే. (సూత్రము తీసుకొని గుచ్చుట అభినయించును)

(నేపథ్యము యథోక్తాభినయము)

గీ॥ చెదరిన మనస్సుతో - చెల్లా చెదరులైన
ముత్యములేరి శీలమ్మె ముద్దు మనుమ
డంది యిచ్చుచున్నాడు పేరాసలంది -
గుచ్చుచున్నది మాంచాల కొలికి యిదర.

కం॥ ఈ వైపునుండి గ్రుచ్చగ
ఆ వైపున జాఱుచున్న వవె! ముత్యమ్ముల్
కావలసిన పని యెట్లగు?
పోవలయును కాని యింక పొద్దు వృధాగా.

బాల :- హారమింకా కాలేదా? దేవీ!

మాంచా :- హారము కాలేదు! అరుణోదయం కావచ్చినది.

బాల :- మోసపోతిని మాంచాలా!

మాల ఉ॥ నా ప్రియా! ఏల యీ వలపునంబడి వ్యర్థమొనర్తు వీరల
క్ష్మి ప్రపణమైన భోగములు - చేరికలోనికి వచ్చి యున్నవో
యీ! ప్రభుభక్తి కిమ్మెయిని, ఇమ్మెయినర్పణచేయుమోయి! కీ
ర్తి ప్రదమద్ది శాశ్వతము దేహికి ఐహికమేల కొల్పనా?

ఎందుకీ పాడు భ్రమలు? తుచ్ఛమైన భౌతికానందము కోసము శాశ్వత వీరలోక భోగాన్ని వ్యర్థము చేసికొందువా? బ్రహ్మనాయుని పుత్రుడవే! నీ వంశ గౌరవము మట్టిగలుపు కొందువా? యుద్ధానికి పోవుచు వీరతిలక మందుకోవచ్చి భార్యావ్యామోహమున దిగజారిపోయిన లోకమేమనుకొనును బాలనాయ డింత బైసి మాలినవాడా యని నిందింపదా? నిందామయమైన జీవితము దుర్భరం నాథా! నిందలపాలుగా బ్రతుకు భారము చేసుకోవద్దు. రాజ్యము కోసము, రాజుకోసము నీ సర్వస్వము త్యాగముచేయి! నీ కొఱకు నేను, నా కొఱకు నీవు మన భాగభోగాలను వదలు కొందుము. చుక్కలున్నంత కాలము, సూర్యుడున్నంత కాలము చంద్రుడున్నంతకాలము మన కీర్తి నిలిచి పోవును. అశాశ్వత భౌతికదేహాలు వర్జించి, కీర్తిదేహాలతో శాశ్వతులమయ్యెదము. ముందు తరాల ఆంధ్ర యువతీయువకులు మన వీరగాథలు పులకితాంగులై పొంగి పొరలే వేడినెత్తురులతో చదువుకొందురు. వీరజాతి మనకు నివాళిపట్టును. మనము వీరపూజలందుకొందుము. నా మాటవినుము మనసు మార్చుకో! కామవాంఛలతో కశ్మలమైనభావాన్ని క్షాళితము చేసుకో! కర్తవ్యపరాయణుడవై కదనరంగానికురుకు. ఊఁ లెమ్ము నాథా! లే.

బాల :- (ఉద్బుద్ధుడయి) జ్ఞానోదయము చేసితివి మాంచాలా? నీవు నా కీర్తి మాలా రచయిత్రివి. ఇప్పటిదాక నే నడిచినదెల్ల పొరపాటు. పొర పాటులో పడిపోనీకుండ నీ బాలచంద్రుని దిద్దుకొన్నావు నీ సహధర్మ చారిణీత్వము సార్థకమైనది దేవీ! ఐహిక సౌఖ్యము శాశ్వతము కాదన్న సంగతి అర్థమయినది. శాశ్వతమైనది కీర్తి. కీర్తియెంత కాలము భూమిమీద నిలుచునో? అంత కాలమూ ధీర వీర మానవులు దివ్య దేహములతో దివ్యలోక సౌఖ్యమనుభవింతురు. అట్టి దివ్య దేహముల కోసము ధీరులు భౌతిక దేహాలనువ్యయము చేయుదురు.

నీవు చెప్పినట్లు నా దేహము పగ్రభువున కంకితము చేసికొందును. రణభూమి కురుకుదును. నరసింగరాజు తల నరికి మా అలరాజు బావకు రక్తతర్పణతో ఆత్మశాంతి కలిగించెదను.

మాంచా :- ఉప్పొంగిపోవుచున్నాను.

శా॥ ఐతమ్మత్త అదృష్టమే మొకొ? విశాలాంధ్రావనిన్ వీర వి
ఖ్యాతుల్గాంచిన బ్రహ్మనాయునికి తానర్ధాంగియై శాశ్వత
ఖ్యాతోగాంచెను వీరపత్ని పదవీ స్వీకారమున్, నేడిదే
నీతో గాంచును వీరమాతయగుచున్ విశ్వోన్నత స్థానమున్.

బాల (ఉప్పొంగిపోవుచుండును)

మాంచా :- నాధా!

ఉ॥ నన్నొక వీరపత్నిగ, ఒనర్చుము చాలది వీరమాతగా
ఎన్నిక గాంచు యోగమది యెక్కడి యోగము? నాకులేని లే
దున్న అదృష్టమెల్ల ఇది యొక్కటి దీని ఫలింపజేయుమా
ఉన్నత సన్నుతుల్గనెద ఉజ్జ్వలమైన త్రిలింగ భూమిలో

బాల :- నిన్ను వీరపత్నిని జేయుదును నా తల్లిని వీరమాతగ జేయుదును ఆంధ్రలోకమున అమ్మగారికి రెండుస్థానాలు మఱి నీ కొక్కటే

మాంచా :- కోడలికన్న అత్తగారే పెచ్చు. అది ఆమె చేసుకొన్న పూజ.

(తెరలో ప్రస్థానభేరి మ్రోగును)

గీ॥ అదిగొ ప్రస్థానభేరి మ్రోయుంగజొచ్చె
బాలభానుడు ప్రాగ్దిశాభాగమందు
అరుణ రుచులీనుచున్న వాడటుల నీవు
అరుల రక్తానరుచు లీనుమా మదీశ!

బాల :- (ఉప్పొంగుచు) అరులరక్తపు నా అభిషేకముతో నీకు, అమ్మకు, తెలుగమ్మకు, ఆనందబాష్పాభిషేక మొనర్చెద. ఈ భావి వైభవ మెల్ల నీ శేముషి సంపాదనము నీ నిస్స్వార్థ త్యాగనిరతికి నా ధన్యవాదములు.

మ॥ నను దీవింపవె నింపవే తిలకము న్ఫాలభాగన - వీ
రనికాయంబున నాకు గొప్పయశముల్ ప్రాప్తింపగా-ఆంధ్రభూ
మిని ఐతమ్మ కుమారు కీర్తివెలుగుల్ మీరంగ - మాంచాల నా
ధుని ఖడ్గానికి నుగ్గునూచమయి శత్రుల్ద్రుమ్మగా నెగ్గగా.

(మోకరిల్లును)

**మాంచా :-** (బాలచంద్రుని ఫాలభాగాన రక్తతిలకముదిద్ది, నీ రాజనమిచ్చి కత్తి చేతికందించుచు)

**కం॥** నీ కత్తి కెదురులేకయె
మూకలుమూకలుగ - పగర మూకలు పడగా
శ్రీకమనీయ యశస్సులు
నీకే ప్రాప్తించుగాక! నీకే నీకే!

వీరగీతి

అరివార దుర్వార! అసహాయ శూర!
కరవాల బిరుదాంక! కదన నిశ్శంక!
నా రాజ! నెలరాజ! నారీమనోజ!
నీ రాజభక్తియే నీకిచ్చుజయము
పోయిరమ్మా నాథ! పోయిరమ్మాయి!
పోయిరమ్మా నాథ! పోయిరమ్మాయి!

**బాల !-** పోదునే మాంచాల! పోదునేదేవి!
నీ దీవెన బలాన నే దెత్తుజయిము
నరసింగు తలగొట్టి నా బావపగను
వెరవక తీర్తునే! వెలదిరో! రేపు
మతణింపకయుయున్న మరల నేవత్తు
మరచిపోవకె నన్ను మగువ మాంచాల!

(వీరోత్సాహముతో ముందుకుఱికి పోవును)

(తెరపడును)



రంగము : కారెముపూడి స్కంధావారము

## మలిదేవరాజు సభ

ప్రవేశము: మలిదేవరాజు, బ్రహ్మనాయుడు, కన్నమనీడు
ప్రభృతులు

మలి :- [ఎదుట స్కంధావారమున వీరుల నుద్దేశించి] వీరులారా! వీరాధి వీరులారా! వీరమేడపి నుండి సేనలఁగూర్చుకొని నలగామరాజుతో యుద్ధమొనర్పవలయునని కారెముపూడి వచ్చితిమి. మన ఆహ్వానము నందుకొని మిత్రరాజులున్ను తమతమ బలములతో విచ్చేయుచున్నారు. స్కంధావారమున పటకుటీరము లేర్పాటు చేయబడినవి. యుద్ధనిర్ణయము కానున్నదిక-

శా॥ పెండ్లాలందున బిడ్డ పాపలయెడం బ్రేమమ్ము పోనాడి మీ
యిండ్లున్ వాకిళులన్నియున్విడిచియే యీ వీరయుద్ధంబునన్
పెండ్లింబోలె దలంచి వచ్చితిరి పృథ్వీరాజ్యముల్లేక యే
డేండ్లయ్యెంగద! నాకుఁగూర్చుడు జయంబెంతేని ప్రార్థించెదన్

గండు :- రాజా! ఇమ్మాజ్ఞాపింపుము గాని ప్రార్థింపనేల?

గీ॥ నీ యనుజ్ఞతో నిజముగ నిప్పునందు
దూకుటకు నైన సంసిద్ధమే కద ప్రభు!
నీ కొరకు మేనులొడ్డి నిర్భీకులమయి
నిలిచి నామింక ఏటికి నీకు శంక?

బ్రహ్మ :- దేశమునకు రక్తపాతము తప్పింపవలయునని యెంత ప్రయత్నించితిమి. అలరాజు దుర్మరణముతో ఆవేశపడి ఇటు వచ్చి తుది యత్నముగా భట్టు రాయబారము సైతము జరిపితిమి. అదియును రిత్తయైనది. కత్తులవేటలో కుత్తుక లుత్తరించి నెత్తురులు పారింప యుద్ధనిర్ణయము కానున్నదిక-

చం॥ అలుగు ధరావిభుండు తన అంతిమ ఘట్టపుశయ్యనుండి-నన్
బిలిచియు, చెంతకుంగదిపి, పేద యెలుంగున పల్కరించి-పి
న్నల నలగామ ముఖ్యులను నాయుడ! యేమొనరింతొ? అంచుమం
వలవల కంట నీరిడిన వా డది నేనెటు విస్మరింతునో?

గండు :- బ్రహ్మన్న బావా! వృద్ధరాజుగారి మాట కాపాడుటకు నీ చేసిన శాంతి సంధానములు లోక మెరుగక పోలేదు. కడమగా భట్టు

రాయబారమును సైతము వ్యర్థమైనది. ఇప్పుడిక వెనుక చూపెందుకు? దీనివలన ప్రయోజనము శూన్యము! ఉభయ స్కంధావారములు సేనా సమీకరణముతో యుద్ధోన్ముఖమై యున్నవి యుద్ధ మని వార్యము.

సేవ :- (ప్రవేశించి) జయము జయము మహా ప్రభువులకు - నలగామ రాజు గారి దగ్గరనుండి ధరణి కోట రాజు కేతరాజు, రాయబారిగా వచ్చినాడు

మలి :- (ఆశ్చర్యముగ) నలగామునికడ నుండి కేతరాజు రాయబారిగా వచ్చుట! చిత్రముగా నున్నది.

బ్రహ్మ :- చిత్రముగనే ఉన్నది. అదేమో చూతముగద! సేవకా! ఆ రాయ బారిని రప్పింపుము.

సేవ :- చిత్తము. (నిష్క్రమించును)

కేతరాజు :- (ప్రవేశించి) నాయకులకు నమస్కారములు.

మలి :- ధరణికోటరాజులకు స్వాగతము. కూర్చుండుడు.

కేత :- (కూర్చుండును)

బ్రహ్మ :- విశేషములేమి కేతరాజా!

కేత :- నలగామరాజు కడనుంచి వచ్చితిని, పోరువష్టము పొందులాభము గదా! ఉభయులకు పొందు పొసగింపవలయునని వచ్చితిని.

బ్రహ్మ :- ఈ సంధానములో నాగాంబ పాత్రయున్నదా?

కేత :- ఉన్నది. ఆమె వెనుకటి నాగాంబ కాదిపుడు. శాంతికోసమెంతో పాకులాడుచున్నది. ఆమె స్వయముగ నలగామరాజుతో చెప్పి నన్ను మీ యొద్దకు బోయిరమ్మని పంపినది

బ్రహ్మ :- ఆఁ చిత్రముగనున్నదే?

మలి :- నాగాంబకు హృదయ పరివర్తనమా?

బ్రహ్మ :- ఆమె రాజనీతిలో ఇదొక విధానమేమో?

గండు :- నాయకురాలు మారినదన్న నిప్పు నీరయినట్లే.

కొమ్మ :- నిప్పు నీరయి, లోకములను ముంచివేయును.

కేత :- నాయకురాలి హృదయపరిణామము మీ కాశ్చర్యముగనే ఉండును. యుద్ధోపద్రవమున దేశమునకు గల్గు కష్ట నష్టములను తలచుకొన్న ప్పుడు కోరి కోరి యుద్ధమునకు దిగుటకు మనసెవరికుండును?

సీ॥ వీరపుత్రుల కత్తి వేటకు బంపెడు
కన్నతల్లులకెల్ల కడుపుకోత
ఆదతువులుపోయి అల్లాడు స్త్రీ వృద్ధ
శిశువుల కన్నీళ్ల చేతివ్రాత
రక్తమాంసములు మఱిగి గుంపు కట్టెడు
చెడుగుంట నక్కల చేరవేత
గ్రామదేవత యథేచ్ఛా విహారంబున
బడుగు మానవజాతి తుడిచివేత
దేశభద్రతకెంతయో తీసివేత
విప్లవ ప్లవరణ మహాబ్ధికెదురీత
బంధుజన సుహృజ్జన పరివారజనులు
మిగులకొక్కఱు - వడుదురు మిత్తివాత

బ్రహ్మ :- కేతరాజా! ఇది నివారించుటకు మేమెంతపాటుపడినది లోక మెఱుగదా?

కేత :- ఎఱుగకేమి బ్రహ్మనా! అన్నదమ్ములమధ్య హెడమినపారసందుల గని ఉభయశ్రేయస్కాములై దూరదృష్టితో నీ యొనర్చిన కరణీయము గణనీయము. వృద్ధరాజు మరణశయ్యపైనుండి, పిన్నల నలగామాదులను నీచేతిలోబెట్టి "వీరినెట్లు కాపాడుదువో బ్రహ్మనా" అని వారి నప్పగించినందులకు నీ వెట్లు వారిని పెంచినది, ఒద్దికతో విద్దెలనెట్లు దిద్దినది లోకవిదితము. నాగాంబ యిపెవరకేమిచేసినదో అది పోనిండు! వెనుకటివలె గురిజాలను నలగామరాజేలుకొనునట్లును, మాచర్లను మలిదేవరాజేలుకొనునట్లును, కోడిపందెములనాటి నియమానుసరణముగ సంధి సంధానింపుమని స్వయముగా జెప్పివంపినది.

బ్రహ్మ :- "కులము చెడినవెనుక గుణముకుదిరె"నన్నట్లున్నది!

గండు :- ఇదేదైన తంత్రముకాదుగదా!

మలి :- మాచర్లనిచ్చెదమనుటకును, ఈయమనుటకును నాగమ్మ యిష్టమేనా? నలగామరాజేమైనాడు?

కొమ్మ :- మాచర్లనిండని రాయబారముపోయిన నా కుమారుని పొట్టనబెట్టుకొన్న నాగాంబ మాచర్ల నిచ్చెదననుచున్నది. శాంతి కాము

కత్వము బ్రహ్మన్నకేగాదు మాకుగూడనున్నదని లోకమును నమ్మ
పెట్టుటకిదొక తంత్రము.

మలి :- ఇదేదో బాగుగ ఆలోచింపవలసియున్నది

(తెరలోనుండి) బాలచంద్రుడు

మ॥ అరరే! యెంతవమానమిద్ది? నను శత్రూరాతి సేనా సము
త్కర కాంతారదవానల ప్రతిమునిన్ - కాసంతయుంజూడ నై
తిరి! మా కేరికి వీరగందమది యేది? వీరతాంబూలమే
ది? రణాహ్వానమటంచు మా కొకని కేది? బాలవీరాళికిన్

బ్రహ్మ :- ఎవరది?

మలి :- బాలచంద్రుడు ఇక్కడికెట్లువచ్చినట్లు? ఆజ్ఞాధిక్కరణమొనర్చి
వచ్చినాడనియేమో? స్కంధావార ప్రధాన ద్వారము కడనున్న
కన్నమదాసు వాని నటకాయించినాడు.

గండు :- కన్నమదాసునకేదో చెప్పి బాలచంద్రుడిటే వచ్చుచున్నాడు.

కేశ :- ఇప్పుడీ బాలచంద్రునితోడ! సంధి విఘాతము!

బాల :- మ॥ అరరే! యెంతవమానమిద్ది (అనుపూర్వోక్త పద్యముతో ప్రవే
శము, ఎవరు పలుకరింపరు) అందఱికి వందనములు! ఇదేమి నా
పట్ల యింత ఉదాసీనత చూపుచున్నారు?

మలి :- మేడపిని విడిచి నీ విక్కడికి రావచ్చునా బాలచంద్రా!

బాల :- మేడపిలో మొలతాడున్న మగవారినెల్ల యుద్ధానికి బిలిచి, వెలి
వేసినట్లు, మా బాలవీరులను త్రోసివేయవచ్చునా? మహారాజా?

మలి :- మీ బాలవీరులతో నీవు నగర రక్షణమొనర్తువనుకొంటిమి అది
చేయక, యుద్ధమున ఏమి బావుకొనవలయునని పరువెత్తి వచ్చి
తివి? అక్కడ నగరమేమికావలయునని.

బ్రహ్మ :- (కోపముతో) దోపిడిగాండ్రపాలు కావలయునని,

బాల :- అట్లేమీకాదు, అక్కడ మాకు బదులుగా అనపోతన్న ఉన్నాడు.

బ్రహ్మ :- అతడు మాత్రము నగరరక్షణకుండునని నమ్మిక మెక్కడున్నది.
రణకండూతి వానికి మాత్రము లేదా? నీ తోకవెంబడినే వాడుగూడ
వచ్చును.

బాల :- ఒకవేళ, అనపోతన్న కారెంపూడికి రావలయుననుకొన్నను
రాలేడు.

బ్రహ్మ :- ఏలరాదు? కట్టివేసితివా రాకుండ.

బాల:- కట్టివేసితిని గిఱముగ, వానిని నా ఆనలచేత కట్టివేసితిని. అనపోతన్న, త్రిపురాంతకము వరకే వచ్చి తిరిగిపోవును. అతడు బ్రాహ్మణుడు. వానికి యుద్ధమేల? వానిని రణనివృత్తునిజేసి నగర రక్షణకుండవలసినదిగా - అతడు వచ్చు మార్గమున కనబడునట్లు రావిచెట్టునకు తాళపత్రముపై ఆనలు రచించి కట్టివచ్చితిని. వానికి, నా ఆనలివి.

గీ॥ వీరమేడపి రక్షణభారమూని
నిర్వహింపుము పోతికి నీవురాక
శ్రీగిరీశుని పదమాన! చెన్ను నాన!
ధరణి నలిదేవులాన, మా తండ్రియాన!

మలి :- కట్టిలచేసితివి బాలచంద్రా! అతడు నీవలెనే రణదోహలుడే. ఒకవేళ రణనివృత్తుడుకాక —

(తెరలో) అయ్యో! బాలచంద్రుడెక్కడ? వానిని నాకు చూపుడు.

బ్రహ్మ :- (పరికించి) ఎవరది? అంతఃపురరక్షకులాలు మాడచివలెనున్నదే?

మలి :- మాడచియే బాలచంద్రా! అదేమో పోయి విచారించుము!

బాల :- (వెళ్లును)

మలి :- (అటుచూచుచు) అదేమి? నెత్తుట తడిసిన జందెము! రక్తసిక్తమైన ఖడ్గము! బాలచంద్రునకిచ్చుచున్నది మాడచి.

బ్రహ్మ :- మలిదేవా! నీవనుమానించినట్లు అనపోతన, ఆత్మహత్యచేసికొనలేదుగా?

మలి :- అదే జరిగియుండును గుండెలు బాదుకొనుచు, ఒడలు తెలియని దుఃఖావేశముతో బాలచంద్రుడిక్కడికే వచ్చుచున్నాడు.

బాల :- మహారాజా! అనపోతన్న మన కికలేడు.

మలి :- ఆఁ ఏమైనాడనపోతు?

బాల :- ఆత్మహత్య చేసుకున్నాడు ప్రభూ!

అందరు :- అయ్యో అయ్యో అనపోతన ఆత్మహత్య!

బాల :- ఈ హత్యకు నేనే కారకుడను. అతడు బ్రాహ్మణుడని, యుద్ధమున బ్రాహ్మణుడు చచ్చుటెందుకని, యుద్ధ నివృత్తుడుగా ఆనలు పెట్టితిని, ఆ రణోత్సాహికుడు నా ఆనలకు కట్టుబడి రణనివృత్తుడుగాక, నిర్లిప్తుడై నిస్పృహతో చేజేతుల ఆత్మహత్యచేసికొన్నాడు. రాజాంకి

తముగాని దేహమేలయని కత్తి పైకెగురవైచి గుండెలొడ్డి నిలిచి నాడట ప్రభూ! అదే సమయమున మేడపినుండి, కారెంపూడికి, ఆ మార్గముననే వచ్చుచున్న మాడచి, నిర్విణ్ణయై నిలబడి చూచు చుండగనే యీ పని జరిగినదట! కొనఊపిరితోనుండి, "నా జందెము ఖడ్గము మా బాలచంద్రునకీయవే మాడచీ" అని మడుగు గట్టిన ఆ నెత్తుటిలో నేపొరలుచు, మూల్గుచు, కన్నుమూసినాడట! అనపోతన ఆత్మహత్య అనివార్యమై విభ్రాంతయైన మాడచి, దిక్కులంటునట్లు అచినదట! అధ్వానపు అడవిదారిలో దిక్కులేక, ఒక్కడును కనుపించక, బిక్కు బిక్కుమన మాడచి వెక్కి వెక్కి యేడ్చినదట! ఈ హత్యకు నేనే మూలము ఈ బ్రహ్మహత్యకు ప్రాయశ్చిత్తము తెలు పుడు ప్రభూ! నాకు యుద్ధాజ్ఞనిండు. నా ప్రతిజ్ఞ నెరవేర్చుకొని, తుచ్ఛ పాంచభౌతిక దేహము వర్జించి, స్వర్గ సీమలో నా అనపోత న్నను కలిసికొందును ప్రభూ! నా ఫాలభాగాన మెఱయుచున్న రక్తతిలకము చూడుడు. ఇది నా మాంచాల దిద్దినది. తల్లి దీవెన లతో, భార్య దీవెనలతో విచ్చేసితిని. ఇక రాజాజ్ఞ, పితృాజ్ఞలతో, రణ యజ్ఞమున నా విధి నేను నిర్వహింతును మా అలరాజుబావ ఆత్మ శాంతికి, నరసింగుని జంపి రక్త తర్పణ మొనర్తును, సెలవిండు ప్రభూ!

మలి:- బాలచంద్రా! ఆవేశముతో ఉన్నావు. స్థిమిత హృదయముతో కొంచెము సేపు కూర్చుండుము.

బ్రహ్మ :- అనపోతన ఆత్మహత్యకు తేరుకొనలేకున్నాను!

గండు :- అపర అశ్వత్థామ కాదగినవాడనపోతన!

కొమ్మ :- అలరాజు హత్య! అనపోతన ఆత్మహత్య! సంధిసాధకమునకు బాధ కములు.

బాల :- సంధి అనుచున్నారేమి? సమరమునకువచ్చి.

మలి :- ధరణికోటరాజు కేతరాజు రాయబారము వచ్చినాము.

బాల :- ఇప్పుడేమి రాయబారము?

కేత:-బాలనాయుడా, మీ మాచర్ల మీకిచ్చెదమనుచున్నాడు నలగామరాజు.

బాల :- మాచెర్లనిచ్చిన సరిపోవునా, మరి మరణించిన మా అలరాజు నెవ రిత్తురు?

కేత :- అదెవరికి సాధ్యము? మరణించినవారిని బ్రతికించువారెవరు? అది గాక అలరాజు హత్య విషయమున ఇదమిద్ధమని యెవరు నిర్ణయింతురు?

బాల :- లోకమెన్నడో నిర్ణయించినది. మీకు తెలియదా కేతరాజుగారు! తెలియుదన్న నేను నిర్ణయించుచున్నా నిప్పుడైన తెలిసికొనవచ్చు ధరణికోట మహారాజగారు! నలగామరాజనంతరము, ఆయన పుత్రి పేరమాంబ పలనాటి సింహాసనాధికారిణియగును ఆమెకు భర్తయై నందున అలరాజు రాజప్రతినిధి కాదగియున్నాడు. అట్లుకాకుండ నలగాముల అనంతరము తనకు గావలయునని యువరాజులగు నరసింగరాజుల ఊహ వాని ఊహలకు దోహదకారిణి మహామంత్రిణి నాయకురాలు అలరాజుహత్యతో, పేరిందేవిసహగమనము! అప్పుడు యువరాజులు మహారాజులగుదురు. వీళ్ల కుట్రకూలిపోను! ఎట్టి రాక్షసకృత్యమునకు పాల్పడినారు! ధరణికోట మహారాజా! ఊరక ప్రియాసతప్ప సంధికుదురుటెట్లు? సామము గీమము సాగదుగాని, సంగ్రామమునకు సిద్ధముకమ్మని నలగాములతో చెప్పుము, మరి నాగమ్మతో, నీ మంత్రి తంత్రములిక కట్టిపెట్టుమని చెప్పుము.

ఉ॥ పాయుని రాజ్యలోభమున - పాల్పడి నాగమతోడి కుట్ర - క
న్యాయముగాగ - అల్లుడనియైన దలంపక రాచమల్లునిన్
మాయముచేసినందులకు నాయునిబిడ్డ, కిశోరసింహమై
నీ యెద నిద్రవోవునని నీ వనుమా యువరాడ్గజేంద్రుతో.

కేత :- నన్ను నిరుత్తరుని జేసినాడు బాలచంద్రుడు. నేనికపోయివచ్చెద.
(లేచి ముందునకు వచ్చి)

మ॥ ఎవతావంగలరీ మహారణము? ఈ హింసావిధం, బీ యువ
ద్రవ, మీమారణ వీరయాగ, మనివార్యంబయ్యె, పల్నాటి వీ
రవరేణ్యుల్ పతనంబుగాంతు, రఖిలాంధ్రక్షోణియున్ విప్లవ
ప్లవమానంబగు- ఘోరరక్తపురుధుల్ పాఱున్, ప్రవాహంబులై

(నిష్క్రమించును)

బ్రహ్మ :- మలిదేవా! యుద్ధము సిద్ధమైనది. అరుణోదయమునకు యుద్ధభేరి మ్రోగవలయును.

మలి :- మన సేనాపతి కన్నమదాసెక్కడ?

కన్న :- ప్రభూ! వచ్చితిని.

మలి :- గీ॥ అనఘ! మున్నుల సేనానియట్లు మాకు
నీవ సేనానివై యింక నిర్వహింపు
మెల్ల సైన్యాధిపత్యం, మే మెల్లరమును
నీదునుడి కట్టుబడియుందు మీ దురమున.

బ్రహ్మ :- కన్నమదాసూ! రేపు సూర్యోదయమునకే యుద్ధము ప్రారంభము
గదా! స్కంధావారమున సేనా సమీకరణము పూర్తి అయినట్లే.
రావలసినవారున్న వెనుక ముందుగ వత్తురు. ఇప్పుడే సేనలకు
యుద్ధము ప్రకటింపుము.

కన్న :- స్వామి ఆజ్ఞ శిరోధార్యము. (ముందుకువచ్చి) ఓ వీరులారా!
వీరాధి వీరులారా! బలపతులారా! దళపతులారా! రేపే యుద్ధము
సూర్యోదయమునకే యుద్ధభేరి మ్రోగును!

సీ॥ ఒకచేతిడాలుతో - ఒకచేతివాలుతో
చుక్కమగలు ముందుకుఱికిరండు
కత్తులం దీయు కత్తులకున్ సాన
పని చాలునో లేదొ కనుగొనుండు
ఏనుగు సేన ముందే చెల్పి ప్రక్క ప్ర
క్కల అశ్వికదళంబు కాచుకొండు
పిఱికి వాడుండిన వెనుక ప్రక్కలనెట్టి
ధీర వీరులు పఱతెంచిరండు
రాజుకై రాజ్యమునకయి ప్రాణములను
తృణముగానెంచి ప్రభు ఋణంబీగికొంటు
మేటి తాతముత్తాతల నాటినుండి
వెలయు మీ జాతి కీర్తులు నిలుపుకొండు.

మలి :- సేనాపతి ఆజ్ఞ తప్పుడే, స్కంధావారమున సైనికోత్సాహము
పెల్లుబుకుచున్నది.

కన్నమ :- (బాలచంద్రుని వంకకు దిరిగి) బాలచంద్రా! యుద్ధమెప్పుడా
యని యువ్విళ్లూరు మీ బాలవీరుల కోరికలు ఫలించినవి. ఉడుకు
నెత్తురు పొంగిపొరలు మీ రొకరినిమించి యొకరు పగతుర మగ్గు
నూచము గావింపుడు?

బాల :- సేనాపతీ! ఎంతో ఉప్పొంగుచున్నాను. చూచుచుండగ బాలుని వీర
ంహారము!

సీ॥ ఉతికెద - పగరపై హుమ్మని కుంభికుం
భాగ్రనిర్భేద్య సింహార్భకముగ
నఱికెద రిపుకంఠనాళముల్ కఱకుక
అక్కున చెఱకు గట్టల విధాన
పెఱికెద - చురకత్తి, వీరభటాళి తొ
మ్ములు చీల్చి ప్రేవులు ప్రోవుపడగ
కొఱికెద - కసిదీర మొఱకు నాయకురాలి
కూటువమూకల కుత్తుకలను
నిటలమున దేవిమాంచాల నిలిపినట్టి
రక్తతిలకము సాక్షిగా - పతిపదముల
సాక్షిగా - తండ్రి బ్రహ్మన్న సాక్షిగా - ప్ర
తిజ్ఞయిదె నృసింహుని తలదెత్తురేపె.

గండు! కన్న !- అల్లుడా! నా తనూజ మాంచాల నీ ఫాలభాగమున రక్త
తిలకముదిద్దిపంపుట వాకెంతో గర్వకారణముగ ఉప్పొంగుచున్నాను.

గీ॥ గండువారాడుపడుచౌర! గండువారి
దిద్దుకొనిభర్త - తిలకంబు దిద్దిపంపె
యుద్ధమునకన్న, యీ సుద్ది ఒకటి చాలు
వెలుగురేకలు దిద్దును తెలుగునాట.

కొమ్మ !- నాయనా! బాలచంద్ర!

ఉ॥ అల్లుడటంచు - ఎంచకయు - అక్కట! దూతగబోవ-చంపి నా
రొల్లమిహాటుతో సుతుని - ఉల్లమునందిది తంపియట్లు అం
పిల్లుచు రాజుచున్నదిర! వీర నృసింహు శిరంబుగొట్టి నీ
విల్లడవైనయందులకు - ఈ పగదీర్పుము చాలు నాకదే.

బ్రహ్మ !- వీరులారా! మీరెల్లరు యుద్ధధర్మములు పాటింపుడు.

సీ॥ వెఱచెడువారిని - వఱచెడువారిని
విడవక వెన్నాడి వేయరాదు
అలసిన వానిని - సొలసినవానిని
పొరపాటుగానైన - పొడువరాదు

కరము మోడ్చినవాని శిరము వ్రాల్చినవాని
కసియుండినను నఱుకంగరాదు
ఆయుధహీనుని అసులతీయమువాని
కాయంబు గాయంబు చేయరాదు
బ్రహ్మనాయుని యుద్ధధర్మంబులివ్వి
మఱచిపోరాదు మన ఆంధ్రమాత, అన!
స్వామి మాచర్ల చెన్నకేశవుని ఆన!
వీర వరులార! విక్రమోదారులార!
(తెరలో ఉత్సాహధ్వనులు)

(తెరపడును)

## నలగాముని నైరాశ్యము

రంగము : కారెముపూడిలో నలగాముని స్కంధావారము

ప్రవేశము : నలగామరాజు, నరసింగరాజు, నాయకురాలు.

నలగా :- నాగాంబా! కార్యముపూడికి కట్టాయితమైవచ్చితిమేకాని, నైరాశ్యము నన్ను వదలిపెట్టునట్లులేదు.

మ॥ అకటా! నా తరువాతరాజయి సముద్యల్లీల - పల్నాటినే
లు కొనంజాలినవాడు నా అనుగుటల్లుండిగ్గె - అయ్యేకపు
త్రికయుంబెన్మిటితో-చితిందుమికె-ఏరిఁజూచుకొంచీ ధరన్
ప్రకట స్థైర్యముతోడ నేలుతిదియేలా? రాజ్యము గీజ్యమున్.

నాయ :- మహారాజా! నీ నైరాశ్యము శత్రులకు దెలిసిన - తేలిక చేయుదురు ధైర్యముతో ముందునకుఱుక వలసిన సమయము. మనసులో ఎట్లున్నను గభీరతాముద్ర అవసరము.

నలగా :- ఏమి గభీరతాముద్ర? మనము వారిని గెల్వగలమా? నాగాంబా!

చం॥ అలిగిన బ్రహ్మనాదులను-ఆహవమందెదిరింప గుండియల్
గలిగిన వాడెవండిచట - కాకలుతీరిన వీరనాయకుల్
కలరట - అర్వదాఱుగురు - కల్గిరి బాలుడు దొట్టి బాల వీ
రు లొకొకడే కలంచు - అనిలో మన సైన్యమహాబ్ధినంతయున్.

నాయ :- ఇంత దిగజారుచున్నావేమి మహారాజా! యుద్ధమునకువచ్చి, వారి నెవరుగెలుతురు? వారొకరికిని మనము చాలమను స్థితికి వచ్చిన నీకు వీరగీతలెవరు బోధింతురు?

నర :- అల్లుడట్లయిపోవుట కూతురిట్లగుట అన్నగారి గుండెనిబ్బరముచెడినది. ఈ మహావిపత్సమయమున అనగూడని మాటలనుచున్నాడు. బ్రహ్మనాయుడన్న భయపడుచున్నాడు. ఏమి చేయుదుము.

నలగా :- తమ్ముడా! నరసింగరాయా! బ్రహ్మనాయుడన్న భయనయములు చూపుట మన విధి.

సీ॥ తండ్రిపోయినదాది తనయులపోలిక
పిన్నలమనలను - పెంచినాడు
శాస్త్రవిద్యలయందు శస్త్రవిద్యలయందు
ఒద్దిక మనలను దిద్దినాడు
నను - పలనాటి సింగపుగద్దెమీద - ఎ
క్కించి రాజ్యమ్మునేలించినాడు
బాహుబలము బుద్ధిబలమును - చూపించి
పల్లెనాటిని వృద్ధి పలచినాడు
మంత్రియై, పితృతుల్యుడై మాననీయ
గురువునై, దైవసముడయి - కూర్చి, పెంచి
నేర్పి, నిలిపిన - ఆ మహనీయు తోడ
యుద్ధమా? యెంత దుర్బుద్ధి - ఒదవెమనకు?

నాయ :- ఇదే న్యాయము మహారాజా! నీ వైఖరి జూడ, కారెమపూడి నుండి సేనలను గురిజాలకు, తరలించుకొని పోవలసినట్లు తోచుచున్నది.

నలగా :- మన సేనలను తరలించుకొని పోవుటయే మంచిది నాగాంబా! బ్రహ్మనాయునితో యుద్ధము చేయలేము

నాయ :- బ్రహ్మనాయునితో యుద్ధము చేయలేమా? బ్రహ్మనాయుడు నీకొక బ్రహ్మరుద్రుడుగ నున్నట్లున్నదే?

శా॥ బోగాకేమి భయంబు? బ్రహ్మనయొకా దవ్వానిపైనైన వా
డేగానిమ్ము - కరాళఖడ్గమిదిగో! యీ చేతిలో నుండి యీ
నాగమ్ముండగ - తేరిచూడగలడే! నాయుండుగియుండునున్
ఈగన్ వ్రాలగ నీను నీ పయిన నీ వింతేల భీతిల్లగన్?

నర :- అన్నయ్యా!

గీ॥ నిశిత ఖడ్గహస్తుండనై నీ అనుజుడ
నేను నరసింగరాయుడ నిలిచినాడ
విక్రమాటోపమున వైరి వీర మస్త
కముల తెగగోయుదును జొన్నకంకులట్లు.

నలగా :- (స్తిమితపడి) మలిదేవుని కడకేగిన కేతరాజు రాలేదు సంధికి వా రొప్పరనియే నా ఉద్దేశము.

నాయ :- సంధికొప్పకుండుటయే మనకు కావలసినది పలనాటి రాజకీయ పరిష్కారమునకు సంగ్రామమే యేకైక మార్గము

నర :- అడుగో' మాటలతోనే వచ్చుచున్నాడు కేతరాజు.

నలగా :- రా - కేతరాజా! కూర్చుండుము.

కేత :- (కూర్చుండును)

నలగా :- ఏమైనది? మన సంధి సమాచారము?

కేత :- వ్యర్థమైనది. వృథాప్రయాసతప్ప, వారిప్పుడుసంధికొప్పుకొందురా!

నాయ :- కేతరాజా! బ్రహ్మనాయుడే శాంతికాముడైనట్లును, మరెవ్వరు కానట్లును. లోకులనుకొనుచుండిరే! దీనితో తేలిపోయినదిగదా! బండారము సంధి కుదుర్ప వ్యయముగా నీవు పోయినందున వారి స్వభావము తెలిసికొంటివి.

కేత :- ఈ సంధియత్నమును, వారికి జంకుటగాగూడ భావించినారు.

నల :- ఆఁ అంతదాకవచ్చినారా?

కేత :- వెనుకకాదని, ఇప్పుడు సంధి ప్రయత్నము జరుపుట నాగాంబ దుస్తంత్రముగా భావించినారు. నాగాంబను నమ్మమనినారు.

నాయ :- అన్ని తంత్రములెఱిగిన మహాతంత్రజ్ఞులకిది దుస్తంత్రముగనే తోచును. నాగాంబను నమ్మకపోయినందున నష్టమేమియునులేదు.

నలగా :- ఇంతకు మా మలిదేవుడేమనినాడు?

కేత :- మలిదేవుడేమైన అనుటకుముందే, బాలచంద్రుడొకమాటన్నాడు, కుఱ్ఱతనము వాని మాటలు ఇట చెప్పుట యుక్తముకాదేమో?

నల :- బాలచంద్రుడు బాలుడుగా వ్యవహరించలేదు కాబోలు!

నర :- తండ్రి తరువాత, మంత్రిపదవులు నిర్వహింపవలసినవాడు గదా!

నాయ :- నిర్వహించును మంత్రిపదవులు! యుద్ధగండము తప్పినప్పుడు గదా! ఇంతకేమనినాడు?

కేత :- ఎన్నో అనినాడు. అవన్ని వద్దు. సామము గీమముకాదు సంగ్రామమునకు సిద్ధముకమ్మనినాడు. సారాంశమిది

నర :- పిల్లనాయుడెంతవాడయ్యెను? యుద్ధనిర్ణేత వీడు.

నాయ :- వీనిమూలమున దేశానికి యుద్ధోపద్రవమున్నదని జ్యోతిష్కులు చెప్పినారుగదా! తప్పదది.

నలగా :- అందుకనియే కాబోలు! దేశశ్రేయమే ధ్యేయమని బ్రహ్మన్న మంత్రి తన్నకొమరుని కన్నమదాసుచేత చంప బంపించినాడు.

నర :- వీనివల్లదేశమునకు యుద్ధమనివార్యమై చావుతప్పించుకొన్నాడన్న మాట. యుద్ధనివారణకెవరెంత పెనుగులాడినను యుద్ధము తప్పలేదు

నలగా :- తప్పలేదు యుద్ధము, కేతరాజు నడిపిన సామమును కొప్పలేదు. ఇక సంగ్రామమునకే సిద్ధము అడుగో! సేనాగ్రమున చింతపల్లి రెడ్డి వెంకరెడ్డి, అన్నమరాజాది ప్రముఖ ప్రధాన వీరులు యుద్ధ ప్రకటన కెదురుచూచుచున్నారు ఇదిగో! వీరారెడ్డి యిటు వచ్చుచున్నాడు రా! రావయ్యా మాడుగుల వంశరత్నమా! రమ్ము! యిటువచ్చి కూర్చుండుము.

వీరారెడ్డి :- (అటువచ్చి కూర్చుండును)

నర :- అన్నయ్యా ఇప్పుడు చూడు!

సీ॥ బెబ్బులి మీసముల్ పెనచి - ఈ య్యెలలూప
జాలు - ఈ నాయకురాలికంటె
కత్తిచేతనెయుండ - కలకంరు సైతము
జాటు పెట్టెడు కేతరాజు కంటె
కొండమీదొటిగిన గుండెచెదరదు గొం
డాన్వయుండా అన్నమాఖ్యుకంటె
మాడుగులకునుండు సాటి చింతపల్లి వా
డౌర! వీరారెడ్డు వీరికంటె
నాయుడొక లెక్కయా? బాలనాయుడదొక
గొప్పయా? అర్వదార్గురై యొప్పునట్టి
వీరనాయకుల్ గొప్పయా? వారియేపు
రేపు చూచెదముగదయ్య రేపు రేపె.

నలగా :- నాగాంబా! యుద్ధమున నీ పాత్రి యెట్లుండనో?
నాయ :- అడుగుచుంటివా మహారాజా! నా గురువు గోపన్నమంత్రి శాస్త్ర విద్యలతోబాటు శస్త్ర విద్యలందు నన్నెంతదిద్దినది రేపు యుద్ధమున మీరే చూతురు!

సీ॥ అసిధారతోబాటు అశ్వధారయుగాగ
గుఱ్ఱపు రౌతుల గూల్చి కూల్చి
చేతికందినయట్టి చెనటి కూటువమూక
చిందరవందర చీల్చి చీల్చి
గవ్వలగుత్తులు గచ్చగుత్తులటు శా
త్రివకోటి శిరములు రాల్చి రాల్చి
దూరాన నుండియే బాణిటెలు విసరి
తుక్కు సేనలనెల్ల దూల్చి తూల్చి
బ్రహ్మనాయునిగెల్చి పల్నాటి రాజ్య
మేకఖండముగా నీదు యేలుబడిని
నిల్పునటుచేయకుండిన నిక్కవముగ
నేను నాయకురాలనే కానుకాను.

నలగా :- సంతోషము నాగాంబా! సంతోషము నీపైగల ఆ విశ్వాసమే నన్ను యుద్ధమునకు దింపినది కేతరాజా! నీ వేమందువు?
కేత :- నలగామరాజా!

మ॥ సమరాహ్వానము లందుటే తడవుగా సన్నద్ధమై నాదు సై
న్యముతోవచ్చితి-అన్నదమ్ములిటులౌనా? యంచు సంధి|పయ
త్నమునుంజేసితి రాయబారినయి, వ్యర్థంబయ్యె-ఇంకేల యు
ద్ధమున న్నీవిజయార్థినై నిలిచి దోర్దర్పంబు చూపించెదన్.

నలగా :- వీరారెడ్డి! నీవు సర్వసేనాధి పత్యముతో సమర తంత్రిము నిర్వహింపుము! యుద్ధార్ణవము నుండి మమ్ము తీర్ణులజేయు నీవే కర్ణధారివి. (మెడలో నరసింగరాజందియుగా మాలవేయును)
వీరా :- మహారాజా!

చం॥ నను దళవాయిగా పలిపి నాకు ఘటించితి వింతగౌరవం
బును - తలయొగ్గి నీ పనుపుబూనెద గుఱ్ఱముదౌ్రిప్పికొంచు వై
రి నివహముల్ శిరంబులవి తెగ్రిస్సి - శరంబులుడుస్సి పోవగా
మును మిడియేయుదున్ విజయమోహనమూర్తిగ నిన్ను జేయుదున్

నలగా :- సేనాపతీ! ఈ శుభసాయంవేళ రేపే యుద్ధమని సేనలకు ప్రకటింపుము.

వీరా :- (ముందుకువచ్చి సేనలవైపు తిరిగి) ఓ సైనికులారా! వీరాధివీరులారా! రేపే యుద్ధము. అరుణోదయమునకే రణదుందుభి మ్రోగును.

సీ॥ తొలినాటి ఆంధ్రవీరుల అతిస్వచ్ఛ కీ
ర్తులకు - కళంకంబు దలప రేని
తాతతండ్రుల సముద్యద్వీరరక్తంబు
మీ జీవనాడుల మెలగు నేని
ప్రభువు కోసము గడ్డిపరకలచాడ్పున
నెమ్మేను లిడగఖూని తిరయేని
విజయకన్యాపాణి పీడనంబునకు మీ
యొడళులుఱంకునలట్ల యిడెదరేని
వీర ధీర శూరత్వముల్ విస్ఫురింప
విజయమో వీరశయనమో పిరుతిలియక
యుద్ధమొనరింపుడీ రేపు యోధులార!
వీరవరులార! విక్రమోదారులార!

నలగా వీరారెడ్డి వీరవాక్యములకు మన స్కంధావారము నందలి సేనలుత్సాహమున ఊగ్రూతలూగుచున్నవి.

నర :- మన వాహినులు వాహినులై మలిదేవుని సేనలను ముంచి వేయును.

నాయ :- మహావీరులారా! విజయలబ్ధికొఱకు ఈ రాత్రి గురిజాల మల్లికార్జునునుద్దేశించి పూజలు జరుపుడు! ఆయుధపూజ లాచరింపుడు! ఎవరి సన్నాహముల వారుండుడు!

(తెరపడును)

# యుద్ధభూమి

## రంగము 1 కార్యముపూడి

దిక్కులదరునట్లు భేరీఝాంకారములు, కాహళధ్వనులు, గజ
ఘీంకారములు, వీర హుంకారములు.

బాల :- (పరివేశము కత్తిదూసి)

మ॥ ఎపుడెప్డారణమంచు జూతు - అది యిప్డేపారె జేజేలు వి
స్తుపడంగా నరసింగరాయుని శిరస్సుంగొట్టి - మా రాచ మ
ల్లు పగల్దీరగ రక్తతర్పణలొనర్తున్ శాంతిచేకూర్తు నా
శపథంబున్నెరవేర్తు వీరజనతాశ్లాఘాయమానంబుగన్.

(వెనుకకు తిరిగిచూచి) ఓహో సోదర బాలవీరులారా! రండు
రండు! నలగాముని సేనలను చీల్చిచెండాడుదము నా కనుగావులై
రండు! చాకలి చందూ! ఝుళిపించు నీ కత్తి! మంగలి మల్లా
మడమతిప్పకు! కంసాలి చంద్రయ్యా! నీ కత్తి కాక చూపించు!
వెలమదోర్నీడూ! వెస వెస ముందుకురుకు. ఊఁ రండు రండు! మన
బాలవీరుల ప్రతాపము తెలుగుజాతి కీర్తికలాపము! మన బొంగరా
లాట నేర్పు ఒక్కొక్కవేటుతో వైరుల తలలెగిరిపడి భూమిపై గిర
గిర తిరుగుటతో సార్థకము కావింపుడు! రండు! నా వెనుకనే రండు!
(ముందునకురుకుచుబోవును వానిననుసరించి బాలవీరులునడుతురు)

కన్నమ :- (పరివేశము కత్తిదూసి)

శా॥ ఔనా? నాయకురాలు మంత్రిణింపదం బందంధకారంబునన్
కావన్ రానటు కన్నుగానక అధఃకారంబుతో బ్రహ్మనన్
తా నొక్కింతయు లెక్కకుంగొనదటే! దర్పంబడింతేలకో?
కానిమ్మిప్పుడు చూపి నా బలము తిక్కం చక్కగావించెదన్,

[ఎదుటచూచి] ఓహో బాలచంద్రుడప్పుడే అనుచర బాలవీరు
లతో యుద్ధమున కుఱికి నలగామునిసేనలను నఱికివేయుచున్నాడు
కన్నులు మిఱుమిట్లు గొలుపు వాని సూర్యబేతాళమునకు కూటువ
మూకల పీకలెగురుచున్నవి బొంగరాలాటగాడు శత్రుల ఉత్త
మాంగములతో సంగరాంగణముమీద బొంగరాలాడుచున్నాడు!

భళి భళీ! బాగున్నది వీని ఆట. సేనాపర్యవేక్షణమునం దప్రమత్తుడనై యీ ప్రక్కనుండి నేనూచకోత మొదలుపెట్టెద. (ముందుకురుకుచు బోవును)

వీరా :- (ప్రవేశము ఈ వైపునుండి)

శా॥ వీరారెడ్డి చమూప్రధానవిభుడై, విస్ఫారదోస్స్ఫారతన్
బారిటెంగొని వైరివీరుల వధింపన్ వచ్చుచున్నాడిదే
వీరావేశముతో రణభ్రమణముల్ విభ్రాంతినిం గొల్పెదన్
రారండిప్పుడు నన్ను దాకగల వీరమ్మన్యులౌ శాత్రవుల్!

(ఎదుటచూచి) ఓహో సంకుల సమరము! బాలచంద్రాది బాలవీరు లురవడించి మా సేనపైబడినారు. ఈ వైపునుండి కన్నమదాసు సేనలను కవ్వించుచు - తన వాలునకు డాలునకు - పని గల్పించుచున్నాడు ఇక ఉపేక్షింపరాదు. నేనిటునుండి, మా సేన పసికొల్పుచు - చిక్కినవారిని చిక్కినట్లు, అందినవారిని అందినట్లు, దొరికినవారిని దొరికినట్లు నఱుకుచు, పొడుచుచు, కెడపుచు, ఊఱుకుచు ముందునకు త్రోసికొని పోయెదగాక! (కత్తి దూసుకొని పోవును)

నాయు :- (ప్రవేశము కత్తి దూసి)

మ॥ నిలుడీ! శత్రుచమూ సమూహములిదే నిర్దిద్ర బాహాసము
జ్జ్వల ఖడ్గంబున మీ తలల్దటిగి శుంభద్రాజభక్తి ప్రభా
కలనం జాటెద - నాగమాంబయెదుటం - కాలూనుడీ! మీసము
ల్గల నిక్కంపుమగల్ ఎనుంజెనకి వీఁకంజూపుడీ! పోకుడీ!

(ముందుకురుకుచు బోవును)

నర :- (ప్రవేశము కత్తి దూసి)

మ॥ నను నిర్జించి శిరంబుదీయగ - ప్రతిజ్ఞల్ పట్టునే బ్రహ్మనా
యుని బిడ్డం - డితడెంత గుండెగలవాడయ్యెన్! నృసింహాభి ధా
ముని బారింబడి ముందు వీనిబ్రతుకుంజూడఁడు - రాసిమ్మను
ద్ఘన కోపానలకీలకున్ శలభముంగావించెదన్ మించెదన్.

అదిగో! నాయకురాలిప్పుడే తన వీరావతారమున తొలిదశ నారంభించినది. ఆడవారిలో ఆహవ క్రీడయందింత యొప్పు వారిని నే జూడలేదు. మహామంత్రిణియే కాదీమె మహావీర! ఈమె ఖడ్గ

ఛాలనమపూర్వము! మండల పరిభ్రమణమున వాలు డాలులా, తళ తళలతో - పరివేషము గల్పించుచున్నవి. కాని, చేతులలో ఉన్నట్లే కన్పించుటలేదు శత్రుల తలలు బంతులవలె ఎగరుచున్నవి. శిరము లూడిన మొండెములు కరముల కత్తులు త్రిప్పుచునే పొరిగి ఒరిగి పోవుచున్నవి ఈమె వీరఖేలనము కూరగాయలు తరిగి పోయులా గున్నది. నాయకురాలు అభినవ దుర్గాదేవి!

సీ॥ అరిసేనదరియంగ - అపుడప్పుడే పుట్టు
సిడిముడిచే మోము జేవురింప
ఎదిరిన సేనల విదళించు పట్టున
నేత్రగోళంబుల నిప్పులురల
వివిధ భంగుల - కత్తి విసరుచో మెఱపులా
గగనభాగంబున గప్పికొనగ
హుమ్మని పగదపై హుంకరించెడు తటి
దిగ్గజకర్ణముల్ దిబ్బిరికొన
కొప్పుముడిపెడి కురులు చిక్కుపడునట్లు
కూటువబాసంబులవియు - చిక్కులు పడంగ
తొలిదశనె దుర్నిరీక్ష్యయై దుర్నివార
పరటిగనుపట్టె నాగాంబ సమంకేళి

నేనీ దెసనుండి శత్రులగసిమసంగించెదగాక (వెళ్లును)

ప్రవేశము :- దామానాయుడు, గోపీనాయుడు

గోపీ :- మిత్రమా! ఉభయపక్షముల దారుణ సంగ్రామము సాగు చున్నది.

సీ॥ అది వినుః భట కృతాహంకృత హుంకృతు
లదురు గుండెల కుదుళ్లార్చుచుండె
అది కనుః తలపాగ లవి వ్రేల శిరములు
తెగి గాలి పడగల బ్లెగురుచుండె
అటుచూడు! బాలనాయని కత్తి తళ తళల్
పొడమి విద్యున్మాల లదరుచుండె
ఇటుచూడు! నాగులయేటికి మాఱుగా
ఏఱులై నెత్తురు పాఱుచుండె

అదిగదిగో, అన్న పెద్దన్న - ఆయుధంపు
తాకునన్ మూర్ఛిల్లిచచ్చు దంతావళములు
కూలుచున్నవవే చూడు! ఘోటకములు
వ్రాలుచున్నారదే! చూడు! కాలి బంట్లు.

దామా :- ఉభయసేనా సంకుల యుద్ధము! నిర్నిరుద్ధమై సాగుచున్నది.

సీ॥ క్రొత్తకాపురపు కోఁగ్రొత్త తీపులు గూడ
పోనాడివచ్చిన పోటు మగలు
ప్రియురాండ్రి కౌగిండ్ల పెనకువలను గూడ
విడనాడి వచ్చిన బిరుదుమగలు
కన్నబిడ్డలమీది కడుపు తీపులు గూడ
కాదని వచ్చిన జోదుమగలు
ముసలులై కుక్కిట మసలు తండ్రులగూడ
ఒదిగించి వచ్చిన ఉక్కుమగలు
అలమొక పెండ్లిగాగ జయాంగన యొక
పెండ్లిపడుచుగ తామొక పెండ్లికొడుకు
లట్లుగా- ప్రాణముల- ఓలియ ట్టు లొడ్డి
దాటుచున్నారు పలనాటి మేటిమగలు!

గోపి :- (అటుచూచి) అయ్యో! అయ్యో! మన అన్న పెద్దన్న ప్రమాదంలో చిక్కుకొన్నాడు ఏనుగుపైనుండి నలగామరాజు, తన నిశితబల్లె ముతో అతని వక్షస్థలమును గురిచేయుచున్నాడు.

దామా :- ఇంకేమున్నది! తనచేతిలాఘవకొలది విసరిన నలగాముని బల్లెము పెద్దన్న కవచము సైతము చించుకొని రొమ్మునదూసి పోయినది. దొడ్డనాయని పెద్దబిడ్డ, బ్రహ్మన్నఅన్న, అన్న పెద్దన్న బాదన్న మన కికలేడు.

గోపి :- పెద్దన్న పోటునకు అటు జయార్భటులు! ఇటు భయార్భటులు; అదుగడుగో! పెత్తండ్రిపడుటవిని కాబోలు! పరుగులతో మరుగులు త్రొక్కుకొనుచు వచ్చి, బాలచంద్రుడు. పడియున్న పెదనాన్నఁగని శోకమును ఉద్రేకమును దీపింప నలగాముడు చేసినపనికి పల్లు కొఱుకుకొనుచు ఇప్పుడే నఱుకున ట్లురుకుచున్నాడు.

దామా :- నలగామరాజు ఇప్పుడక్కడలేడు ఎటుపోయి ఎటువచ్చునోయని అవలికి తీసుకొనిపోయినది నాగమ్మ

గోపీ :- బాలచంద్రుడు చూడు! అడ్డువచ్చిన పగతుర దంతులను చొప్ప దంటులవలె తరుగుచు, అరటితోటలోబడిన గున్నయేనుగును దల పించుచున్నాడు

దామా :- తాళు తాళు: ఐతమ్మ కొడుకేమో అనుచున్నాడు?

(తెరలో) బాలచంద్రుడు

శా॥ ఔరా! మా పెదతండ్రి చావునకు మీరప్డే ముదంబందుచు
న్నారా? మీ పని యింతతేల్చెదను లేరా! తోక త్రొక్కంగ దు
ర్వారప్రోద్ధతి లేచు త్రాచుకరణిన్ బాలుండిదేలేచె మీ
రేరీతిన్ బ్రతుకంగజాలుదురొ? యిప్డేచూచెద న్నిల్వుడీ!

గోపీ :- బాలచంద్రుడిప్పుడు నిజముగ తోకత్రొక్కినత్రాచుపామైనాడు.

దామా :- అదిచూడు! ఏనుగుపైనున్న ఆ వీరునిపైకి కొదమసింగమువలె కుప్పించి లంఘించినాడు

గోపీ :- నాయునిబిడ్డ, ఆ మదనాగముపైనున్నవాడు నరసింగరాజను కొనినాడేమో? ఎగిసి సూర్యబేతాళమున ఒక్కవ్రేటుతోబడ సేసినాడు.

దామా :- అంతటితో ఆగలేదు వానితలగొట్టి,తీసికొనిపోవుచున్నాడెక్కడికో,

గోపీ :- పొరపాటు! పొరపాటు! ఏనుగుపైనున్నదివెంకురెడ్డి - నరసింగ రాజనకొని కృతవర్తిజ్ఞుడైనట్లు నాయకులకు, ఆ తలచూపించుటకు కాబోలు! పోవుచున్నాడు.

దామా :- పాపము! బాలచంద్రుడు, రాచమల్లుపగతీరినట్లు సంబరపడినాడు.

గోపీ :- నాయకుల, ఆ శిరస్సు నరసింగునిదికాదన్నట్లున్నది. మొగమెత్తి బాల అనిమొనపైపు మొగమై వచ్చుచున్నాడు.

దామా :- ఇప్పుడు బాలచంద్రునిమూర్తి పద్మవ్యూహము భేదించునాటి అభిమన్యుని అనుకరించుచున్నది.

గోపీ :- నేటితో నరసింగుని నూకలుచెల్లినట్లే.

దామా :- మెఱపుమెఱసినట్లు రణభూమియందు ఎటుచూచినతానెయగుచు, అడ్డమువచ్చిన సేనలను చీల్చిచెండాడుచు, కొసంతలో కదనక్షేత్రము బీభత్సముచేయుచున్నాడు.

గోపీ :- నలగామునిసేనానీకము కాందిశీకమగుచున్నదే!

దామా :- కాందిశీకముగాకేమగును? అదిగో! చిందరవందరగా బడిపోవుచున్న తమసేనలను నిలువద్రొక్కుకొనుటకు కాబోలు! వీరాలాపములాడుచు నరసింగరాజిటువచ్చుచున్నాడు. మనమావలకు పోదము పద. (పరిక్రమింతురు)

(తెరలోనుండి) నరసింగురాజు

మ॥ అరరే! నాయునిబిడ్డశాకునకు సైన్యంబెల్ల దైన్యంబునన్
విరుగంజొచ్చెనొకో? రిపుప్రకర దుర్వృద్యప్రిత పుండు- భీ
కర సంగ్రామకలా కలాపుడు - ధృతిక్ష్మాభృత్తుక్కడీ భూరమా
వరసూనుండు నృసింహుడూరకొనునే? వైరిప్రభాయుక్తికిన్

క్రుమ్మక్కడి మూకలు! ఒక్కబాలునికి ఉక్కుదక్కి పిక్కబలము చూపుచున్నవే? ఛీ! పాలుబోతులారా!

ఉ॥ సిగ్గుమానిమీ రిటులిసీ! పగవానికి వెన్నుచూపగా
దగ్గదె? మీశరీరముల - తగ్గెనె? రోసముపాలు - పౌరుషం
బొగ్గిని గల్పుకొందురె? మదారులు మిమ్ములగేలిచేయరే?
వగ్గెలుబుగ్గిపాలు సలుపందగునే? పిఱువీకలొప్పునే?

మలుకులగు నా పలుకుల కలకపెచ్చరిల గాలి చేత త్తులవలె, కరతాడనమున కందుకములట్లు పిఱువీకుల తుప్పావడల్లకత్తులుత్రిప్పుచు శత్రుసేనలపైకి తిరుగబడుచున్నారు నేనటుపోయి వారికిమఱింత ఉసెక్కించెద. (పోబోవును)

(తెరలోనుండి) బాలచంద్రుడు.

చం॥ నిలునిలు మేడకేగెదవు? నీచ నృపాధమ! రాచమల్లు - పూ
వులను విసంబుబెట్టి- అసుప్రెల్ హరియించిన కుచ్ఛితుండ, వి
ల్లలికిన తోనె ఎందుగగునా? ఇదె బాలునికత్తికాకలం
దెలియదుగాక! బిల్వుమురా? నిక్కముగా మగవాడవైనచో.
(కత్తి దూసి ఉఱుకుచున్నాడు)

నర:- డింభకా! దంభములేలపల్కెదవు? నీ సంరంభ మిప్పుడే తీర్చెదరమ్ము!

బాల!- వచ్చితిని, వెదకబోయిన తీగ కాలికిదగిలినట్లు నీవిక్కడకే దొరికితివి. కుచ్ఛితుడా! నలగామరాజు, అమాయకుడై నిప్పునొడియందుబెట్టు

కొన్నట్లు నిన్నును, నాగాంబనునమ్ముకొని, ఇంతముప్పుతెచ్చు
కొన్నాడు. రాజద్రోహీ! నలగామరాజుతరువాత, ఆయనకూతురు
పేరిందేవికి చెందవలసినరాజ్యమును చూఱగొనవలయునని, అల
రాజుతో ఆమె సహగమించుననని, కుట్రపన్ని. రాయబారిగారాగా
పూవుల్లో విషము పెట్టిచంపించితివి. దుర్మార్గుడా! నీ కడుపులో
ఎంతున్నదిరా! నీకుతోడు పలనాటిరాజ్యమా? నిన్నిప్పుడే నరక
రాజ్యమునకు పట్టభద్రునిజేసెద. అలరాజుపగతీర్పుటకు, నా సూర్య
బేతాళము నరసింగుడు నరసింగుడని నాలుక కోరియుచున్నది

నర :- పిల్లనాయుడా! నీయబ్బ బ్రహ్మనాయుడడ్డుపడినను నిన్నుచంపక
విడువనుసుమా!

బాల :- ఓసి! ఎంతమొనగాడవు! నాఅబ్బచేతిక్రిందపెరిగిననీవు ఆయనను
లెక్కచేయనివాడవైనావు. నాగాంబవల్ల నీకెంత ఉమ్మాసము
వచ్చినదిరా. నీచావు నా చేతిలోఉన్నది. ఇదే నా సూర్యబేతాళము

నర :- ఉ॥ ఏమది అంతవాడిగలదే ఝుళిపించుచు నీనుకత్తి నా
కీమెయి జూపసాగితివి - ఈ యువరాజు నృసింహుతోడి సం
గ్రామమునంగ ఏమనితలంచితి బొంగరమాట కాదురా!
నీమెడ గాచుకొమ్మిదిగొ! నిర్దళనంబగు-ఒక్కవ్రేటు తో,

(వ్రేటులను డాళ్లతోతట్టుకొనుచు కత్తులుతాడింపుచు ఒకరి
నొకరు త్రోసికొనుచు పోవుదురు)

(ప్రవేశము దామానాయుడు, గోపీనాయుడు)

దామా :- మిత్రమా! బాలచంద్రనరసింగుల ద్వంద్వయుద్ధము!

గోపీ :- వాలుడాలుల ఝణఝణాత్కారములు!

దామా :- ఒకరినొకరు త్రోసిపోక పోరుచున్నారు!

గోపీ :- అదిగో! నరసింగరాజు బల్లెమువిసరినాడు. అది బాలనాయుని
డొక్కలోనాటి ప్రేవులనుగ దలించినట్లున్నది.

దామా :- అదిలెక్కచేయక బాలనాయుడు కత్తి విసరినాడు.

గోపీ :- అబ్బా! బాలచంద్రునికత్తి నరసింగునికి మిత్తియైనది.

దామా :- సొరిగిసొరిగి నేలకొరిగినాడు నరసింగరాజు.

గోపీ :- నేలకొరిగిన వాని తల కోసికొని పోవుచున్నాడు బాలచంద్రుడు.

దామా :- ప్రతిజ్ఞ నెరవేరినదను ఉత్సాహముతో ఉప్పొంగుచున్నాడు.

గోపీ:- అటువదాటుగురునాయకులకు నరసింగునితల చూపవలయునని కాబోలు? బిరబిర పోవుచున్నాడు.

దామా :- అదిగో! నరసింగుని తలనుజూచి బ్రహ్మనాయుడు దుఃఖించుచున్నాడు.

గోపీ :- మరణశయ్యమీది అలుగురాజుమాటలు జ్ఞప్తికివచ్చినవికాబోలు!

దామా :- బాలుడుచేసినపనికి, అచ్చట నొచ్చుకొనువారేగాని మెచ్చుకొనరేమి?

గోపీ :- అదేమి బాలనాయుడు చివాలునవెనుదిరిగి అటుపోవుచున్నాడు?

దామా :- గంగధారమడుగువైపునకు బోవుచున్నాడు. ఎందుకో చూతము వద. (వెళ్లుదురు)

నల :- (ప్రవేశము దుఃఖముతో)

మ॥ అకటా! నన్ను రణార్ణవోత్తరణు జేయంజాలగా - కర్ణ ధా
రకు నట్లొప్పెడువాడు తమ్ముడిపుడే ప్రాణంబులంబాసె బా
లకుచేనంచిటు కర్ణభేద్యమగువార్త న్విఁటి దుఃఖాబ్ధి వీ
చికల న్నాదుమనంబు సంక్షుభితమౌ జీవించుటెట్లోగదా!

సోదరా! శూరమాదేవికుమారా! నరసింగరాయా! నీవింతకు ముందు రణరంగమధ్యమున ప్రచండమార్తాండునివగిది దుస్సహకరవాలదీప్తులతో ప్రత్యర్థివీరగర్వాంధకారము విరియజేయుచుంటివే! ఇంతలోనే అస్తమించితివా? కుడచికూర్చుండక కొలవితో తలగోకికొన్నట్లు నేనీరణముతల పెట్టినది నీమరణమునకా?

గీ॥ ఎఱిగియెఱిగి బుద్ధివిహీనుడనయి
బ్రహనాయునితో - ఇటువైరమూని
కూర్మితమ్ముని - పోగొట్టుకొంటి - చెట్టు
గొట్టి తనమీదికే తెచ్చుకొన్నయట్లు.

(తెరలోనుండి) నాయకులారా!

మ॥ నమలేకుండగజూచి - ఆవలిదెస న్మత్తారి సేనా నికృం
తనకేళీరతి ఇంతమైమఱచియుండన్ పీలుకన్పింపగా
దునుమాడె న్నరసింగరాజు శిరమున్ దుష్టుండు బ్రహన్న నం
దనుడౌరౌర! ప్రతిక్రియన్సలుపకే నాగాంబసైరించునే?

(ప్రవేశించి) జయముజయముమహారాజా!

నల :- జయము - ఇంకెక్కడి జయమునాగాంబ! నా కుడి భుజము నలసింగరాజు పోయినాడు.

నాయ :- నరసింగరాజుపోయిన నాగాంబలేదా?

ఉ॥ ఏటికిటుల్ చలించెదు మహీతలనాయక! సంగరక్రియా
పాటవమూనినా మొదలిపై - తెగియించియు కాదె? శాత్రవో
ద్ఘాటన మాచరించుటయు తక్కచలించుట వీరధర్మమే?
రోట శిరంబువెట్టి మఱిరోకలిపోటున కేలజంకగన్?

నల !- మనము నాయునితో యుద్ధముచేయలేము నాగాంబా!

నాయ !- మరల మొదలుపెట్టితివా మహారాజా! నాయి కురాలు మీచెంత నుండ నాయుడుకాదుగదా వానిదేవుడు చెన్నయ్యవచ్చినను నిన్ను తేరిచూడజాలడు.

ఉ॥ ఖండనమందు నీవలఁగు పట్టగనా పని బూననేల? నీ
వుండుమురాజ!వాలుగొని యుద్ధమొనర్చెడు నన్నుజూడు,నా
యుండడ లోఁదిచూడ - తల నూడగజేసెద బాలనాయనిన్
గండరగండలెల్ల నను గన్గొని నివ్వెఱపాటు చెందగన్

నల !- నాయకురాల! నన్నీ యుద్ధాబ్ధినుండి ఒడ్డుచేర్ప నీవ నావికురాలివి. నీమాటలు నాకు ధైర్యమూదు కొల్పుచున్నవి.

నాయ :- బాలచంద్రుడిప్పుడు గాయములు కడుగుకొన గంగధారమడుగునకు పోయినాడనివింటిని వాడువచ్చులోపల దోర్నీడు సూర్నీడు మొదలగు వాని అనుచరులను ఒక్కొక్కరిని వరుసగ యుద్ధభూమికి బలియిచ్చినంగాని, ఒక్కడై వెనుకజిక్కిన బాలుని చక్కజేయ వీలుండదు. గజారోహణమొనర్చి నీ వంతయును పర్యవేక్షించుచుండుము. అదిగో! దోర్నీడు - ఇదిగో! సూర్నీడు; వాడె చాకలి చందు, వీడె మంగలిమల్లు, వాడె కంసాలిచంద్రయ్య, వీడె కుమ్మరి పట్టి,వీరందఱిని నుఱుబెట్టెద చూడుము! ఓరోరి నానాజాతి వీరులారా!

చం॥ నిలునిలుఁడోరి డంభకులు! నేగిదెవచ్చితి - కాచుకొండు మీ
తల లవియెల్లనుందరిగి తామరపూలటు భూమిదేవి వే
నలిని-అలంకరించెదను నాయునిబిడ్డనికై నిరీక్షణల్
సలుపుడు స్వర్గధామమున రాగల దాతడుగూడ వెన్కనే.

(కత్తిదూసి ముందుకురుకుచు చంపబోవును)

నల :- నేనును గజారోహణమొనర్చి నాగాంబవీరవిహారము సమీక్షించెద
(వెళ్లును)

బాల :- (తూలుచుప్రవేశము) అబ్బా! ... శరీరమంతయును.... జర్ఝరిత మైనది .. రక్తము ... ఒడిసిపోయినది. (నడుపబోయి శవములు కాలికిదగిలి పడును) .. పాడుశవములు . కాళ్లకు ... అడ్డమై.... నన్ను.... పడవేసినవే - ఇవి పాడుశవములు ... కాదు. రాజు కొఱకు. అసువులు . పాసిన .. ధన్యజీవుల ... కళేబరములు ... (ఎక్కడనుండియో ఈటె రివ్వనవచ్చి తొమ్మనగుచ్చుకొనును) దొంగిచాటుగా ... దూరాన ... ఈటెవిసరినదెవరు?.... ఇంకెవరు.... నాగాంబ ... చేసిన .. పని ... ఛీ' పిఱికిపంద.... రణధర్మములు.... మట్టిలో కలిపినది . నేను .. పడినను ... తన్నుమదాసున్నాడు లే ... శట్టివేసి ... కాలరాచును .. అబ్బా!.... బాధ.... నేనుబ్రతుకను .... చెన్నకేశవా!.... చెన్నకేశవా!.... చెన్నకేశవా! .... (చేతులెత్తి నమస్కరించుచు నేలకొరిగిపోవును)

– : నేపథ్యము : –

కం॥ పడినాడు బాలచంద్రుడు
పడె మన బ్రహ్మన్న కొడుకు బావురుమనియెన్
కడలెల్ల – తెలుగుతల్లి కి
ఎడద పయిన ఈటెగుచ్చిరే! యిటులయియో!

(దామానాయుడు, గోపీనాయుడు ప్రవేశము)

దామా :- అయ్యయ్యో! బాలచంద్రుడు ఒఱిగి పోయినాడు.

గోపీ – సూర్యుడు తన చండకిరణములతో లోకము తపింపజేసి అస్తమించి నాడు,

దామా :- బాలచంద్రుడు తన ఖడ్గప్రహారణముల శత్రుల తపింపజేసి అస్తమించినాడు

గోపీ :- లోకము చీకటివ్యాపించుచున్నది, ఆ పక్షమున నరసింగరాజు, ఈ పక్షమున బాలచంద్రుడు పతనమైనారు

దామా :- బ్రహ్మనాయునికి పుత్రశోకము!

గోపీ :- నలగామరాజునకు భాతృశోకము!

దామా :- ఉభయస్కంధావారముల నిబిడదుఃఖాంధకారములు పరివ్యాప్తములు

గోపీ :- అదిగో, సాయంసమయ యుద్ధవిరమణభేరి. మోదముపద.

(తెరపడును)

# బ్రహ్మనాయుని విషాదము

ప్రవేశము : బ్రహ్మనాయుడు, కన్నమదాసు

బ్రహ్మ :- బాలచంద్రా! రేచర్ల పద్మనాయక వంశ వారిధి చంద్రా! నీవిప్పుడే కడతేరితివా తండ్రీ!

చ॥ నలువురమన్నదమ్ములకు నందను డీ వొకరుండ వంచునుం
తెలుపము యుద్ధముంగుఱించి, తెల్పకయుండియు—ఏమియయ్యె—జో
స్యులు మునుదెల్పినట్టులుగ యుద్ధపుగండము నీ కదేమియుం
తొలగక పోయెనే కొడుక! త్రుంగితి కార్యముపూడి పోరిలో.

యుద్ధమున నీవు చూపిన అసామాన్యప్రతాపము విని నేనెంతో గర్వపడుచుంటినే! ఇప్పుడే ఆ గర్వరేఖ చెఱిపి వేసితివా తండ్రీ!

తీక్ష్ణాంశువులతోడ దీపించి దీపించి
అస్త్రాద్రి కొఱుగు చండాంశునట్లు
ఉరుతరంగాలతో ఉప్పొంగి ఉప్పొంగి
అంతలో నడగు మహాబ్ధియట్లు
గహన ద్రుమము లెల్ల దహియించి దహియించి
ఆరిపోనైన దవాగ్నియట్లు
వరదలు వాకలై వర్షించి వర్షించి
మెల్లగా విఱిగిన మేఘమట్లు
ఎదిరికొను వైరివీరుల చదిపి చదిపి
తునిమితూటాడి శిరములు త్రుంచి త్రుంచి
శ్రమము గదురంగ రణరంగ శయ్య పైన
పెద్దనిద్దురపోయితే ముద్దుకొడుక!

కన్న :- అబ్బాయి ప్రతాపము అఖిలాంధ్ర జాతికి గర్వకారణము? ఈసంగతి వింటిరా? మన బాలచంద్రుడు, నరసింగరాజు విసరిన యీటె డొక్కలో నాటి ప్రేవులు దూసికొనిరాగా, ఒక చేతితో లోనికదిమిపట్టి మరొకచేతితో ఖడ్గము విసరి నరసింగుని నేల కూల్చినాడట!

బ్రహ్మ :- అట్లనా కన్నమదాసూ!

చం॥ అదయుడు రా జుతమ్ముడట లక్కట! యీటెను పుచ్చి డొక్కలో
గుదులుగ పేగులాడిపడగొట్టినవాడటె! జాఱు పేగులన్-
ఉదురుగ-ఒక్కచే-అదిమికొంచును కొండొకచేతి కత్తితో-
చిదిమినవాడటే అతని శీర్షము చిత్రము చిత్రమెంతయున్.

కన్న :- భారతయుద్ధమున అభిమన్యునివలె, పలనాటియుద్ధమున మన బాలచంద్రుడు నిస్తంద్రపరాక్రమముచూపి, ఆంధ్రావనికి పేరు తెచ్చినాడు. జరామరణవర్జితమైన కీర్తి వానికి దక్కినది.

బ్రహ్మ :- అభినవాభిమన్యుడురా! వాని వీరఖేలనము.

శా॥ పద్మవ్యూహముచించి, మించిగురు గర్వస్ఫూర్తి, కౌరవ్య హృ
త్పద్మంబు ల్మగుడించి, కుంభజకృపాశ్వత్థామ కర్ణాదికుల్
ఛద్మంబూని వధింప - అమ్మెయి సుభద్రాసూను డా దేవతా
సద్మంబేగినయట్టులైతి తనయా! సాంద్రప్రతాపోదయా!

కన్న :- అభిమన్యుని కర్ణాది మహాయోధులు పదుగురేకమై చొంగచాటున గొట్టినట్లే మన బాలచంద్రునిగూడ ఎదుటనున్నవా డెవ్వడును గొట్ట లేకపోయినాడట! ఎక్కడనుండియో యీటె రివ్వునవచ్చి మన బాల నాయుని గుండెలో గ్రుచ్చుకొనిపోయినదట!

బ్రహ్మ :- ఆఁ అట్లనా? కన్నమదాసూ! తప్పక యిది నాగాంబ చేసిన పనియే. ఆమెకు మాపై అంత యీసెందులకో?

కన్న - ఆమె మూర్తీభవించిన మతోన్మాదిని.

బ్రహ్మ : ఆమె కెందుకింతమతోన్మాదము? మనము మాచెర్ల చెన్నయ్యను గొల్చినట్లే, కొండమల్లయ్యనుగూడ గొల్చెదమే. హరిహర భేదమేల పాటింపదు? మానని మతద్వేషముతో నా కుమారుని పొట్టన బెట్టు కొన్నది.

కన్న :- ప్రతీకారమొనర్చెదము. బాబయ్యా! చీకటి పడినది. శిబిరము నకు బోదము

బ్రహ్మ :- చీకటి! జీవితము చీకటి! దేశమెల్ల చీకటి! పేలుకొన్న కాలు చీకటి! ఈ చీకటిలో కనులు కనబడుటలేదు. నన్ను శిబిరమునకు తీసికొనిపో కన్నమదాసూ!

కన్న :- (బ్రహ్మనాయుని చేయిపట్టుకొని తీసికొని పోవును)

(తెరపడును)

# పలినాటి యుద్ధము

అరుణోదయము : ఉభయస్కంధావారములనుండి రణభేరీ ఝాంకారములు : సంకుల సమరము : కలకలము.

ప్రవేశము : దామానాయుడు, గోపీనాయుడు.

దామా :- మిత్రమా! నిన్నటి యుద్ధమున చావగా మిగిలిన వారింగూర్చుకొని, ఉభయ పక్షముల వారును నేడరుణోదయమునకే యుద్ధమారంభించినారు. ఇటు మలిదేవరాజు పక్షమున, కొమ్మరాజు, కన్నమనీడు, బ్రహ్మనాయుని సోదరులు పేర్నీడు, సూర్నీడు, మొదలగువారు ప్రధాన యోధులుగా కన్నమదాసు సేనానాయకత్వమున యుద్ధరంగమున కుఱికినారు. అటు నలగామరాజు పక్షమున వీరారెడ్డి సేనానాయకుడుగా చింతపల్లిరెడ్డి, కేతరాజు, నాయకురాలు మొదలగువారు యుద్ధమున చొరబడినారు.

గోపీ :- ఉభయ సేనల సంకుల యుద్ధము! గజ ఘీంకారములు, వీర హుంకారములు, తురగ హేషలు, దిక్కులు చెవుడువారజేయుచున్నవి. క్షణ క్షణమునకు యుద్ధభూమి బీభత్సస్థితి పొందుచున్నది.

సీ॥ రక్తపూరితమైన రణరంగశయ్యపై-
పొరలి పెన్నిద్దుర పోవువారు
అవయవమ్ములు తెగి - ఆలుబిడ్డలమీది
ప్రేమ నిట్టూర్పులు విడుచువారు
పీనుంగులై పడు - ఏనుంగుల నడుమ
ఇఱికి మెసలలేక యీల్గువారు
గొంతులు కోసిన గొఱ్ఱెలట్టుల తల్
కునుమగా బడి తన్నుకొనెడువారు
రౌతులెడలిన గుఱ్ఱముల్ రథసలోన
కాళ్లు గుదిబడదిగబడు కాలిబంట్లు
గజిబిజిగనౌచు సంగరాంగణ మిదెల్ల
మృత్యుదేవత కేళికా గృహముయయ్యె.

దామా :- అటుచూడు! గండువాడగు గండుకన్నమనీడు, నలగాముని సేనాపతి వీరారెడ్డిని మార్కొనినాడు.

గోపీ :- ఎవరికెవరు తీసిపోరు. ఇద్దఱిద్దరే రణవిద్యాకోవిదులు.

దామా :- మన సేనాపతి కన్నమదాసుంజూచితివా? వీరారెడ్డి విక్రమిం చుట చూచి తన కడ్డము వచ్చినవారినెల్ల, కత్తికి బలియిచ్చి, కన్నమనీనికి సాయుపడ - అక్కడకు చేరుకొనినాడు.

గోపీ:- అది చూచి కాబోలు! ఇటునుండి చింతపల్లిరెడ్డి, కన్నమదాసుం గవిసినాడు

దామా :- కన్నమదాసు, గురుని వీరవిద్యావిశేషమంతయు-పుణికి పుచ్చు కొన్న శిష్యుడు, ఒక్కవ్రేటుతో చింతపల్లివానితల డొల్లసేసినాడు.

గోపీ :- అదిచూడు! వీరారెడ్డి, రోషావేశముతో మన గండువాని కత్తి, తన కత్తితో ఎగురగొట్టి గుండెలో పొడిచినాడు.

దామా :- అయ్యో! బాలచంద్రుని మామ పడిపోయినాడు.

గోపీ :- ఇటుచూడు! మన రాజుతమ్ముడు పినమలిదేవుడు, కన్నమదాసుతో బోరాడు వీరారెడ్డి కడ్డమువచ్చి, వానితో యుద్ధమునకు తలపడి స్వర్గధామ మందికొన్నాడు.

దామ :- తమ్ముని పాటునకు, మలిదేవరాజు, శోకక్రోధములు ముప్పిరి గొన యుద్ధమున కుఱికినాడు.

గోపీ :- రాజు కదలుట చూచి, మహామంత్రి బ్రహ్మన్నయు గదిలినాడు.

దామా ,- మహామంత్రి ఇంతదాక తన కుమారుని మరణ దుఃఖముతో నిస్స్పృహలో బడియుండ, పినమలిదేవుడు, వియ్యము లవాడు కన్నమనీడు, తమ్ములు పేర్నిడు, సూర్నిడు వీరందఱు బడిపోవుట చూచి కోపాగ్ని తప్తుడై కుంతమెత్తినాడు.

గోపీ :- అయన ఏదో అనుచున్నాడు, అదివిను!

(తెరలో) బ్రహ్మనాయుడు

శా॥ నిర్ఘాత ప్రతిఘంబు కుంతమిదె పాణింబూని నాయుండిదే
దీర్ఘ క్రోధ పరీతుడౌచును మహోదీర్ఘ ప్రతాపంబువన్
నిర్ఘోషంబులెర్పవచ్చె నిలుడీ! నీచాత్ములారా! నురల్
నిర్ఘాంతంబడి చూడ మీ శిరములన్ నే డాటలాడించెదన్.

దామా :- అబ్బా! పిడుగులు రాలుచున్నవి!

గోపీ :- ఇక శత్రువుల తలలురాలును.

దామా :- అలుక యెఱుగని ధర్మరాజు, బ్రహ్మన్న అలిగినాడు.

గోపీ :- బ్రహ్మనాయుడు సామంతరాగోలతో విజృంభించినాడు! అరరే!
నలగామరాజు పాఱిపోవుచున్నాడే!

దామా :- వీరులపతనముతో కలతనొందిన మాచెర్లసేన, మలిదేవ బ్రహ్మ
నాయులు యుద్ధమున తారసిల్లుటచూచి ఉత్తేజితములగుచున్నవి

గోపీ :- కన్నమదాసు. కదనభూమిలో తన స్వామి కన్నులఎదుట . పండు
వుగా మిన్నందుకొనుచున్నాడు.

దామా :- అడుగో! మాడుగుల వీరారెడ్డిని దాకినాడు

దామా .- ఇద్దఱు సేనాపతులే! గండరగండలు! కొసేపులోనే కాలువలుగా
నెత్తురు పాఱించుచున్నారు. అబ్బా ఎంత భయంకరము! ఎంత బీభ
త్సము!

దామా :- వీరారెడ్డి, కన్నమదాసుందప్పించుకొని బ్రహ్మనాయునితో గవిసి
నాడు బ్రహ్మన్నకు. కన్నమదాసు, కొమ్మరాజును, వీరారెడ్డికి
ఇరువురు రెడ్డి వీరులను సహాయులుగా - పోరాడుచున్నారు.

గోపీ :- అరరే! బ్రహ్మన్న రణవిద్యాపాటవము! చూడ కన్నులు చాల
కున్నవి, వీరారెడ్డిని ఒక్కవేటుతో - తల నఱికి, తన సామంత
రాగోలకు బలి చేసినాడు కన్నమదాసు, కొమ్మరాజు, రెడ్డి వీరులను
చెరొకరిని గూల్చినారు. మాచెర్లసేనలో జయధ్వనులు! గురిజాల
సేనలో రోదనధ్వనులు!

దామా .- అదిగో! నాగాంబ, వీరారెడ్డి పతనముతో - కాలసర్పమువలె
బుసకొట్టుచు ఎక్కడనుండియో దూసికొని వచ్చుచున్నది.

గోపీ :- ఏమో అనుచున్నదిగూడ! అదియేను!

(తెరలో) నాయకురాలు

శా॥ ఏమేమీ? యిటు బ్రహ్మనాయుడరరే! యెంతే విజృంభించునే!
ఏ మాత్రంబిటు విక్రమింపగలడో? యాక్షింతు - కల్పాంత వే
ళామృత్యుంజయఫాలనేత్ర శిఖిలీలంబద్వు మత్క్రోధ కీ
లా మాలావళియుం దతండు శలభప్రాయుండు కాకుండునే?

దామా :- నాగాంబ విజృంభణతో గురిజాలసేనతో ఉత్సాహము రేకెత్తి
నది. అడిగో! కేతరాజు మాచెర్లసేనతో తలపడినాడు

గోపీ :- కొమ్మరాజు కేతరాజు నెదిరించినాడు, కేతరాజు కొమ్మరాజుల
ద్వంద్వయుద్ధము!

దామా :- ఇది కర్ణార్జునుల యుద్ధమువలెనున్నది కొమ్మరాజు మహాయోధుడు కేతరాజు, రణవిద్యాపాటవ మెంతో కలవాడు.

గోపీ :- కొండ కొండఢీకొన్నట్లున్నది. వారిచేతుల్లో కత్తులు కనపడుటలేదు. ఖణఖణాత్కారము లుఱుములుగా, తళత్తళలు మెఱుపులుగా - కాలాంబుదములవలె వీరరసము కురియుచున్నారు.

దామా :- అదిమాడు! కేతరాజు, కత్తి విసరినాడు! అది కవచమునుగూడ చించుకొని కొమ్మరాజుఱొమ్మునుచీల్చినది. అయ్యో! కొమ్మరాజు కూలినాడు!

గోపీ :- ఇటుచూడు! నాగాంబ, మలిదేవరాజుతో తలవడినది.

దామా :- అటుచూడు! బ్రహ్మనాయు డెదురైన వీరులనెల్ల తలలుడొల్ల వేయుచు ముందునకు సాగుచున్నాడు.

గోపీ :- బ్రహ్మనాయుడు, దూరముననుండుట చూచి, నాగాంబ, మలిదేవరాజు నేమో చేయునట్లుంకించుచున్నది.

దామా :- మలిదేవరాజు నాయకురాలితో యుద్ధముచేయుచున్నాడే గాని, ఆడువారితో పోరుచున్నానేయని కొంకుచు, అసలు బలముచూపలేకున్నాడు

గోపీ :- కన్నమదాసు, దళవాయిగా ఎంతయు రాణించుచున్నాడు. అటు బ్రహ్మనాయునకు, ఇటు మలిదేవరాజునకు మధ్య అడ్డముగానున్న గురిజాలసేనలను చీల్చిచెండాడుచున్నాడు.

దామా :- అయ్యో; అయ్యో, నాయకురాలు, మలిదేవరాజు గుండెలో గురిచూచి, కత్తి విసరినది మలిదేవరాజు పతనము!

గోపీ :- గురిజాలసేనలకు పట్టపగ్గములులేకున్నవి!

దామా :- కన్నమదాసు, రోష కషాయితాక్షుడై వారినెల్లర నఱకుటకు ఈవైపునుండి ఉఱుకుచున్నాడు. మనమావలకు తప్పుకొందమువద (వెళ్లుదురు)

కన్నమ :- ఓరోరి వైరివీరులారా!

> శా॥ యుద్ధజ్వాల కరాళమాలయిది ఓహో! అప్పుడే ఆరునే?
> సిద్ధంబై చనుదెంచినాడ - ఇపుడే ఛేదించి మీ శీర్షముల్
> యుద్ధంపుంగొలనెల్ల - ఎఱ్ఱకలువల్ పుష్పింపగా జేయుదున్
> ఇద్ధస్పర్ధను నన్ను దాకగలవారెవ్వారొ? రారండికన్.

(అని కత్తి దూసికొని ప్రవేశించుచున్నాడు)

నాయ :- (తెరలోనుండి యెదురుగా ప్రవేశించుచు)

శా॥ ఓరీ! కన్నమదాస! నీవొక మహాయోధుండవై నావుగా
బీరంబు ల్ప్రచరించుచుంటి, ఇపుడే వీక్షించెద న్నీదు బం
డారంబుల్, గురునంతవాడ నని సేనానాయక ప్రక్రియల్
పారంభించితి నాగమాంబయెదుటన్ వాలంబుతో నిల్వరా!

కన్న :- ఇదిగో వాలము చేతిలోనే యున్నది. కన్నమదాసు కత్తికాక నీకిప్పుడే చవిచూపెద

చ॥ పలుకుడువంట డంబములు భండనమందున బ్రహ్మనాయు నిం
గెలిచెద - కూర్చెదం జయము నీకని గట్టిగరాజుముందు - నీ
పలుకుల నుబ్బి కాదగు నృపాలుడు నేడిటువంటి పోరికిం
దలపడె - తన్నుగట్టుకొను తాళ్లను తా కొనితెచ్చుకొన్నటుల్.

నాయ :- ఓరీ సుంకరికన్నమా! నీకు బింకమింతున్నదిగా! ఇదిగో కాచుకో వేటు

కన్న :- ఊఁ సిద్ధముగనున్నాను.

(ఇరువురు కత్తులు డాళ్లు తాడించుకొనుచు కొంతసేపు పెనుగులాడి లోనకు - త్రోసికొని పోదురు)

(ప్రవేశము: దామానాయుడు గోపీనాయుడు)

గోపీ :- అరరే! ఎంతచిత్రము! కన్నమదాసు సామాన్యుడా? బ్రహ్మనాయుని శిష్యుడనిపించినాడు. నాగాంబ నవలీలబంధించి భటులకప్పగించినాడు.

దామా :- అదుగో! కేతరాజు వచ్చుచున్నాడు.

గోపీ :- కన్నమదాసు వాని నెదుర్కొనినాడు.

దామా :- కన్నమదాసిప్పుడు బాగా అలసియున్నాడు. కేతరాజుసామాన్యుడుగాడు. ఇప్పుడేమగునో!

గోపీ :- అబ్బా! వీరియుద్ధముచూడలేము. ఒక్కొకక్క వేటునకు కొండలు పిండియగుచున్నట్లున్నవి. డాలు కత్తుల ఝణఝణలతో నిప్పుకణములు రాలుచున్నవి పాదఘట్టనలకు - పుడమి పుటపుటలాడుచున్నది.

దామా :- అరరే! కేతరాజు, కన్నమదాసు తలఁ ఱకినాడు.

గోపీ :- సుంకరికన్నమ యెంతయుద్ధముచేసినాడు. నెత్తుటి వెల్లువలో శత్రువుల తలలు కాగితపుపడవలవలె దొర్లించినాడు.

దామా :- కం॥ మలిదేవరాజువడె బొ
మ్మలు చీరగ నాగమాంబ పొడిచిన కత్తిన్
తలతెగి కన్నమదాసి దె
యిలపై బడినాడు యుద్ధమేమున్నదికన్.

గోపీ :- అటు చూడు! అక్కడ పోరుచున్న బ్రహ్మనాయుడు, దూరమునుండియిటు చూచినాడు. మారిమసగినట్లు యుద్ధభూమి పలుచబడినది. మలిదేవరాజులేడు కన్నమదాసుకనపడలేడు. సామంత ఈగోల అక్కడనే నేలపైగుప్పించినాడు. ఇక యుద్ధముముగిసినట్లే అటు పోదము పద. (వెళ్లుదురు)

(తెరయెత్తగా)

బ్రహ్మ :- (అక్కడ విషాద వివణ్ణ హృదయుడై)

మ॥ అరులంగెల్చి, ఒసంగెన్ సకలరాజ్యం బండి నాకేటి క
స్థిరముల్ రాజ్యసుఖాది రక్తులివియిస్సీ! యంచు నాగాంబికా
కరవాలంబది గుండెడుస్సిచన వేగన్ స్వర్గసౌఖ్యాలు సు
స్థిరముల్ కొల్ల గొనంగబోయితివా? పృథ్వీపాల చూడామణీ!

(కన్నమదాసుముద్దేశించి) నాయనా! కన్నమదాసూ! నిన్నెంత పెంచితిని! ఎంతదిద్దితినిరా! బాలచంద్రుని నిన్ను ఒకటిగాచూచితినే! కన్నకొడుకు వాడుగా - పెంచినకొడుకు నీవనుకున్నామురా! నిన్న వాడుతీరినాడు నేడు నీవుతీరితివి.

శా॥ అంటంగూడని మాలకన్నమని ఏలా? వెట్టిబ్రహ్మన్న తా
నింటబెంచుచు - చాపకూళ్లొసగువాడేయంచు లోకుల్ నమన్
అంటం గూడనులెక్కచేయకిటు నా యింతొటకుందిద్దితిన్
జంటంబాయక నన్నుగొల్తు విపుడీ చందంబు నంగూతితే?

(నిర్లిప్తుడై రెండడుగులువైచి) రాజులేడు, కొడుకులేడు పెంచినకొడుకు కన్నములేడు, అన్న బాదన్నలేడు, తమ్ములులేరు. కొమ్మలుగొట్టిన మ్రానువలె ఒక్కడనిలబడినాను నాచేతిమీద స్వర్గఖండముగదిద్దిన పలనాడు పాడైనది. కార్యము పూడి కదన భూమి ఎందరినిబలిగొన్నది! ఎంతరక్తము నాగులేటకలిసిపోయినది! ఈ మహాప్రళయమునకెల్ల కోడిపందెములుమూలమై - ఆ కోడి పందెములకు మతద్వేషము మూలమై, ఆ మత ద్వేషములకు

నాయకురాలు మూలమై, ఆ నాయకురాలికి నేను మూలమై ఎం-
మారణయజ్ఞము జరిగినది! ఇంతచేసి, నలగామరాజు, కొండగుండ్లకు పారిపోయినాడని వింటిని. నాకు, వానిని చంపవలయుననిలేదు. ఒకసారి వానింజూడవలయునని యున్నది. పలనాటిపతనమునకు మూలకందము! నాయకురాలే మైనదో?

భటులు :- (బందీకృతయై యున్న నాగమ్మతో వత్తురు) మహామంత్రిగారూ! ఇదిగో నాయకురాలు.

బ్రహ్మ :- (ఆశ్చర్యముతో) ఈమె యిట్లయినదేమి?

భటులు :- కన్నమదాసు, ఈమెను బంధించి మీ కర్పింపమని మా కప్పగించినాడు.

బ్రహ్మ :- (ఉప్పొంగుచు) అట్లనా? ఇదే వాడు నా కొసగు గురుదక్షిణ! కట్లు విప్పుడు! కత్తి నిండు!

భటులు :- (అట్లు చేయుదురు)

బ్రహ్మ :- నాయకురాలా! మహామాయీ! ఆరినదా నీ క్రోధజ్వాల! తీరినదా నీ రక్తదాహము? అదిగో! చూడు! పీనుగులై పడియున్న యేనుగులు! ముంగాళ్లుపోయి మొగ్గతిల్లిన గుఱ్ఱాలు! కాళ్లు సేతులు తెగి వికృతంగా పడియున్న కాలిబంట్లు! నెత్తుటేఱులలో బడిపోవు శిరములు, కరములు, ప్రేవుల ప్రోవులు, నీ కిదియంతయు - కన్నుల పండువుగా కనపడుచున్నదా? నాగాంబా! పలనాటి గడ్డపై వీరజాతి బీజమాత్రముగాగూడ లేకుండ పోయినది. తరతరాలుగా దేశము నిర్వీర్యమైపడియుండు దుస్థితి బొందినది - మగలను గోలుపోయిన మగువలు, కొడుకులను పోగొట్టుకున్న తల్లులు, తండ్రులు పోయిన బిడ్డలు, పోషకులు లేకుండపోయిన ముదుసళ్లు మాత్రము మిగిలిపోయినారు పలుచ పలుచనై పలనాటి సీమ వెలవెలపాటుతో కళవళపాటుతో దుఃఖాగ్నులు రాజుచున్నది. దేశమున భీరులుతప్ప వీరులు లేకుండపోయిరి సర్వనాశనమే నీ సంకల్పమైనచో సంతోషించు నాగాంబా! నీ వీరకేళిలో నా ప్రభువు, కొడుకు, అన్నదమ్ములు నిశ్శేషమైనారు ఓ మహాకాళీ! రణరంగవిరచితకంకాళీ! నీ శత్రుశేషముగా నే నొక్కడ నిలిచి పోయినాను. ఇదిగూడ లేకుండ జేసికొని నీ రాజుచేత నిష్కంటకముగా రాజ్యమేలించు! మహామంత్రిణీ! ఊఁ నీ కత్తి ఝుళిపించు? ఇదిగో! శిరస్సు! నీ సంకల్పము నెరవేర్చుకొని, నీవారాధించు దేవునకు మంగళముపాడు! ఏమట్లాలోచించుచున్నావు?

ఉ॥ నాయకురాల! శతృదను నాయుడనేను, కృపాణమూని యే
దీ? యిటు నావయింబరపుమీ! రణశేషము శతృశేషముం
బాయుగ నీకు - నాకు వ్యథపాయగ - నాదు శిరంబు నిప్పుడే
తీయుమి! ఏయుమింకవెనుదీయకుమీ! సుకృతంబు నీకగున్.
(తలొగ్గుచున్నాడు)

నాయు :- (పరితప్త హృదయముతో - కత్తి క్రిందబడవైచి బ్రహ్మనాయుని కాళ్లపై మోకరిల్లి) క్షమించు బ్రహ్మనాయుడా! నీ ధీరతకు, గంభీరతకు, ఉదారతకు చకితనగుచున్నాను. నాగాంబ పరితప్తయైనది. కన్నీళ్లతో కాళ్లుకడుగుచున్నది. మన్నించు మహామంత్రి! తలదీయుమనుచున్నావు. చేసిన పాపాలు చాలవా? అవి నన్నధఃపతితను గావించి ఏ క్రిమికీటజన్మలనో యెత్తించును జన్మపరంపరా బహుళ దుఃఖముతో కుంగి, కృశించి, కూలిపోవుదును. శీలము నాయుడా! నీ శీలము జగదభినందనీయము. నీ శాంతి కాముకత్వము, నీ సర్వ వర్ణ సమాదరణము, నీ తరతమభావరాహిత్యము విశ్వ జన రంజనములు, విశ్వకల్యాణ కారణములు నీ అకుటిల రాజనీతిలో శ్రేయోరాజ్యస్థాపనమున్నది. నా కుటిలనీతిలో సర్వనాశనమున్నది. ఈ యుద్ధమే నిదర్శనమిందుకు. అల్పజ్ఞానినైననేను, అనల్పజ్ఞానివైన నిన్నపార్థము చేసికొంటిని ఎందుకో, నాకు నీయందసూయా ద్వేషములు ప్రబలినవి. మానని మతద్వేషము మంటలు రేపినది, నీపై పగ పొగరాజి సెగలు చిమ్మినది మీ నాశనమునకై నేనెన్నో చేసితిని. మలిదేవులకు విషము పెట్టించితిని. కోడిపందెమున మోసపు కోడిని ప్రయోగించి రాజ్యమొడిచికొంటిని, కానక్రింతలకు దోలితిని. మండాది మందపోటు జరిపి అలకన్నను బొడిపించితిని ఎందఱిని వంచించితిని! రాయబారియగు రాజుగారల్లుని - పూవుల విషము పెట్టి చంపించినది నేనే, పేరమాంబ భర్తృశవముతో - చితాగ్నులందు మాడిమసియై పోవుటకు - కారణము నేనే - ఆ దృశ్యము కన్నులు మూసికొన్నను నాకు గోచరించుచున్నది. పేరంటాలలో గలిసిపోయిన పేరిందేవి ప్రేతాత్మ నిశలందు నా గుండెల మీద గూర్చొని నిద్రపోనీయదు. మధురమైన వారి దాంపత్యములో విషము పోసినాను, మీ రాయబారములు కాకుండజేసి, మిమ్ము

రణమునకు లోగినాము. ఈ మహారక్తపాతమునకు మూలము నేను, ఆ పాపకలాపము, ఆ మారణయజ్ఞమిక చాలు బ్రహ్మనాయుడా! మహామంత్రి! నలగామరాజునకు యథాపూర్వముగ నీవే మంత్రివై రాజ్యమేలింపుము! యథాపూర్వస్థితిని పలనాటినిదిద్దుము! నే నిక్కండుండను నన్నక్కడి ప్రజలు దుమ్మెత్తిపోయుదురు. నా పాపపరిహారమునకు నేనేదో చేసికొనవలయును. ఆ కనబడు కొండకనుమల్లోబడి, కనబడకుండ పోయెదను నేను. కనబడకుండ పోయి నా తెలుగునాట పలనాటిచరిత్రలో నా కళంకము చెఱిగిపోదు. పోయెదను బ్రహ్మనాయుడా సెలవు (అని బ్రహ్మన్న కాళ్లకు మ్రొక్కి అదే పోకగా పోవును)

బ్రహ్మ :- (దిగ్భ్రాంతపోయి) చిత్రముగా నున్నది! నాగాంబయిన్ని చెప్పుచుండగా మాన్పడితిని, ఒక్కమాటయేని మాటాడనియక వాగ్బంధనము చేసినది అదిగో! అదే పోకగా తిరిగిచూడనైన చూడక పడమటి కనుమల్లోబడి పోవుచున్నది. ఏమి యీ చిద్విలాసము! చెన్నకేశవా! స్వామీ! పలనాడెట్లు పెరిగినదో, అట్లు విరిగినదేమయ్యా! పెరుగుట విరుగుట కేయందువా ప్రభూ! నా అనువారులేకుండ నన్నొకాకిని జేసితివేమయ్యా! తండ్రీ! నేను కాగూడదనుకొన్నదెల్ల అయి తీరినది ఇష్టములేకపోయినను, కార్యము పూడి కదనభూమికి నన్నీడ్చుకొని తెచ్చినట్లయినది. సర్వనాశనమై పోయినది ఎంతతప్పింతమన్నను తప్పలేదీ రక్తపాతము! దీనికి తిరుగులేదు కాబోలు! బ్రహ్మనాయుడను వాడు పుట్టకుండిన ఈ దేశమున కీపాటు పుట్టెడిది కాదేమో? నేను పుట్టి! నాగాంబకు నాపై పగలు పుట్టి అంతా మట్టిపాలై పోయినది నేనా పాడుపడి నట్లుండు పలనాడు పోలేను. అనదలు ప్రజల మొగాలు చూడలేను నేనుగూడ గుత్తికొండ బిలమునకు బోయి తపస్సుచేసి, బహుళ సంతాపతప్తముగ జీవితము చాలించెద. (రెండడుగులు వేయును)

నల :- (ప్రవేశము) మహామంత్రీ బ్రహ్మనాయుడా! రక్షింపుము, రక్షింపుము! (బ్రహ్మనాయుని కాళ్లపై బడి)

చం॥ ఎఱుగక బుద్ధిలోపమున స్త్రీకునితో బ్రతివచ్చుపట్టి ని
ర్భరమహిమాఢ్యు నిన్ను బొడువండల పెట్టియు లేనిపోని సం
గరమునకుం గడంగితిని నాశనమైతిని నన్నుగావవే!
శరణని నీదు పాద జలజంబులపై బడినాడ దీనుడన్.

కేత :- (ప్రవేశము) పలనాటి కృష్ణుడవైన బ్రహ్మనాయుడా! మహామంత్రి గతమును విస్మరించి, దీనుడై పలవించు నలగామని చేరదీయుము!

బ్రహ్మ :- (బావురుమని యేడ్చుచు నలగామని లేవనెత్తి కౌగిలించి కొనును)

కేత :- బ్రహ్మనాయుడా! గురిజాలకు వచ్చి, నీ చేతిమీదుగ అఖండ పలనాటి రాజ్యమునకు నలగామని పట్టాభిషిక్తుని జేయుము. యథాపూర్వము నీ మంత్రిపదవి నిర్వహింపుము.

బ్రహ్మ :- (వైముఖ్యముతో) ఎందుకు కేతరాజా! మరల నాకీ బంధము? అన్నీ ఉడిగినవి. కొండగుహలందు తపస్సుచేసికొన నిశ్చయించు కొంటిని నన్ను పోనీ -

కేత :- అట్లుకాదు బ్రహ్మనా! అయినదేమో అయినది. అలుగురాజు సంతానములో మిగిలినది ఈ నలగామ రాజొకడు, బాల మలిదేవుడొకడు. వృద్ధరాజు మరణశయ్యపైనుండి, చేతిలో చెయ్యివేయించుకొని చెప్పినమాటలు జ్ఞాపకము చేసికో బ్రహ్మనా! బాల మలిదేవుడు యువరాజుగా. నలగామరాజును పలనాటిరాజ్యమునకు పునః ప్రతిష్ఠితుని జేయుము.

బ్రహ్మ :- నన్నీ జలజాటములో బలవంతముగా ఏలదింపెదవు కేతరాజా! పరితాపతప్తుడనగు నాకు తపము తప గత్యంతరములేదు. ఇకనైనా సుఖదుఃఖాతీతమగు పదవికి ప్రాకులాడకున్న పతనమగుదును.

కేత :- నీ వేమి పతనము కావద్దు బ్రహ్మనా! నీ చేతిమీదుగ ఈ పని నిర్వహించి, నీ యిచ్ఛానుగతి ఒనర్పుమని కోరుచున్నాను. దుఃఖరుద్ధ కంఠముతో నలగామ రాజిప్పుడు మాటాడలేకున్నాడు. వాని ముఖముచూడు! మూర్తీభవించిన శోక దేవతలాగున్నాడు. జాలి చూపుము బ్రహ్మనాయుడా! నా ప్రార్థన మంగీకరింపుము మహామంత్రీ (చేతులు పట్టుకొనును)

బ్రహ్మ :- నిట్టూర్చి సరే మీరు కోరినట్లు, నాచేతిమీదుగ పలనాటి రాజ్య సింహపీఠికి నలగామరాజు పునఃప్రతిష్ఠితుని జేసెద. అంతవరకే నా ఆచరణము. తరువాత నా నిశ్చితానుసరణమే శరణము భవతరణము. పదండిగురిజాలకు -

(అందరు కదులుదురు) (తెరపడును)

రాజధాని : గురిజాల

## నలగామరాజు పట్టాభిషేకము

(ప్రవేశము : నలగామరాజు, బాలమలిదేవరాజు, బ్రహ్మనాయుడు, కేతరాజు – వాద్యఘోషల అనంతరము)

బ్రహ్మ :– (కిరీటము నలగామరాజు శిరముపై బెట్టుచు) నలగామరాజా! పలనాటి సింహపీఠికి నీ పునః ప్రతిష్ఠాపనము! నీవీ రత్న కిరీటము ధరించి గతానుభూతిని విస్మరింపక, విభూతులెసలార వెనుకటికంటె లెస్సగ – పలనాటిని పాలింపుము. నాయనా! బాలమలిదేవా! నీవు యువరాజపట్టము వహించి, అన్న తరువాత రాచటికము నిర్వహింతువుగాక!

-: భరతవాక్యము :-

సీ॥ ఐకమత్యము చెడక అన్యోన్యమైత్రితో
ఎల్ల ప్రజల్ సుఖియింతురుగాక!
ఒరుల సంపదలకు – ఓర్వజాలని బుద్ధి
ఊర్వినేరికి బుట్టకుండుగాక!
రణమున జీవితార్పణములు చేసిన
వీరపూజలు జరిపింతురుగాక!
వీరజీవితము, కవికళాన జీవించి
తెలుగునాట నిలిచి వెలుగుగాక!
యుద్ధములులేక శాంతిసుఖోన్నతమయి
ప్రజల రాజ్యమై దేశము ప్రబలుగాక!
పాడిపంటలతోడ సంపదలతోడ
అలరుగావుత శ్రీ విశాలాంధ్రభూమి!

కేత :– తథాస్తు! తథాస్తు! తథాస్తు.

మంగళము

(తెరపడును)

గద్యము:– ఇది శ్రీ చౌడేశ్వరీ కరుణాలబ్ధ కవితావిభాసుర, దేవాంగ కులోద్భవ, కాశ్యపగోత్ర, పింజలవంశ పవిత్ర, కోటివీరయ్యపౌత్ర, సుబ్రహ్మణ్యపుత్ర, సుకవిజన విధేయ, సోమశేఖర నామధేయ విరచిత పలనాటి వీరభారత దృశ్యకావ్యము సమాప్తము.